రక్షకభటుడే భక్షకభటుడై వరాలును నిర్దాక్షిణ్యంగా కొట్టి, అనుభవించి, పోలీస్‌స్టేషన్లలో జరుగుతున్న అన్యాయాలకు అంతంలేదని నిరూపించాడు. ఈ దృశ్యాన్ని కళ్లారాచూసిన రిక్షా నూరిబాబును అతిదారుణంగా లాకప్‌లో చంపడం 'లాకప్‌డెత్'లకు ఒక ఉదాహరణ.

ఎంతోమందికి న్యాయంచేకూర్చాల్సిన జడ్జి శ్యామసుందరవరప్రసాద్, తనకూతురు, కోడలి విషయంలో అమానుషంగా ప్రవర్తించి న్యాయవ్యవస్థకే మాయనిమచ్చలా మిగిలాడు.

న్యాయం ఇంకా బతికేఉంది- అని నమ్మిన లాయర్ సత్యసుందరం వరాలుని మనస్ఫూర్తిగా ఇష్టపడి కూడా చివరికి కొందరి స్వార్థపూరిత చర్యలవల్ల కేసుని ఒదులుకోవడం నేటిసమాజంలోని పెద్దమనుషులు చేసే ఘనకార్యాలకు ప్రతీక.

చివరికి వరాలు పవిత్రన్యాయస్థానంలోనే చనిపోవడంతో న్యాయానికి కళ్లేకాదు చెవులు కూడా లేవని నిరూపించినట్లయింది.

కథ మామూలుదే అయినా కథనంవిధానం, వర్ణన రక్తికట్టించాయి.

'చతుర' నవలా కుసుమాలలో ఒక సుందరమైన పుష్పం 'అగ్నివనంతం'. నేటి సమాజంలోని నేరాలను, ఘోరాలను కళ్లకు కట్టినట్టు చిత్రీకరించిన వేగావతిగారిని అభినందించకుండా ఉండలేకపోతున్నాను.

—సి.హెచ్.రవికిరణ్, కొత్తగూడెం

## "నవల సినిమా స్క్రిప్టు కారాదు!"

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

వ్యభిచారం సమాజాన్ని అనాదిగా పీడిస్తున్న రుగ్మత. భద్రత, గౌరవాలతో జీవించడానికి మనిషికి కలిగిన హక్కును దోపిడి ద్వారా, దౌర్జన్యం ద్వారా హరించివేసే ఈ సాంఘిక దురాచారాన్ని ఎందరో సాహిత్యవేత్తలు ఎన్నో మార్లు స్పృశించారు. అయినా అన్నెం పున్నెం ఎరుగని అడవిమల్లె లాంటి మరో అబల అడుగడుగునా వ్యాపారదృక్పథం ప్రబలిన ఈ నికృష్టవ్యవస్థలో పాశవికంగా ప్రాణాలు కోల్పోవడాన్ని వేగావతిగారి 'అగ్నివనంతం' మన ముందుంచింది

ఇతివృత్తం పాతదే అయినా జ[illegible]తంలాంటిశైలి పాఠకుణ్ణి ఆకర్షిస్తుంది. సమాజపు చదరంగంలో వరాలులాంటి నిర్భాగ్యులు, భ్రష్టులు, పతితలు, బాధాసర్పదష్టులు బలైపోవడంపట్ల రచయిత్రికి గల ఆవేదనను నవల ప్రస్ఫుటం చేస్తుంది. కానీ, మోతాదు మించి చేసిన ఉద్రేకపూరిత వ్యాఖ్యానాలూ, అక్కడక్కడా పదాడంబరంతో నడిపిన సంభాషణలూ కృతకంగా వున్నాయి "అది పడుపుకొంపకాదు. భూనభోంతరాళాలు దద్దరిల్లే ఘోష. పేగులు తెంపుకుని వెల్లువికే ఆక్రందన, ప్రతి అన్నకూ చెల్లెలుగా, ప్రతితమ్ముడికీ అక్కగా, ప్రతి తండ్రికీ కూతురుగా... (పేజి 77) లాంటివి.

సినిమాలో నటీనటుల [illegible] లు కూడా సునిశితంగా చూపిస్తున్న [illegible]లూ, రచయిత చేసిన వ్యాఖ్యానాలూ నవల స్థాయిని కొంత దిగజార్చాయి. ఆమె [illegible] చెయ్యెత్తింది.. అది జోరుగా [illegible] చెంపని తాకేంతలో అతనిచేయి ఆమె [illegible] అడ్డుకుంది" (పేజి 57) లాంటివి రచయిత రాస్తున్నది ఒకనవలేకానీ, సినిమా స్క్రిప్టు కాదని మరచిపోయినట్లున్నారు

జడ్జి, సత్యసుందరంలాంటి పాత్రలు కూడా కొన్ని ముఖ్యసందర్భాల్లో వాస్తవానికి అతీతంగా నడిచాయి నవల నవలగానే [illegible] తప్ప సినిమా స్క్రిప్టు కారాదన్నది పెన్ను[illegible]న్న రచయితలు గుర్తుంచుకుంటే తెలుగులో తప్పక మంచి నవలలు వస్తాయి

—టి.రాజగోపాల్, కడప

## వినూత్న శైలి

*(తృతీయ బహుమతి రు 50/- పొందిన సమీక్ష)*

సమకాలీన సమాజంలోని ఒక చీకటికోణాన్ని చక్కగా ప్రతిబింబిస్తోంది వేగావతిగారి 'అగ్నివనంతం'. ఇతివృత్తం పాతదే గతంలో కొన్ని నవలలు ఇదే కోవలో వచ్చాయి. అధికశాతం స్త్రీ శీలానికి సంబంధించినవే కానీ ప్రభావ

వంతమైన భాష, శైలితో వినూత్నంగా ఉంది "అగ్నివసంతం". ప్రతిపదంలోనూ ఆవేదన గుండెను పిండుతుంది.

మనసమాజాన్ని ఎప్పుడూ ఏదో ఓ అంటు వ్యాధి లాంటిది పీడిస్తూనే వుంటోంది. ఒకసారి కులమైతే మరోసారి అంతస్థుల తేడాలు ప్రేమికుల మనస్సుల మధ్య ఇనుపగోడల్లా లేస్తాయి. బ్యూరోక్రసీకి ప్రతిరూపాలయిన శ్యామసుందరం లాంటివాళ్లు ఈ వ్యాధిని పెంచి పోషించే సమాజవిద్రోహులే. నిష్కళంక ప్రేమకు ప్రతిరూపాలైన ప్రమీల, ప్రసూనలు ఆత్మహత్యలు చేసుకోవడం, వరాలుని అసాంతం నిస్సహాయురాలిని చేయడం అడది ధనికవర్గంలో ఉన్నా బలహీనవర్గంలో ఉన్నా అబలమాత్రమేనని ఢంకా బజాయించి చెప్పినట్లున్నది.

'భక్షక' భటుల అకృత్యాలవర్ణనలు చదివి, ఇవి మరీ ఇంత దారుణమా? అని అనుమానించినా వార్తాపత్రికలలో భగ్గుమండే లాకప్ మరణాలు ఆ అనుమాన నివృత్తి చేస్తున్నాయి.

స్త్రీ అయిన వరాలుని శారీరకంగా, మానసికంగా పీల్చి పిప్పిచేసి శవాన్ని చేసినా, న్యాయం ధర్మం, నీతినిజాయితీలను నమ్మిన సత్యసుందరాన్ని పరోక్షంగా భవిష్యత్తుని చూపి భయపెట్టినా అది మనసమాజ నిర్వీర్యతకు ప్రతిరూపమే.

చట్టంలోని లొసుగులని ఉపయోగించుకొని నిర్భయంగా అక్రమాలు సాగించే ప్రబుద్ధులు అదే అసలుసిసలు ప్రజాస్వామ్యం అంటున్నారు. వారికి పాఠం చెప్పడానికి యువత ధనుఘంకారం చేయాలి. కనీసం అక్షరాల కేకలయినా నలుమూలలా ప్రతిధ్వనించాలి. అన్యాయాల్ని మాడ్చి మసిచేసి వసంతాన్ని వెదజల్లాలి.

అడదాన్ని అబలగానే మిగల్చడం మినహాయించి తన ఆవేదనను పాఠకులకు పంచడంలో రచయిత కృతకృత్యులయ్యారనే చెప్పవచ్చు. మొత్తానికి ఓ మంచి నవల చదివామన్న తృప్తేకాక కర్తవ్యం కూడా వెన్నుతడుతోంది "అగ్నివసంతం" చదివాక.

—డి.పద్మశ్రీ, ఆర్మూర్

## ఆలోచింపజేస్తుంది

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

గజానికొక గాంధారీ కొడుకున్న దేశం మనది. తన స్వంత చెల్లిని, తల్లిని తప్ప పరాయిస్త్రీలందర్నీ అదోరకంగానే చూసే పురుషపుంగవుల నిలయమిది. స్త్రీ శరీరంమీద వ్యాపారంచేసే ఆధునికులు, ఆ శరీరాన్ని అంగడిలో కొనుక్కునే పెద్దమనుషులు కోకొల్లలుగా ఉన్న పుణ్యభూమి మనది. ఈ వ్యవస్థలో స్త్రీని రక్షించి, కాపాడవలసిన ధర్మం, చట్టం, న్యాయం-ధనానికి, పదవికి అమ్ముడుపోతున్నాయి. లాఠీలు పేదవాడిని హింసించడానికి, అమాయకుల్ని ఏడిపించడానికి ఉపయోగపడుతున్నాయి. దిక్కులేని స్త్రీల శీలాన్ని కాలరాచి, హరించే దుశ్శాసన సంతతి మనది. "యత్రనార్యస్తు పూజ్యంతే— రమంతే తత్ర దేవతా" అనబడే ఈ వేదభూమిలో స్త్రీకిరక్షణే లేదు. స్త్రీకి స్త్రీయే శత్రువు . సుకరాజులాంటి ఆడరౌడీలు అమాయక స్త్రీలపై వ్యాపారంచేసి ఎందరు వరాలులాంటి చెల్లెళ్ళను ఏడిపిస్తున్నారో చదువుతుంటే గుండె జలదరిస్తుంది. వరాలు అమాయకంగా మోసగింపబడి వేశ్యావాటికల్లో చస్తూ బతుకుతున్న పతితలకు వరాలు ప్రతీక. ఈనాడు వేశ్యావాటికల్లో ఎందరు అభాగినులు ఆక్రందనలను గుండెగదుల్లో దాచుకుని, వేదన, రోదన అనుభవిస్తున్నారో ఈ "అగ్నివసంతం" చెప్తుంది. సత్యారావు, అప్పిగాడులాంటి క్రూరులు కోకొల్లలు. మంచి కథను అద్భుతమైన పదాలతో చిత్రీకరించారు రచయిత. కాని కొన్నిచోట్ల వర్ణనలు మరీఎక్కువయ్యాయి. శైలికొంచెం సులభతరం చేస్తే బాగుండేదేమో. కొన్ని వర్ణనలు మరీ పచ్చిగా ఉన్నాయా అనిపిస్తుంది.

"నేను తెలీక గోతిలో పడ్డాను. మరి చదువుకున్నవారు మీ రెందుకు తప్పు చేస్తున్నారు"

"అపుడు రక్షణ మందిరంలో మోసగింపబడింది. ఇప్పుడు న్యాయమందిరంలో కూడా మోసగింపబడింది"

వంటి సంభాషణలు బావున్నాయి. జడ్జీగారి కుటుంబ చిత్రం ఎందరో ధనవంతులకు ప్రతీకగా చిత్రీకరింపబడింది. మొత్తంమీద ఈ నవల ఆలోచింపచేసిందనవచ్చు.

—బి. రాంబాబు, రంపచోడవరం





## బడబాగ్ని

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'అగ్నివసంతం' నవలలో చిత్రీకరించిన నేటి రక్షణ, న్యాయవ్యవస్థలు పాఠకులను ఆలోచింపజేయడమేకాక మేలుకొలిపేలా ఉన్నాయి.

వ్యభిచారగృహాల్లో, వాటి నిర్వాహకులు జరిపే ఘోరమైన తంతును చూస్తే ఎంతటి కర్కశహృదయులైనా చలించకమానరు. ఆ మురికికూపాలనుండి బయటపడాలనుకొనే అభాగినులకు ఎదురయ్యే పరిణామాలు, అనుభవించాల్సిన అవస్థలు చదువుతేంటే అవి కళ్లముందే జరుగుతున్న అనుభూతి కలిగి శరీరం గగుర్పొడిచింది.

సత్యసుందరం మీద పాఠకులు పెంచుకున్న ఆశలు చివరకు అడియాశలుగానే మిగిలిపోయాయి. చివరికి అతన్నొక అవకాశవాదిగా, అసమర్థునిగా చిత్రించడం కేవలం నవలను విషాదాంతంగా మలచడానికి చేసిన ప్రయత్నంగా తోస్తోంది. నేటి వ్యవస్థలో న్యాయానికి ఏమాత్రం చేటులేదన్నట్టుగా చిత్రీకరించడం కొంత సమంజసంగానే ఉన్నా నవలాపరంగా చివరిమలుపు పాఠకులకు నిరాశను కల్గించింది.

పోలీసు వ్యవస్థ సిగ్గుతో తలవంచుకొనేటట్టు చేసే వాస్తవాల్ని బయట పెట్టడంలో రచయిత నిర్భీతిగా వ్యవహరించారు. రక్షకభట నిలయాలలో జరిగే భక్షణకృత్యాలు ఎంత భయంకరంగా ఉంటాయో, అందులో ప్రవేశించినవారి గతులు ఏమవుతాయో, లాకప్‌డెత్‌లు ఎలా ఉంటాయో, వాటిని కొందరు ఎంత తేలికగా ఇతరులపైకి తోసేసి తమ చేతికి తడితగలకుండా చేసుకోగలరో చక్కగా వర్ణించారు.

కొంతమంది న్యాయమూర్తులలో దాగివున్న రాక్షసులు ఎలాఉంటారో జడ్జి శ్యామసుందరవరప్రసాద్‌లో ప్రత్యక్షంగా కనిపించారు. కానీ ఆయన కథ అసలు కథలో సరిగా ఇమడలేదు.

ఏది ఏమయినప్పటికీ పాఠకుల హృదయాల్లో 'అగ్నివసంతం' నిజంగా బడబాగ్నినే రగిలించింది.

-భరద్వాజ రమణయ్య, తూర్పుకంభంపాడు

## "యదార్థ రూపకల్పన"

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

వేగావతిగారి "అగ్నివసంతం" పాఠకలోకానికి వాస్తవజీవితాన్ని అందించింది. లోకం తెలియని పల్లెటూరిపిల్ల వరాలు చరిత్రను కళ్ళకు గట్టినట్టు చూపింది. ఓ అబల కన్నీటి గాథకు రూపకల్పన చేయటంలో రచయిత సఫలీకృతం కావడమే కాకుండా చదివిన ప్రతివారిని ఆలోచింపజేసేదిగా ఉంది నవల.

వరాలు ప్రసాదించే దేవుడు సైతం సమాజంలోని నికృష్టరాజకీయుల రాక్షస మనస్తత్వాలకు భయపడి మూగబోయి అచేతుడై వరాల మూటయిన వరాలుకు ఈ సంఘం నుంచి నిష్క్రమించే వరాన్ని మాత్రమే ఇవ్వగలిగాడు. ఆమెకు జీవితంపై ఆశను చిగురింపజేయలేకపోయాడు. ప్రవర్తన మారాలని, నైతిక విలువలకు మన నడవడిక అద్దంపట్టాలనే ఆదర్శాన్ని ఈ నవల ఉద్బోధించింది.

కుప్పలుతెప్పలుగా వచ్చే ఈనాటి నవలల్లో ఆలోచింపజేయగలిగేవీ, వాస్తవాన్ని నిర్భయంగా పాఠకులకు అందించి వారిలో మంచికి, చెడుకు, నీతికి అవినీతికి, న్యాయానికి, అన్యాయానికి సంబంధించిన ఆలోచనను రేకెత్తించేవి కొన్ని మాత్రమే.

"అగ్నివసంతం" ఇతివృత్తం కథావస్తువు పాతదైనా రచనాశైలి, చెప్పిన తీరు సందేశాన్ని అందించటంలో వేగావతిగారు విజయాన్ని సాధించారు కాని ప్రశ్నగా మిగిలిన వరాలు జీవితాన్ని పలకమీద నుండి తుడిచేయకుండా పరిష్కారమార్గాన్ని సూచిస్తే ఇంకా బావుండేది. తప్పును తప్పుగా వివరించి చెప్పటమేగాక ఆ తప్పును ఎలా సరిదిద్దుకుంటే బావుంటుందో కూడా చెప్పే స్థాయిలో రచయితలు ఉండాలనుకోటం అత్యాశ కాదుగదా!

—మహమ్మద్ ఉస్మాన్, ఖమ్మం

ముఖచిత్రం: శివాజీ

# చతుర

సంపుటి: 12 ఫిబ్రవరి 1989 సంచిక: 1




జీవనయాత్రలో చివరిమజిలీ వృద్ధాప్యం. ఇన్నాళ్ళూ తనకోసం, తనవాళ్ళ భవిష్యత్తుకోసం శ్రమించిన తనువూ, మనసూ అలసిసొలసి ఉండేదశ అది. మనశ్శాంతి, విశ్రాంతి కావలసిన ఆ సమయంలో అవి ఎందరికి లభ్యమవుతున్నాయి? మరెందరికి గగనకుసుమాలవుతున్నాయి? అలాంటి వారిలో ఉత్సాహాన్నీ, ఉత్తేజాన్నీ రేకెత్తించి జీవితాలకు ప్రశాంతిని సమకూర్చేందుకు ఏమైనా చేయాలనే తపన ఆమెది. "ప్రొఫెసర్... నీకు నేను అండగా ఉన్నాను" అంటూ వెన్నుతట్టి ఆమె లక్ష్యసిద్ధికి తోడ్పడ్డాడామె భర్త.

వయోభారం పైబడగా అయినవాళ్ళంతా నిర్లక్ష్యంచేస్తే మూగగా రోదించే ఆ వృద్ధుల కన్నుల్లో కాంతిరేఖలు వెల్లివిరియించటానికి ఆమెచేసిన కృషి ఏమిటి? సాటిమనిషిగా వారికి ఆమె ఎలాసాయపడింది??

ఆర్తితో సాగి ఆద్యంతం మనసు స్పందింపచేసి, ఆలోచింపచేసే

సరోజ నారాయణరావ్ కన్నడ నవల 'వానప్రస్థ'కి

యన్. ఉమాదేవి స్వేచ్ఛానువాదం

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్రనవల

# వానప్రస్థం

— సరోజ నారాయణరావ్

పిల్లలిద్దరూ స్కూలుకి బయల్దేరారు. వాళ్లు వీధిమలుపు తిరిగేవరకూ చూస్తూ అక్కడే నుంచుంది యశోద. ఇద్దరూ ఎంతత్వరగా ఎదిగిపోయారు! నిన్నమొన్నటివరకూ ప్రతాప్ ఉయ్యాల్లో రబ్బరుబంతిలా ఊగుతుంటే పర వశంగా చూసేది తను. అశోక్‌ని ఒళ్ళో కూర్చో బెట్టుకుని అఆఇఈలు దిద్దించిన రోజులింకా గడిచినట్టేలేదు. ఇద్దరూ పొడుగెదిగిపోయారు. చదువుల్లో, పనుల్లో వాళ్ళకి తనసాయం అక్కర్లే దిప్పుడు. "అమ్మా బట్టలు నీకంటే నేనే బాగా ఇస్త్రీచేశాను చూశావా" అని అడిగేటంత అరితే రాడు ప్రతాప్. రేపోమాపో కాలేజి మెట్లెక్కబోతు న్నాడు అశోక్.

వీధినపోయే కూరలమ్మేవాడు, "లేత కూర గాయలమ్మా కొంటారా?" అని పిలిచేసరికి వూహల మత్తులోంచి తేరుకుంది యశోద. ఒద్దని చెప్పి వంటింట్లోకి నడిచింది.

పెద్దలు కట్టించి ఇచ్చిన విశాలమైన ఇల్లు. 'పిల్లలు గలగలమంటూ ఇల్లంతా తిరుగు తుంటే ఇల్లు నిండుగా కళకళ్ళాడుతుంది. వాళ్ళిద్దరూ బయటికెళ్తే ఇల్లే చిన్నబోతుంది' అనుకుంటూ వంటింట్లో మిగిలిన కాస్తపనీ పూర్తిచేసి బయటపడదామని అటునడిచింది యశోద. వంటింటి కిటికీ పక్కగావున్న జామచె ట్టుమీద పక్షుల కిలకిలలు వినిపిస్తూంటే అటుచూసింది. ఐదారు చిలకలుచేరి దోరజా మపళ్ళని ఎర్రటిముక్కులతో కొడుతూ మధ్య మధ్యలో అటూఇటూ మెడతిప్పిచూస్తున్నాయి. పచ్చటి చిలకలసంభ్రమాన్ని తీవిని చూస్తూ చూస్తూ సన్నగా కూనిరాగాలు తీస్తూ పనులన్నీ పూర్తిచేసుకుంది. అంతలో–

"అమ్మా" అని దీర్ఘంతీస్తూ పిలిచిన పిలుపు వినబడి "ఎవరూ? వస్తున్నా" అంటూ వెళ్ళి తలుపు తీసింది. వచ్చినది వెంకట్రావు గారయ్యుంటారని ముందే తెలుసామెకి. మెత్త టిదిండున్న కుర్చీలో కూర్చుంటూ–

"మీ ఇల్లే ఓ శాంతిధామం యశోదమ్మ. పిల్లలేరి? స్కూలుకెళ్ళారా?" అని అడిగారా యన.

"అవును మావయ్య" అని జవాబిచ్చింది యశోద.

ఆయనకి నలుగురు మనవలు. అంతా ఎనిమిదేళ్ళలోపువాళ్ళు. ఇల్లు ఇరుకు. ఎప్పు డూ పిల్లల అల్లరితోనో, తగువులతోనో గోలగో లగా వుంటుంది. అలాంటప్పుడు తమఇల్లు శాంతిధామంలా అనిపిస్తే ఆశ్చర్యమేముంది?

"ఆరోగ్యంగా వుంటున్నారా మావయ్యా? మీ కాలు నొప్పి తగ్గిందా?" అని కుశలప్రశ్నలడి గింది.

"నానొప్పి సంగతే అడిగావూ? అది నన్నొది లిపోయేలా లేదు. మోకాలి కిందనరంలాగు తూనే వుంటుంది. ఇదిగో, తైలం రాసు కుంటూనే వున్నాను. దాని దారిదానిది. నాదారి నాది...." ఇలా ఒక అరగంటసేపైనా ఆయన కాలిగురించి చెప్పుకుంటే తప్ప ఆయనకి తృ ప్తిగా వుండదని యశోదకి తెలుసు.

ఒకసారెప్పుడో యశోద మామగారికి ఇలాగే నొప్పివస్తే ఆమె ఆయనకి తైలాలేవో మర్దనా చేసి, కాపడాలుపెట్టి ఇంకా చిట్కావైద్యాలేవో చేసి తగ్గించింది. ఆయన మొహమాటపడ్డా బలవంతపెట్టి సేవలుచేసి కాలిని మామూలు స్థితికి రప్పించింది. ఆ సంగతంతా ఆయన మురిసిపోతూ వెంకట్రావుగారికి చెప్పుకున్నా రు. ఆ సంగతి తల్చుకుంటూ ఆయన– "శివ రామయ్య అదృష్టవంతుడు. నీలాంటికోడలు దొరకడానికి ఎంత పుణ్యంచేసుకునుంటా డో...." అని పొగిడారు.

యశోద మొహమాటంతో ఇబ్బందిపడి, విషయాన్ని తప్పిస్తూ– "కాఫీ తెమ్మంటారా?" అని అడిగింది.

"అడగాలటమ్మా... నీచేతి కాఫీ ఒద్దనే మూ ర్ఖుడుంటాడా?"

నిజమే... ఆయనెప్పుడూ ఒద్దనరు. యశోద ఒక గ్లాసునిండా వేడివేడి చిక్కటి కాఫీని తెచ్చి ఆయన ముందుంచింది. ఆయన ఆత్రంగా దాన్నందుకుని తాగుతుంటే చూడలేక ఏదోప నున్నట్టుగా లేచి వంటింట్లోకెవెళ్ళి, ఆయన గ్లాసుకిందపెట్టిన శబ్దం వినిపించాక బయటకొ చ్చింది. కాఫీ తాగి తృప్తితో ఆయన–

"కాఫీ అనగానే గుర్తొస్తుంది ఒకసారి నేను, శివరామయ్యకలిసి మా స్నేహితుడు వరదరా జన్ ఇంటికి వెళ్ళాము. అతనేమో బ్రహ్మ చారి...." అని వాళ్లవంటవాడు కాఫీలో పంచ దారబదులు ఉప్పువేసి కలిపిచ్చిన తమాషా సంగతి వర్ణించాడు. యశోద ఇప్పటికే పదిసా

ర్లు వింది. అయినా ఆయన తృప్తికోసం అదే మొదటిసారి వింటున్నట్టుగా కళ్ళు విప్పార్చి, ఆశ్చర్యంగా మొహంపెట్టి, చివరికి ఆయనతో పాటు తనూ నవ్వింది.

"ఇక వెళ్ళొస్తానమ్మా" అని చెప్పి, కొంచెం తగ్గుస్వరంతో మొహమాటంగా- "రెండ్రూపాయలుంటే ఇస్తావామ్మా... ముక్కుపొడుం కొనుక్కుందుక్కూడా లేకుండా పెన్షన్ డబ్బురాగానే అంతా ఇంటిఖర్చుకి కావాలని తీసేసుకున్నారు. శివరామయ్య వుండగా తనే ప్రతిసారీ పదిరూపాయలిచ్చేవాడు" అని చెప్పుకున్నారు. యశోద వెంటనే లోపలికెళ్ళి ఐదురూపాయలు తెచ్చిచ్చింది. "వస్తాను తల్లీ" అని చేతికర్ర తీసుకుని బయల్దేరారాయన. యశోదకి కడుపులో కలచినట్లయింది. కంట నీటిని కనుకొనల దగ్గరే ఆపివేసి, "మంచిది" అని తలూపింది.

వెంకటరావుగారింటి పరిస్థితి ఎలాంటిదో యశోదకి కూడా తెలుసు. ఆయనకొచ్చే పెన్షన్ అంతంతమాత్రం. ఒక్కడేకొడుకు. నలుగురు ఆడపిల్లలు. నలుగురి పెళ్ళిళ్ళు చేసేసరికి అప్పులపాలైపోయారు. కొడుకు ఏదో ఫ్యాక్టరీలో చిన్న గుమస్తా. సంసారపు ఖర్చులకి ఆయన పెన్షన్ తీసుకోకుండా మరోదారి లేనేలేదు. కోడలు పార్వతికి ఆయనంటే పెద్ద అభిమానం ఏమీలేదు. పొద్దున్నే కాస్త నీళ్ళ కాఫీ, రెండుపూట్ల భోజనం పెడుతుంది. ఇంట్లో ఇంకే ఫలహారం చేసినా పిల్లల్ని లోపలికి పిల్చి పెట్టి, తాతయ్య దగ్గరకి పట్టుకెళ్ళకండి, ఇక్కడే తినండి అని చాటుగా ఇస్తుంది. ఆయన ఐదో, పదో స్వంత ఖర్చుకోసం దాచుకుంటే అది తెలిసిన పార్వతి, పిల్లలు పావలా, అర్ధా అడిగితే తాతయ్యనడగండి అని ఆయన దగ్గరకి పంపిస్తుంది. ఆయన పనులన్నీ ఆయనే చేసుకోవాలి. చేతిలో డబ్బు లేకపోయినా, పిల్లల మీద కోపం వచ్చినా మామగారిమీద విసుక్కునేది. శివరామయ్యగారి స్నేహంలో ఆయనకి ఒకింత ఓదార్పు దొరికేది. శివరామయ్యగారు పోయినప్పుడు, 'వాడి బదులు నా ప్రాణమయినా పోకూడదా' అని ఏడ్చారాయన.

శివరామయ్యగారుపోయినా ఆ ఇంట్లో ఆయనకి దొరికే ఆదరణలో మార్పేమీ రాలేదు. అప్పుడప్పుడు వచ్చిపోతున్నా ఎప్పుడూ ఇలా నోరు తెరచి డబ్బు కావాలని అడగలేదు.

'పేదరికం, పరాధీన జీవనం ఎంత దుర్భరం! మావగారు అదృష్టవంతులు. అనాయాసమరణం పొందారు. జీవితం, మరణమూ కూడా సుఖంగానే గడిచిపోయిందాయనకి. కాని వెంకట్రావుగారిలా బాధలు పడేవాళ్ళింకా ఎంతమందో ఉన్నారు. ఇలాంటివాళ్ళకోసం జాలిపడ్డంకాక ఏంచేయగలం! ఏమయినా చేయగలిగితే ఎంతబాగుండును! తనలాగా మధ్యాహ్నాలు ఖాళీగా ఉండే ఆడవాళ్ళని నలుగుర్ని చేర్చుకుని ఏదన్నా ఆలోచన చేస్తే ఎలా ఉంటుందో!' అనిపించింది యశోదకి.

మనసులోకి వచ్చిన ఈ ఆలోచనని భర్త జగన్నాథానికి చెప్పేవరకూ ప్రాణం గిజగిజలాడిపోయింది. సాయంత్రం అతను వచ్చాక వెంకట్రావుగారొచ్చిన సంగతి చెప్పి,ఆలాంటి వృద్ధులకోసం ఏమన్నా చెయ్యాలని ఉందనే తన ఆలోచనని బయటపెట్టింది. సావధానంగా అంతా విన్నాడు జగన్నాథం.

"అంటే, ఒక వృద్ధాశ్రమాన్ని ప్రారంభించాలని అనుకుంటున్నావు- అంతేనా?" అన్నాడు.

"వృద్ధాశ్రమం అంటే చాలా పెద్దపదం. పందమందిని చేర్చుకుని ప్రారంభించాలని కాదు. వృద్ధాశ్రయం అనండి పోనీ. మరీ బాధల్లో ఉన్న పది పదిహేను మందికి ఆశ్రయం ఇవ్వగలిగితే చాలు"

యశోద చిన్నవయసులోనే తల్లిదండ్రుల్ని పోగొట్టుకుని నాయనమ్మ ఆశ్రయంలో పెరిగింది. పెళ్ళయి వచ్చాక అత్తమామలకు అనుకూలవతిగా ఇంటికి ప్రియమయిన కోడలిగా పేరు తెచ్చుకుంది. ఆమెకి వృద్ధులపట్ల కరుణ మాత్రమేకాక ప్రీతి కూడా ఉంది. ఆ ప్రీతి ఒక మంచి కార్యానికి ప్రేరణ అయ్యేటట్లుంటే ఎంత బాగుంటుంది అనుకున్నాడు జగన్నాథం పైకి.

"ఇలాంటివాటికి ధనసహాయం, జనసహాయం లేకుండా ఎలా కుదురుతుంది యశోదా?"

"అదే నేనూ ఆలోచిస్తున్నది, ఎలా అని" అంది.

"సమస్య అనేసి కూర్చుంటే పనులవుతాయా? ఎలాగోలా మొదలెట్టుచూద్దాం. అదే

ముందుకి నడుస్తుంది. ఇదొక సంస్థగా అయింది అన్న విషయం అందరికీ తెలిస్తే నలుగురూ సహాయం చెయ్యడానికి ముందుకొస్తారు.''

యశోద మృదువైన స్వరంతో-

''నలుగురి సహాయం కంటే మీరిచ్చే ధైర్యం, వెన్నుకాపు నాకు ముఖ్యం. ఇంక ఎలా పనికానివ్వాలని ఆలోచిస్తాను'' అంది.

యశోదకింక కూర్చున్నా నుంచున్నా అదే ఆలోచన. తను అనుకున్న దానికంటే సులువుగా జగన్నాథం ఒప్పుకున్నదేకాక ధైర్యం కూడా చెప్పాడు. ఎంత చిన్న సంస్థయినా కొంత స్థలం కావాలి. జనసహాయం కావాలి. డబ్బుకావాలి. ప్రారంభించాక కష్టసుఖాల్నెదుర్కొని ముందుకి కొనసాగే మనోధైర్యం కావాలి. ఊహల్లో అన్నీ సులభమే. కార్యరూపం తేవాలంటే బోలెడన్ని సమస్యలు. అదీ చూద్దాం. మొన్నే కదా పక్కింటి శ్రీదేవి తనకి వదిన వరసావిడ చాలా ఏళ్ళనుంచి నార్త్‌లో ఉండి ఇప్పుడు ఇటువేపు వచ్చారని, సోషల్‌వర్క్ అంటే చాలా చురుకుగా పాల్గొంటుందని చెప్పింది. అలాంటివాళ్ళని పరిచయం చేసుకుంటే తనపని ఇంకా సులువుకావచ్చు. ఆ విషయం గుర్తొచ్చిందే తడవు యశోద ఇంటి వెనుక గోడ దగ్గరకెళ్ళి, అక్కడున్న రాయి ఎక్కినుంచుని ''శ్రీదేవీ'' అని పిలిచింది.

శ్రీదేవి వంటింటి కిటికీ దగ్గరకొచ్చి- ''ఏమిటి యశోదా?'' అనడిగింది.

క్లుప్తంగా విషయాన్ని చెప్పి, ''మీ వదినగారేమన్నా సహాయం చెయ్యగలరా?'' అనడిగింది యశోద.

''మధ్యాహ్నం వాళ్ళింటికి వెళ్ళొద్దాం. ఇంతమంచిపనికోసం అంటే తనూ తప్పకుండా సాయపడొచ్చు'' అని కాస్త ప్రోత్సాహకరంగానే జవాబిచ్చింది శ్రీదేవి.

కొత్తగా తయారైన ఎక్స్‌టెన్షన్‌లో అందమైన ఇల్లు. మెట్లకు అటు-ఇటు క్రోటన్‌మొక్కలున్న కుండీలు. మిగతా భాగమంతా అందమైన మొక్కలతో, తోటంతా కొత్తగా రూపుదిద్దుకుంటోంది. బెల్‌కొట్టగానే తలుపుతీసిన పనిపిల్ల శ్రీదేవిని గుర్తుపట్టి నవ్వి,

''కూర్చోండి... అమ్మగారిప్పుడే వస్తారు'' అంది.

మేడ దిగివచ్చిన ఆమెని చూసి యశోదకి ఆశ్చర్యం కలిగింది. పల్చటిమేనితీరు, అక్కడొకటి, ఇక్కడొకటి తెల్లవెంట్రుకలు. ఫెళఫెళలాడే వాయిల్‌చీర కట్టుకుని, కాళ్ళకి హవాయి చెప్పులు వేసుకునిఉంది. యశోదని పరిచయంచేస్తే 'నమస్కారం' అని పలుకరించి, ఇక శ్రీదేవితో కబుర్లు మొదలెట్టిందామె. శ్రీదేవి, వాళ్ళ వదినగారు మాట్లాడుకుంటున్నవి వాళ్ళ బంధువుల విషయాలు కావడంతో యశోదకి ఆసక్తి కలుగలేదు. కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చుంది. కాసేపయ్యాక మూలనున్న టేబుల్‌మీద కట్‌వర్క్ చేసిన గాజు పూలకుండి ఆకర్షణీయంగా కనపడ్డంతో అక్కడ దృష్టి నిలిపింది. అది గమనించిన ఆమె.

''ఆ కట్‌గ్లాస్ సామానంతా మావారు జెకొస్లొవేకియా వెళ్ళినప్పుడు తెచ్చారు'' అని చెప్పింది. ఆవిడ మాట్లాడింది తనతోనే అని గ్రహించాక యశోద-

''అలాగా... చాలా బాగుంది'' అని జవాబిచ్చింది.

''ఇక్కడ ఇంతమంచి సామాను దొరకదు. ఓసారి కలకత్తా న్యూమార్కెట్‌లో ఇలాంటిదే కావాలని అడిగితే పన్నెండు వందలు ధర చెప్పాడు'' అని మొదలెట్టింది. యశోద మౌనంగా తలూపింది. ఇదే సందర్భమని శ్రీదేవి అసలు సంగతి ప్రస్తావించింది. యశోద కూడా, ''మీకు ఈ రంగంలో మంచి అనుభవం ఉందని శ్రీదేవి చాలాసార్లు చెప్పింది. మీ సహాయం దొరుకుతుందేమో అడగాలని వచ్చాను'' అంది.

''అహఁ అలాగా... మీ ఓల్డేజ్ హోమ్‌కి ప్రభుత్వం ఏమాత్రం గ్రాంట్ ఇస్తుంది?''

''ప్రభుత్వాన్ని గ్రాంట్స్ అడిగేటంత పెద్దగా ప్రారంభించాలని అనుకోవడంలేదు''

''చేయడం అంటూ మొదలెడితే పెద్దగానే చెయ్యాలి. ఢిల్లీలో నేను చేస్తూండిన సోషల్ వర్క్‌కి నాకొక ఫోన్, స్వంత వాడకానికొక కారు, అదికాక ఆనరేరియంగా ఐదువందల రూపాయలు ఇచ్చేవారు. ఈయన రిటైర్ అవబట్టి గాని లేకపోతే ఢిల్లీ వదిలి వచ్చేదాన్నేకాదు.

ఇక్కడ కూడా అలాంటి సౌకర్యాలు దొరికితే సోషల్‌వర్క్ చేయడానికి నాకేమీ అభ్యంతరంలేదు. ఆనరేరియం పోతేపోనీ అనుకున్నా ఫోను, కారు లేకపోతే బొత్తిగా లాభంలేదు'' అంది.

ఆవిడ మాటలు విని శ్రీదేవి ముఖం వాడిపోయింది. సమాజసేవ పేరుతో స్వంతసేవ చేసుకునే ఆమె ధోరణి చూసి 'ఇక్కడింక కూర్చోడం దండగ' అనుకుని లేచింది యశోద. అంతలో పనిపిల్ల టీ తెచ్చింది. అది కూడా వెగటనిపించింది యశోదకి. బయటకి రాగానే శ్రీదేవి తప్పుచేసిన దానిలా-

''మనం ఇక్కడకి రావడమే తప్పయినట్లుంది. ఈవిడిలా మాట్లాడుతుందనుకోలేదు నేను. ఎప్పుడూ ''క్షామనిధికి 'అంత' సేకరించాను, అంగవికలాంగుల సంస్థకి ఇంత' సహాయం చేశాను, బెనిఫిట్ షోలు ఏర్పాటు చేశాను, సైనికులకి స్వెట్టర్లు, టోపీలు పంపించాను'' అని చెపుతుంటే 'అబ్బో' అనుకున్నానుగాని, అలా చెయ్యడానికి ఆవిడెన్ని సౌకర్యాలు డిమాండ్ చేసేదో, ఏ మాత్రం లాభాలు పొందేదో ఏనాడూ చెప్పేది కాదు'' అంది.

''పోన్లే నువ్వేందుకు బాధపడతావ్... ఇదో రకం అనుభవం అనుకుందాం అంతే'' అంది యశోద.

ఇదంతా విని జగన్నాథం- ''పోన్లే నువ్వింకెవర్నీ అడగొద్దు. మనమే ఎలాగో తంటాలు పడి చేసుకుందాం'' అన్నాడు. స్థలం సమస్య కూడా అతనే పరిష్కరించాడు.

''ఈ ఇల్లు మనకెలాగూ పెద్దది. నాన్నగారి గది, దాని పక్కగది కలిపి ఆటో తలుపు పెడదాం. కాంపౌండ్ మధ్యలో ఒక కంచె కట్టించి పాదులేవన్నా పెంచుదాం'' అన్నాడు.

మామగారి గదివేపు ఎప్పుడూ వెళ్ళదు తను. తనకెందుకో ఈ ఆలోచన రాలేదు. ఇంక డబ్బు సంగతి? మొదట్లో నెలకింత అని ఇవ్వగలిగేవాళ్ళనే చేర్చుకుంటేసరి. తరువాత సంగతి అప్పుడు ఆలోచించవచ్చు.

★ ★ ★

అలా మొదలయింది 'వానప్రస్థం'. మొదటి సభ్యుణ్ణి జగన్నాథమే చేర్చాడు.

''నా క్లయింట్ రామన్నగారి కొడుకు అమెరికా వెళ్తున్నాడు. భార్యలేదు. ఈయనొక్కణ్ణే వదిలివెళ్ళాలే అని బాధపడుతున్నాడు. మన ఆలోచన చెప్పాను. 'అయితే నేనే మొదటి సభ్యుణ్ణి' అన్నారాయన. ప్రస్తుతం ఆయన పెన్షన్ ఇక్కడిచ్చేస్తారట. కొడుకు వెళ్ళి స్థిరపడగానే ఇంకా పంపిస్తాడట'' అన్నాడు.

''అయితే నేనూ రేపే వచ్చెయ్యనామ్మా?'' అనుకుంటూ లోపలకొచ్చారు వెంకట్రావుగారు. యశోద ఎలా కాదనగలదు?

వారిద్దరూకాక రిటైర్డ్ టీచర్ వేదమ్మగారు, ఫిడేల్ విద్వాంసుడు శేషయ్యగారు కూడా చేరారు.

పొద్దున్నే స్నానాలకి వేణ్ణీళ్ళు కాచి, వాళ్లుండే భాగమంతా తుడిపించి, నీళ్లు జల్లి ముగ్గుపెట్టింది. వాళ్ళ నలుగురి బట్టలూ ఉతకడానికి మంగికి జీతం పెంచింది. జగన్నాథం, పిల్లలు బయటికి వెళ్లేవరకూ తను అటు వెళ్ళే పనులు పెట్టుకోకుండా జాగ్రత్తపడింది. వంట చేసేటప్పుడు ఆ నలుగురికీ కలిపే చేసేసింది.

నలుగురికీ ఆకులు వేసి వరుసగా కూర్చొబెట్టి భోజనం వడ్డిస్తుంటే యశోదకి ఏదో ఆనందం. నాలుగు ముద్దలు తిన్నాక రామన్న- ''చెప్పటం మర్చిపోయానమ్మా. రేపట్నుంచి నాకు కొద్దిగా గోధుమ నూకతో అన్నం వండిపెట్టుతల్లీ. ఇక్కడే శీనయ్య కొట్లో గోధుమ నూక దొరుకుతుంది. నేనే తెచ్చిపెడతాను కావాలంటే. కాఫీలో కూడా పంచదార వెయ్యొద్దు. నా దగ్గర శాక్రిన్ మాత్రలున్నాయి. నేనే వేసుకు కలుపుకుంటాను'' అన్నారు.

వెంటనే వేదమ్మగారు- ''డయాబిటిసా? అయితే వంటల్లో బెల్లం వాడ్డానికి వుండదే! నాకేమో అన్నింటిల్లోనూ కొద్దిగా బెల్లం వేస్తేనే ఇష్టం బాబూ'' అంది.

మొదటిరోజు కదా అనీ, ముసలివాళ్ళకు ఇష్టంగా వుంటుంది కదా అని పెసరపప్పు పాయసం చేసింది యశోద. రామన్నగారి భాగం కూడా పోయించుకుని సంతోషంగా తాగింది వేదమ్మగారు. శేషయ్యగారు బీన్స్ కూరని నలిపి, పిసికి తినడం చూసి, రేపట్నుంచి కూరలు మరికాస్త సన్నగా తరిగి, ఇంకాస్త మెత్తగా వుడికిస్తే సరి. ఈయనకి

వళ్ళు గట్టిగా లేవల్లే వుంది అనుకుంది యశోద. నాలుగు రోజులు గడిచేసరికి 'వీళ్ల ఆరోగ్యాలకి, రుచులకి తగ్గట్టుగా వంటలు చేయడం తన వల్లవుతుందా' అని బెంగపట్టు కుంది యశోదకు. శేషయ్యగారికి పళ్ళు లేక ఒక బాధయితే, వెంకట్రావుగారికి కరకరలాడే పదార్థాలు తినడం ఇష్టం. వేపుళ్ళు, జంతికలు కావాలాయనకి. రామన్నగారికి దుంపలు, తియ్యగుమ్మడిలాంటి కూరలు నిషేధం. ఒక్కో సారి పంచదార వెయ్యకముందు ఆయనకి కాఫీ వేరుగా తీసిపెట్టడం మర్చిపోయేది. అప్పుడు మళ్ళీ మరోసారి విడిగా కాఫీ కలపక తప్పేదికాదు. యశోద తన మామగార్ని రోజుకి పదిసార్లయినా తల్చుకునేది. డెబ్బైయ్యేళ్ళు దాటినా ఆయన దృఢంగా, ఆరోగ్యంగా వుండే వారు. పళ్ళు కట్టించుకుని వుండటంవల్ల ఏది నమలాలన్నా ఇబ్బంది వుండేదికాదు. ఆహారం విషయంలోను ఏ వంకలూ లేవు. అన్నీ తినేవారు. మితాహారి. రాత్రిళ్లు భోజనం చేసేవారు కారు. ఒక అరటిపండు మాత్రం తిని పాలు తాగి పడుకునేవారు. ఆయనతో ఏ విషయంలోనూ ఏమాత్రం కష్టమనిపించేదికా దు. వృద్ధులంతా తన మామగారిలా వుండరని త్వరలోనే అర్థమయింది యశోదకి.

వెంకట్రావుగారికి మొదట్నుంచీ పరి చయం వుండటంవల్ల చొరవెక్కువ. పొద్దున్నే జగన్నాథం పేపర్ చదువుకుంటుంటే, "ఏం జగన్నాథం... ఏమిటివాళ పేపర్లో విశేషాలు?' అని కూర్చుండిపోయేవాడు. పిల్లలు ఇంటికొ చ్చేసరికి ఇంటిముందు నుంచుని 'అయిందే మిరా స్కూలు?' అని రోజూ పలుకరించేవారు. వచ్చిన మనిషి ఓ పట్టాన త్వరగా వెళ్లేవారుకా రు. అశోక్ మొహం ముడుచుకుని 'ఈ తాతె ప్పుడూ ఇక్కడే వుంటారేమిటమ్మా' అని విసు క్కునేవాడు. 'అన్నమానం ఇటు రాకండ'ని ఆయనకెలా చెప్పడం? జగన్నాథానికిగాని, పిల్లలకిగాని ఏ విధమైన ఇబ్బంది కలుగు తుందన్నా ఆమెకి బాధగా వుండేది. ఆమె ఈ దిగులుతో ఉండగా పనెక్కువయిందనో యేమో మంగి పనిమానేసింది. ఎప్పుడూ నవ్వుమొహంతో తిరుగుతుండే భార్య ముఖం వాడిపోయి వుండటం చూసి జగన్నాథం కా రణం వూహించాడు.

"సంసారం బాగా పెద్దదయింది కదా?" అన్నాడు ఓ రోజు.

యశోద ప్రశ్నార్థకంగా చూసింది.

"ఉన్న పిల్లలిద్దరికీ తోడు ఇంకో నలుగుర్ని దత్తు చేసుకున్నావు కదా!"

యశోద నవ్వింది.

"పిల్లల్ని పెంచవచ్చునేమోగాని, ముసలి వాళ్ళని చూసుకోవడం అంత సులువుకాదని అర్థమవుతోందిప్పుడు"

"అదేమిటి? నువ్వందులో ఎక్స్‌పర్ట్‌వి కదా! నాన్నగారున్నప్పుడు..."

"ఓహ్... ఆయనసంగతి వేరులెండి, అంద రూ ఆయనలాగే వుంటారా ఏమిటి?"

యశోద తనువు, మనసు రెండూ అలసిపో యాయి. రోజుకి ఇంత అని మితిగా పని చేసుకునే అలవాటు. ఇప్పుడు ఒక్క నిమిష మైనా కూర్చునే వీలులేకుండా ఏకబిగిన పని, బట్టలుతకడం, వంట, వీటితో సతమతమైపో తోంది. ఒకరోజు రాత్రి నిద్రలో తనకి తెలియ కుండానే మూలగసాగింది. ఆమెని చూస్తూంటే జాలేసింది జగన్నాథానికి. మెల్లగా కాళ్ళు, చేతులు ఒత్తాడు. భుజాలు ఒత్తుతున్న అతడి చేతిపై తన చేతిని వేసుకుని హాయిగా నిద్రపో యింది యశోద. ఆమెకు సహాయంగా ఎవ రైనా ఏర్పాటు చెయ్యాలని నిశ్చయించాడు జగన్నాథం.

అతను ఈ విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. రకరకాల ప్రణాళికలు వేస్తు న్నాడు. అతని క్లయింట్ ఒకతని ఇల్లు వ్యాజ్యంలోవుంది. త్వరలోనే ఆ కేసు ఒక కొలిక్కి వచ్చి ఆ ఇల్లు అతని చేతికి వస్తుంది. ఆ ఇల్లు అక్కడికి దగ్గర్లోనే ఉండటంతో, దానిని అద్దెకి తీసుకుని ఆశ్రమాన్ని అక్కడికి మార్చవ చ్చనే ఆలోచన అతనికుంది. యశోదకి సహా యంగా ఒక మనిషిని నియమించే ఉద్దేశమూ ఉంది. అలాగే మరో నలుగుర్ని చేర్చుకుని, సహాయపడే కొందర్ని సభ్యులుగాచేసి ఒక కమిటీని ఏర్పరచాలనుకొన్నాడు. ఆయన ఆలో చనలన్నీ విన్న యశోదకి సంతోషంతోబాటు ఆశ్చర్యం కూడా కలిగింది. అతనింత ఆసక్తి తీసుకుని ప్రోత్సాహమిస్తాడని తెలియదామెకి. కనీసం పది, ఇరవై మంది వృద్ధులయినా సుఖశాంతులతో బతుకుతారంటే ఎంతో తృ

ప్తిగా ఉందామెకి.

పొద్దున్న భోజనాలయ్యాక వేదమ్మగారు- "వేడి వేడిగా భోజనం వడ్డించి తినమని అడిగేవాళ్ళులేక ఏన్నేళ్ళుగా ఒంటరిబతుకు బ్రతుకుతున్నానే, ఒక్కతినే వండుకుని తినాలంటే కష్టంగా బాధగా అనిపించేది. స్వంత కోడలున్నాకూడా ఈ మాత్రంగా చూసుకునేదో లేదో నీ కడుపు చల్లగా మమ్మల్నింత ఆదరిస్తున్నావు'' అంది

వేదమ్మగారిది ఒంటరి జీవితం. తోడబుట్టిన వాళ్లందరూ వదిలిపెట్టినా మనస్థైర్యంతో జీవితాన్ని ఎదిరించి బతికారు. ఇప్పుడు తీరా ఓపిక వుడిగిపోయాక మరొకరి ఆశ్రయంకోసం అంగలార్చవల్సిన దుస్థితి కలగకుండా ఒడ్డునపడ్డారు. జగన్నాథం ఆలోచనలు కార్యరూపానికివస్తే మరికొంతమంది సుఖంగా బతకవచ్చు.

★ ★ ★

పెద్దవయసులో కష్టాలనుభవించేవాళ్ళ నెంతమందినో చూస్తుంటాము. వార్ధక్యంలో అవసరాలకి ఉంటుందిలే అని అంతోఇంతో కూడబెట్టుకునేవాళ్ళు కొందరయితే, కడుపున పుట్టిన పిల్లలు చూడకపోతారా, మన తల్లి దండ్రుల్ని మనం చూడలేదా అనుకునేవారు కొందరు. దైహిక దౌర్బల్యం ఒకవేపు, పెద్ద సంసారాన్ని అన్నాళ్ళూ నడిపి, సంపాదించిపోసి, ఇంటాబయటా కూడా గౌరవం సంపాదించి పులిలాగ తిరిగిన మనిషి వార్ధక్యంవల్ల అశక్తుడైనందువల్ల పడే మానసిక వ్యాకులత మరొకవేపు ఈ రెండూ కాక ఆర్థికపరాధీనత ఇంకొక బాధ.

కొత్తగా చేరిన నరసింహయ్యగారు పుట్టింది పేదకుటుంబంలోనైనా కష్టపడి చదువుకుని బి.ఎ.బి.ఎల్. పూర్తిచేసి వకీలు వృత్తిని చేపట్టారు. ఆయన్ని గట్టెక్కించడానికి సహాయపడిన మనిషి ఆయన అన్నగారు అనంతయ్య. ఆయనకి వచ్చే కొద్దిపాటి ఆదాయంలోనే తమ్ముడికీ సహాయం చేసేవారు. తమ్ముడు లాయర్ బోర్డు తగిలించేదాకా ఉన్నాడాయన. తరువాత అతడి అభివృద్ధి చూసే అదృష్టం ఆయనకి లేకపోయింది. ఆయన అకాల మరణంవల్ల ఆయన భార్యా పిల్లల బాధ్యత కూడా నరసింహయ్య నెత్తిన పడింది. వాళ్ళుకాక తన తల్లి, తమ్ముళ్ళు ఉన్నారాయనకి. పెళ్ళిళ్ళయి అత్తవారిళ్ళకి వెళ్ళినా పురుళ్ళకి వచ్చిపోయే చెల్లెళ్ళున్నారు. ఇన్నాళ్ళూ కష్టాలకడలిలో మునిగిన ఆయన తల్లికి నాలుగు డబ్బులు కంట చూసేసరికి కోరికలన్నీవెల్లువలై పైకిరాసాగాయి. వచ్చిపోయే అతిథులూ, వాళ్ళకి పెట్టుపోతలు, పండుగలు పబ్బాలు అన్నీ వైభవంగా జరగసాగాయి. నరసింహయ్య భార్యగా వచ్చినావిడ చాల మెతకమనిషి. అత్తగారికి వంతపాడటం తప్ప మరొకటి తెలియదామెకి. ఇక ఆ అత్తగారిచేతికి అడ్డూఅపూలేదు. నరసింహయ్యగారు కూతురికి పెళ్ళిచేసి, ఎలాగో కొడుకుల చదువులు గట్టెక్కించారు. అప్పటికే బాగా అప్పులపాలయ్యాడాయన. తల్లి మంచంపట్టింది. కొద్దినెలల తేడాలో ముందు తల్లి, తరువాత భార్య మరణించారు. తినిపోయినవాళ్ళంతా మొహాలు చాటుచేశారు. ఆయనకి పక్షవాతం వచ్చింది. తమ్ముళ్ళు భార్యలతో వారిదారినవారు వెళ్ళారు. పినతండ్రిని చూడాలని వచ్చిన అనంతయ్య కూతురు తన తల్లిని వెంటబెట్టుకువెళ్ళింది. నరసింహయ్య ఒంటరివాడయ్యాడు. కాళ్ళు, చేతులు కొద్దిగా స్వాధీనంలోకి రాగానే ఆఫీసుపనులకి వెళ్ళాడు. అక్కడ పరిస్థితి అంతా తారుమారు. పార్టీలంతా మరో లాయర్లని వెతుక్కున్నారు.ఈ వయసులో మరేదారీ కనపడలేదు. అప్పటికే ఇంటి అద్దె మూడునెలలు బకాయిపడ్డాడు. విధిలేక కొడుక్కి ఉత్తరంరాస్తే అతడొచ్చి నానా మాటలు అన్నాడు. 'ఇన్నాళ్ళూ సంపాదించి కొంతయినామిగుల్చుకోలేకపోయానే, భార్యకి చిన్నంఎత్తు బంగారం చేయించలేకపోయానే' అని ఆయనా వ్యథపడ్డాడు. కాని ఏంలాభం! కొడుకు సలహాపై ఇన్నాళ్ళూ మమకారం పెంచుకున్న లా పుస్తకాలు, ఫర్నిచరు ఆఫీసుతోసహా అన్నీ కలిపి మిత్రులసహకారంతోమరోలాయర్‌కి అమ్మేశాడు. కొనుక్కున్న లాయరుగారు యశోద వృద్ధాశ్రమాన్ని ప్రారంభించిన వార్త చెవిన వేశాడు.

తండ్రినెలా వదిలించుకోవాలా అని ఆలోచిస్తున్న కొడుక్కి సంతోషం కలిగింది. ఈ వార్ధక్యంలో ఒంటరి జీవితాన్నెలా గడపాలా అని బాధపడుతున్న నరసింహయ్యకీ దారి దొరికింది. వచ్చిన డబ్బులో సగం అప్పుల్ని తీర్చేసి




మిగతా నగం పట్టుకుని జగన్నాధం దగ్గరకెళ్లాడు. అక్కడి పరిస్థితిని చూసి తృప్తిపడి తన దగ్గరున్న డబ్బు కాస్తా జగన్నాధం చేతిలోపెట్టి, "నాకు నెలకింత అని ఇచ్చే తాహతులేదు నాయనా! ఉన్నది కాస్తా నీ చేతిలో పెడుతున్నాను. ఎలా ఖర్చుపెట్టినా సరే" అన్నాడు. తండ్రిని ఆశ్రమంలో చేర్పి తను తప్పుకున్నాడు కొడుకు చిదంబరం.

వారి సమస్య అలా పరిష్కారమైతే యశోదకి కొత్త సమస్య మొదలైంది. మరో గదిని ఖాళీచేసి ఇవ్వాల్సిరావడంతో ఇంట్లోవారికి ఇరుకైంది. అశోక్ చిరాగ్గా- "ఎందుకమ్మా వీళ్లందర్నీ చేరుస్తావ్?" అనడిగాడు.

"వాళ్లకి వాళ్లిళ్లల్లో చూసుకునేవాళ్లు లేకరా బుజ్జీ" అని బదులిచ్చింది.

"వెంకట్రావు తాతగారికి ఇల్లుందిగా మరి ఆయనెందుకు వచ్చినట్టు?" అని అడిగాడు ప్రతాప్.

"ఆయనకి ఇంట్లో చాలా ఇబ్బందులున్నాయి. ముసలితనం వచ్చాక బాగా చూసుకునేవాళ్లుండాలి. లేకపోతే చాలా కష్టం నాయనా. నేను ఇంకో పది పదిహేనుమందినయినా చేర్చుకోవాలనుకుంటున్నాను"

"ఈ ఇంట్లోనా?"

"కాదు... మీ నాన్నగారు ఇంకో ఇల్లుచూస్తారట. అప్పుడు వీళ్లంతా ఆ ఇంట్లోనే వుంటారు"

"మన తాతగారు మటుకు మనింట్లోనే వుండేవారు కదమ్మా! ఇలా ఎక్కడికీ వెళ్లలేదేం?" అని అడిగాడు తాతగారి ముద్దుల మనవడు ప్రతాప్.

"అవును కన్నా మనింటివాళ్లని మనమే బాగా చూసుకోవాలి. తాతగారు మనింట్లో హాయిగా వుండేవారు. మనకీ ఎంతో బాగుండేది. ఆ అదృష్టం అందరికీ వుండదు బాబూ" అంది.

అవునని తలూపారు పిల్లలు.

"మేం ముసలివాళ్లం అయ్యాక మమ్మల్ని మీరే చూసుకుంటారు కదర్రా?" అనడిగింది యశోద.





"ఛీ... ఏంమాట్లాడతావమ్మా! నువ్వు ముసల్దానివి అవడమేంటి? నేనొప్పుకోను" అన్నాడు ప్రతాప్ మూతిముడిచి.

"లేదులే... ఎప్పటికీ ఇలాగే వుంటాను" అంది యశోద నవ్వి.

★ ★ ★

పొద్దున్నే లేచి పేపరు చదవడానికొచ్చే వెంకట్రావుగారు ఆరోజు ఎందుకోరాలేదు. జగన్నాధం వెళ్లి అందరికీ కాఫీలిచ్చివచ్చాడు. వచ్చి- "వెంకట్రావుగారేమిటో ఒళ్లు నొప్పులంటున్నారు. పడుకునే వున్నారు" అని చెప్పాడు యశోదతో.

యశోద కంగారుగా వెళ్ళింది సంగతేమిటో కనుక్కుందామని. ఆమె కంగారుచూసి ఆయన "గాభరా పడకమ్మా కాస్త జీలకర్ర, మిరియాలు వేసి కాచిన కషాయం తాగితే అంతా సర్దుకుంటుంది" అన్నాడు.

సరే, కషాయం కుంపటిమీద కెక్కింది. ఇవాళ వెంకట్రావుగారి ఒళ్లునొప్పులు తాను కాచిచ్చే కషాయంతో తగ్గచ్చు. మొన్నటికిమొన్న వేదమ్మగారు. 'రక్తపోటు ఎక్కువగా వున్నట్టుంది తల జుంమంటోంది' అన్నారు. తనొక్కత్తే వాళ్లని ఎంతని చూసుకుందుకు వీలవుతుంది?

కషాయంకాచి పాలు, పంచదార చేర్చింది.

వెంకట్రావుగారి బాధకి కారణం ఇంకోటి కూడా వుంది. ఈసారి పెన్షన్ డబ్బురాగానే తీసుకుని, కాస్త పళ్లు, బిస్కట్లూ ఇలాంటివన్నీ కొని తెద్దామని, అలాగే మనుమల్ని చూసుకొద్దామనీ ఇంటికెళ్లారు. కొడుకు ఏవో కష్టాలు వెళ్లబోసుకుని పెన్షన్ డబ్బు తనే వుంచేసుకున్నాడు సరికదా, మాటవరసకైనా 'ఎలాగోలా సర్దుకుని ఇక్కడే వుండకూడదా, కొడుకుని నేనుండగా ఇంకో చోట వుండటమెందుకు?' అని కూడా అనలేదు. ఈ సంగతి తెలిసి యశోదకీ కొంచెం అసంతృప్తి కలిగింది. ఇదేమీ అనాథాశ్రమం కాదు కదా. ఎటువైపునుంచీ ఆర్థిక సహాయమేమీలేదు. అలాచూస్తే వెంకట్రావుగారిచ్చే పెన్షన్ డబ్బులు ఆయన ఖర్చుకి ఏమూలకీ చాలదు. రామయ్యగారిలాంటివారి వల్ల అలాంటి లోపాలన్నీ సర్దుకోడానికి వీలవుతోంది. ఆ కొడుక్కయినా బుద్ధివుండొద్దా? ఒకే వూళ్లో వుంటే తాము తినేదేదో తండ్రికీ పెట్టి

పోషించుకుందామన్న ఆలోచనుండొద్దా? పేద వాళ్లా? గొప్పవాళ్లా? అన్నది ప్రశ్నకాదు. ప్రేమా, అభిమానం వున్నచోట అలాంటి సమస్యలుద యించవు. ఇక్కడ వదిలిపెట్టేసింది చాలక ఆయన స్వంతఖర్చుకి చేతికి ఒక పదిరూపా యలన్నా ఇవ్వకుండా పెన్షన్ మొత్తం లాక్కో వడం న్యాయమేనా?

"అమ్మా ..." అన్న పిలుపు విని కషాయపు గ్లాను చేతిలో పట్టుకుని బయల్దేరిన యశోద "ఎవరూ?" అంటూ బయటకొచ్చి చూసింది.

ఎరుపురంగు చీర కట్టుకొన్న అరవైరెండు సంవత్సరాల వయసున్న వృద్ధ విధవస్త్రీ. చే తిలో ఒక బట్టలమూట. కూర్చోమని చెప్పి, వెంకటరావుగారికి కషాయం ఇవ్వడానికి వెళ్ళి ంది. ఆయన ముఖం ఎర్రగా జ్వరం వచ్చిన ట్టుగా కందిపోయివుంది. సాయంత్రం డాక్టర్ని పిలిపించి చూపించాలి. అలాగే ఆయన కొడు క్కీ ఓసారి కబురు పంపిస్తేసరి. పుట్టినప్ప ట్నుంచి కష్టాలమధ్యనే బతికాడాయన. బల మైన తిండి, సుఖమైన కుటుంబ వాతావ రణం ఏనాడూ దొరకలేదాయనకి. అలావుంటే ఒక్కగానొక్క కొడుకుని వదులుకుని ఇక్కడొచ్చి చేరడం ఎందుకు?

"కషాయం హాయిగా వుందమ్మా! బాగుంది. ఇప్పుడింక వెచ్చగా దుప్పటి కప్పుకొని పడు కుంటే సాయంత్రానికి అంతా సర్దు కుంటుంది" అన్నారు వెంకట్రావుగారు.

"కషాయం నోటికి రుచిగా వుంటే వుంది గాని, సాయంత్రం డాక్టర్ని చూసి రెండుడోసుల మందు, ఓ ఇంజక్షన్ తీసుకుంటేనే మంచిది" అన్నారు వేదమ్మ.

"రిటైరయినా మేడమ్ లక్షణాలు వదల్లేదు మీకు" అని హాస్యమాడారు వెంకటరావుగారు. యశోద నవ్వింది. డాక్టరంటే మళ్ళీ అదో ఖర్చని వెంకట్రావుగారి భయం. యశోదకి తెలియంది కాదానంగతి.

యశోద తిరిగొచ్చేసరికి ఇందాక వచ్చినామె వరండాలో గోడవార తను తెచ్చిన బట్టలమూ టని తలకిందపెట్టుకుని పడుకొనివుంది. ము డతలుపడ్డ నుదురు, ముడుచుకుపడుకున్న ఆ తీరుచూస్తే యశోదకి దుఃఖము వచ్చింది. ప్చ్! వార్ధక్యం, అనారోగ్యం, బీదతనం ఈ మూడు లేని సృష్టి సాధ్యంకాదా! పాపం! ఎందు కొచ్చిందో ఈవిడ. తను ఇందాకనే కనుక్కోవ ల్సింది. వెంకట్రావుగారి అనారోగ్యం హడావు డిలో ఈవిడని సరిగ్గా పట్టించుకోలేదు. యశోద వచ్చిన అలికిడికి ఆవిడ లేచికూర్చుంది.

"చాలా అలసిపోయినట్టున్నారు, ఎంతదూ రంనుంచి వచ్చారో ఏమో" అంటూ పలక రించింది యశోద.

"శేషాద్రిపురం నుంచి వచ్చాను" అంటూ ఆవిడ కొంగుముడి విప్పి నలిగిన చీటినొకదా న్ని తీసి అందించింది.

చెన్నకేశవయ్యా అడ్వకేటు అనే సంతకంతో, ఆ వచ్చినావిడని పరిచయంచే స్తూ, ఆశ్రమంలో చేర్చుకోమని కోరుతూ రాసిన వుత్తరం అది. యశోదకి కొద్దిగా గాభరా అని పించింది.

"ఇక్కడ మడి-తడి జరపడం కష్టం-అంద రికీ ఒకటే వంట" అంది.

"అయ్యో... మడి బాధ మీకేమీ వుండద మ్మా నావంటనేనే చేసుకుంటాను. కాస్త అన్నం, చారు వండుకుంటే చాలు నాకు. ఊరగాయ ముక్కేనుకుతింటాను. ఇవాళ మధ్యాహ్నం భోంచేస్తే, రేపు మధ్యాహ్నం వరకూ నాకింకేమీ అక్కర్లేదు. ఫలహారాలు అలవాటు చేసుకోలే దు. కాఫీలో పాలుపోస్తాంగనుక ఎవరుచేసినా దోషంలేదు" అందావిడ.

బక్కశరీరం. అయినా గట్టిగా ఆరోగ్యంగానే వున్నట్టుందావిడ. ఎంత సరళమైన జీవితవి ధానం ఈమెది! ఆ ఒక్కపూట తిండి కూడా పెట్టలేక ఇంటిబయటకి వెళ్ళగొట్టిన వాళ్ళా లాంటి మనుమలు! ఛ!

"పత్తి తెచ్చిస్తే పువ్వొత్తులు, కాడవత్తులు రెండూ చేసిపెడతాను. చారు పొడి, సాంబారు పొడి, చట్నీపొడి అన్నీ చేసిస్తాను. ఉట్టినే కూర్చోడం అంటే తోచదు నాకు" అని చెప్పారు నాగమ్మగారు.

"అలాగే చూద్దాంలెండి" అంది యశోద. ఆ వృద్ధురాలిమీద ఎందుకో ఎక్కడలేని. మమత పొంగి వచ్చింది యశోదకి. వయసులో వున్నవాళ్ళే కష్టపడ్డానికి బద్ధకించి సులువుగా డబ్బు సంపాదించే మార్గాలు వెతుక్కునే ఈరో జుల్లో పూరికే కూర్చోడం నావల్లకాదు" అనే

మనిషీవిత! బట్టల మధ్యలోంచి నలిగిన నోట్ల కట్టని తీసి యశోద ముందు పెట్టిందావిడ.

"ఎనిమిదొందల చిల్లరుంటుంది. నేనుపోయాక శ్రాద్ధం ఎవరు పెడతారో వాళ్ళకిద్దామని వుంచాను. బతికుండగా తిండిపెట్టనివాళ్ళు చచ్చాక శ్రాద్ధం ఏంపెడతారు? మీదగ్గరే ఉంచండి నేనుపోయాక సంవత్సరానికోరోజు ఇద్దరు పిల్లలకి అన్నదానం చేయండి" అన్నదావిడ.

ఆవిడ ఊరు, పేరు, బంధువుల వివరాలు అడిగింది యశోద.



జడ అల్లి చివర్న అరటీతడప కుచ్చుకడుతూ "అదృష్టవంతురాలివే నాగూ, మంచి ఇంటికి కోడలవుతావు" అన్నది ఆమె తల్లి.

పదిహేనురోజులక్రితం నాగుని చూసుకోవడానికి పెళ్ళివారు వచ్చారు. ఆసంగతే చెబుతూ తల్లి, ముంగురులు దిద్ది, కనుబొమలనడుమ నల్లని అగురుబొట్టుపెట్టి, "బోలెడు మంది ఉన్న సంసారంలో ఆఖరి ఆడపిల్ల పెళ్ళెలాఅవుతుందిరా అని బెంగెట్టుకున్నాను. అదృష్టం ఎవర్నెలా వరిస్తుందో ఎవరు చెప్పగలరు" అని నాగు బుగ్గలు పుణికి మెటికలు విరిచిందావిడ

'అక్కల్లాగ పల్లెటూరికి చేరక్కర్లేదు. నీళ్ళుతోడటం, పేడ, మట్టి ముట్టుకోవటం ఇలాంటి బాధల్లేవు. కొంచెం దూరపువూరయినా, పండుగ-పబ్బం అంటే రైళ్ళోకూర్చోబెట్టి పంపిస్తారు. రెండోపెళ్ళివాడయితేనేం ముప్ఫయిఆరో, ముప్ఫయ్యేనిమిదో వుంటాయంతే. మొదటిభార్యకి పిల్లల్లేరు. కొట్లో లెక్కలు రాస్తాడట. అయినా వీళ్ళసంపాదనతోనే ఇల్లుగడవాలనే బాధేమీలేదు. ఉమ్మడిసంసారం. నలుగురిమధ్య ఎలాగైనా సుఖంగానే గడిచిపోతుంది. మనుషులు మంచివాళ్ళు' అని అందరికీ చెప్పుకుంది తల్లి.

తల్లి అనుకున్నట్టుగానే వియ్యాలవారు ఎంతో మంచివాళ్ళు. అన్నింటికీ సర్దుకునే మనుషులు. నాగుకి ఐదు చీరలు, కెంపుల దుద్దులు, ఒక జతగాజులు, గొలుసు, వెండివడ్డాణం అన్నీ పెట్టారు. ఆరుగురు అక్కల్లోను పెద్దవాళ్ళిద్దరూ ఈ పెట్టుపోతలవైభవం చూసి అసూయపడ్డారు కట్నంలేకుండా వయసులోవున్న మొగుణ్ణి సంపాదించుకున్న మూడవఅక్క "నాగూకి ముసలిమొగుడా దొరికింది!" అని నవ్వింది. మిగతా ఇద్దరూకూడా రెండవ పెళ్ళిసంబంధాలు అయినవాళ్ళే. అందులో ఆఖరిపిల్లకి నాగుతో సఖ్యత ఎక్కువ.

"పోన్లే మన నాగూ అయినా కలిగినఇంటికి కోడలవుతోంది" అని సంతోషించింది.

మూడునెలల తరువాత అత్తగారింటికి వెళ్ళింది నాగు. ఇంటినిండా జనం. వాళ్ళంతా ఎవరెవరో గుర్తుపెట్టుకోవటం చాలా కష్టం. ఇంటికి పెద్ద తన బావగారు. పెద్దకోడలు గౌరమ్మ. బావగారికి, నాగు భర్తకి మధ్య ముగ్గురున్నారు. వాళ్ళందరి కుటుంబాలు, కళ్ళుకనపడని ముసలి అత్తగారు, ఆవిడ విధవచెల్లెలు, ఎలాటి బంధుత్వమో తెలియని ఇద్దరు చదువుకునే కుర్రాళ్ళు-ఇంతమంది వున్నారా ఇంట్లో.

పెళ్ళికి ముందు ముప్పయ్యారు, ముప్పయ్యెనిమిది అని చెప్పినా, నలభైరెండేళ్ళు దాటాయి కేశవయ్యకి. మొదటిభార్య పధ్నాలుగేళ్ళు కాపురంచేసిందిగాని పిల్లల్లేరు. మళ్ళీపెళ్ళి వద్దని రెండేళ్ళు వూరుకున్నారు ఇంట్లోవాళ్ళు, ముసలితల్లి, 'ముసలితనంలో కాస్త ఉడకేసిపడెయ్యడానికైనా భార్యనే మనిషి కావాలి. పెళ్ళిచేసుకో' అని ఒత్తిడిచేయడంతో ఒప్పుకున్నాడతను. వుడకేసి పడెయ్యడానిక్కాదుగాని, తన ఒంటరితనాన్ని పోగొట్టుకోడానికి. ఇటు నాగూ ఇంటివాళ్ళుకూడా ఇంతకంటె గొప్ప సంబంధం తెచ్చేస్థితిలో లేరు.

కేశవయ్య చిన్నపిల్లయిన నాగూతో చాలా సున్నితంగా మసులుకునేవాడు. సంస్కృత పండితుడైన అతడు మంచి రసికుడు, సాహిత్యాభిరుచి కలవాడూను. "పుస్తకాలేమ

న్నా చదువుతావా... తెచ్చిపెట్టనా?'' అని భార్య నడిగి ఆమె జవాబివ్వకపోవడంతో, ఆమెకి చదువు రాదన్న సంగతి తెలునుకున్నాడు. ఆమెని బుజ్జగించి చదువుచెప్పడానికి ప్రయత్నించాడుగాని, ఆ ప్రయత్నం పెద్దగా ఫలించలేదు. అమాయకురాలైన నాగుని అభిమానంగా, దయగా చూనుకునేది పెద్దకోడలు గౌరమ్మ. నాగు ఆ ఇంట్లో మెల్లగా పనిపాటల్లో, అలవాట్లలో ఇమిడిపోసాగింది.

ఆ ఇంట్లో పండుగో, పేరంటమో ఏదోఒక నందడి తరుచు వుంటూనేవుండేది. ఆరోజు నందడి మరోరకం. ఇంట్లో అందరూ సుభద్రాకళ్యాణం నాటకాన్ని చూడ్డానికి బయల్దేరారు. నాగుకి ఇవి కొత్త. కేశవయ్య ఆ నాటకాల్ని వాటి వైభవాన్ని తెగవర్ణించి చెప్పాడు. అంతేకాదు, ఆ నాటకంలోని పద్యాల్ని రాగయుక్తంగా పాడి వినిపించాడు. కొన్ని కొన్ని దృశ్యాల్ని వివరించి ఆమెలో కుతూహలాన్ని రేకెత్తించాడు.

నాగూ జడవేనుకుని పట్టుచీర సింగారించి. మూరెడు మల్లెపూలు ముడుచుకొని సిద్ధమైంది. మూడు జట్కాల జనం బయల్దేరారు. నాటకాన్ని లీనమై చూసింది నాగు. కేశవయ్య పక్కనే కూర్చుని అక్కడక్కడ తెలియనివి వివరించి చెప్పాడు. బ్రహ్మాండమైన సెట్టింగులు, దీపాలంకరణ, నటీనటుల అలంకరణలు - ఇవన్నీ కలసి నాలుగు గంటలసేపు నాగుని మరో లోకంలో విహరింపచేశాయి.

నాటకం చూసి బయటకొచ్చేవేళకి వాన మొదలవడంతో బళ్ళు దొరకడం కష్టమయింది. దొరికిన రెండు బళ్ళల్లో ఆడవాళ్ళని, పిల్లల్ని నర్సి, తోడుకోసం మగవాళ్ళొక్కొక్కర్ని ఎలాగో ఇరికించి కూర్చోబెట్టి బయల్దేరదీశా రు. చివరికి కేశవయ్య, మరోకుర్రాడు మిగిలారు. వాళ్ళు నడచివెళ్ళాల్సిందే.

బండిలో కూర్చున్న నాగూ మనసుకి కష్టం వేసింది. దిగిపోయి తను భర్తతోనే నడచివద్దామా అనుకుంది. వానయితేనేం కేశవయ్య కూడా వుంటాడు కదా! కాని ఆ మాట పైకి చెప్పటం ఎలా? బాధతో మౌనంగా వుండిపోయింది. వీళ్ళు ఇల్లు చేరిన చాలాసేపటికి వాళ్ళూ వచ్చారు తడిసి ముద్దయ్యి.





''బాగా తడిసిపోయారు కదా'' అంటూ తల తుడిచింది నాగు. మర్నాడు సాయంత్రానికి కేశవయ్యకి జ్వరం వచ్చేసింది. ఏదో వానలో తడిసి ఒళ్ళు వెచ్చబడిందిలే అనుకుంది గాని, బావగారి ముఖం, తోడికోడలి ముఖం చూస్తే కంగారు కలిగింది. మర్నాడు పెద్ద డాక్టర్ని ఇంటికి తీసుకొచ్చేసరికి నాగు బెదిరిపోయింది.

అసలే కేశవయ్యకి నాగుపట్ల కరుణ ఎక్కువ. ఇప్పుడు మరింత జాలిగా చూస్తున్నాడామెవంక. దగ్గరకొస్తే తల నిమురుతూనో, చేతివేళ్ళని నవరిస్తూనో, ''నాగూ నాగూ...'' అంటూ తపనపడుతూనే ఉన్నాడు.

కేశవయ్య జ్వరం ఎన్నాళ్ళయినా తగ్గలేదు. అతడికి జీతం రావడం ఆగిపోయింది. అక్కడికీ దుకాణదారులు ఒక నెల జీతాన్ని ఎక్కువగా ఇచ్చేసి, అతని స్థానంలో మరొకర్ని పనిలో కుదుర్చుకున్నారు. అతను కోలుకున్నాక తిరిగి పనిలోకి తీసుకుంటామన్నారు. మందులు, పథ్యాలు అంటూ విపరీతమైన ఖర్చయింది. ఉమ్మడి సంసారాన్ని నిభాయించే బావగారికయినా ఈ ఖర్చు తట్టుకోడం కష్టమే అయింది.

గౌరమ్మ నాగూని పిల్చి మొహమాటంగానే అడిగారు. ''నీదగ్గర డబ్బేమన్నా ఉందా నాగూ?'' అని. నాగూకి ఏం చెయ్యాలో తోచలేదు. తన దగ్గర ఆరు వెండి రూపాయలున్నాయంతే. అవి ఏమూలకి?

''అలాగే అక్కా చూస్తాను'' అని వెళ్ళి కేశవయ్యకి చెప్పింది.

''నా దగ్గరా డబ్బేం లేదు నాగూ. అన్నయ్యకి చాలా ఇబ్బందిగా ఉంటుంటుంది. లేకపోతే నోరు తెరచి వాళ్ళలా అడగరు'' అని చెప్పి కళ్ళల్లో నీళ్ళు నిండుతుండగా...''నాగూ నువ్వే మీ అనుకోనంటే ఒకమాట!'' అని ఆమె చేతిగాజుల వంక మౌనంగా చూశాడు.

నాగూకి అర్థమైంది. అలా మొదలై ఆమె గాజులు, గొలును, వడ్డాణం అన్నీ బయటకెళ్ళాయి. ఎనిమిది నెలలపాటు పీల్చి పిప్పి చేసిన క్షయవ్యాధి కేశవయ్యని బలి తీసుకుంది. నాగూ నుదుటి కుంకుమ చెరిగిపోయింది.

జబ్బు మనిషికి అసలు పెళ్ళెందుకు చెయ్యాలి? దాచిపెట్టి పెళ్ళి చేసారని మాట్లాడుకున్నారంతా. నాగూ తల్లి మాత్రం ఒప్పుకోలే

దు. అంతదుఃఖంలోను, "ఎంతో మంచివాళ్ళు పాపం. మా నాగు అదృష్టమే బాగోలేదు. ఏంచేస్తాం" అని కళ్ళు తుడుచుకుంది.

ఒక సంవత్సరం పాటు నాగు పుట్టింట్లోనే వుంది. తల్లికి పెద్దతనం వచ్చింది. నాగుకి చిన్న వయస్సులో ఈ కష్టం రావటంతో అవిడికి మరింత వార్థక్యం వచ్చిపడినట్లయింది. తను హరీమంటే నాగుకి దిక్కెవరని ఆలోచించి ఆమెను మళ్ళీ అత్తవారింటికి పంపేశారు.

అత్తవారింట్లో ఈ ఏడాదిలో పెద్ద మార్పులేమీ రాలేదుగాని కేశవయ్యా నాగూ ఉంటూండిన గది అక్కర్లేని సామాన్లు వడేసే కొట్టుగదిలా తయారయింది. నాగూని వంటరిగా వదిలెయ్యకుండా ఏదోపని పెట్టుకుని వెంట వెంట తిరిగేది గౌరమ్మ.

తరువాత నాగూ అత్తగారు మరణించింది. బావగారి కొడుకు శ్రీనివాసు కి పెళ్లయింది. అతడి భార్య అన్నపూర్ణకి పదేహేనేళ్ల వయసు. లక్షణంగా, అందంగా, ఇంటికి దీపంలా వుంటుంది. వయసు అంతరం ఎక్కువ లేకపోవడంవల్ల నాగుకి సన్నిహితురాలైంది ఆ అమ్మాయి. ఇన్నాళ్ళులేని ఒక కొత్త బాధ నాగు మనసులో నిండింది. నలుగురు మసిలే ఆ ఇంట్లో నవదంపతులకి సన్నిహితంగా వుండే అవకాశం తగినంత లేకపోయినా నాగూ సూక్ష్మదృష్టికి కొన్ని మధుర దృశ్యాలు కనిపించి అదోవిధమైన వేదనని కలుగజేసేవి. అది వారిపట్ల అసూయ కాదుగాని, తన జీవితంలో తను ఎంత కోల్పోయిందోనన్న వ్యధ. అయినా ఆమె మనస్సు పక్కదారులవెంట ఎప్పుడూ పోలేదు.

ఆ ఇంట్లో నాగు అందరికీ కావల్సిన మనిషే. ప్రతిపనికి నాగూ వుండాల్సిందే. పండగ-పబ్బం, పురుళ్ళు-పుణ్యాలు ఏఒక్కటి నాగూలేకుండా జరగదు. ఇన్నింటికీ నాగూ వున్నా సకేశని కావటంతో మడి పనులకు, కొన్ని విశేష దినాల్లో ఆమెని దూరంగా వుంచేవారు. నలభైయ వపడిలో పడబోతుండగా నాగూయే నిర్ణయించుకుని నంజనగూడువెళ్ళి మడికి అవసరమైన శాస్త్రం కావించుకుని వచ్చింది. నల్లని నిడుపాటి ఆమెజుట్టుని తీయించేసుకుని, ఎర్రచీర ధరించిన నాగునిచూసి అన్నపూర్ణ వెక్కివెక్కి ఏడ్చింది.

ముందుతరంలో ఉమ్మడి సంసారం జరిపినట్టుగా తరువాతితరంవారికి కుదరలేదు. పెద్ద కొడుకు, కోడలు పోగానే అందరూ వేర్లు పడ్డారు. నాగూ, అన్నపూర్ణ, శ్రీనివాస్‌ల వెంట వెళ్ళింది. అన్నపూర్ణ చాలా బాగా చూసుకునేదామెను. మడిగా వండిపెట్టడం, పురాణాలకి, హరికథలకి పంపించడం- దేనికి లోటుచెయ్యకుండా చూసుకుంది. కాశీయాత్ర చెయ్యాలనే ఆమె కోరికని తీర్చడమే కాకుండా 'తీర్థయాత్ర స్పెషల్ లో పుణ్యక్షేత్రాలు అన్నింటికీ పంపించింది. కొన్నాళ్లక్రితం అన్నపూర్ణ, శ్రీనివాను ఒకరితరువాత ఒకరు ఒక సంవత్సరం తేడాలో మరణించడంతో నాగమ్మ దిక్కులేనిదయిపోయింది.

అన్నపూర్ణ పిల్లలిద్దరికీ నాగమ్మ అంటే ఎంతో అభిమానం వున్నా కూతురు ఉమవుండే బొంబాయిలోగాని, కొడుకు శ్రీకాంత్ వుండే మిలటరీ నివాసంలోగాని ఆమె ఇమడటం సాధ్యమయ్యే విషయం కాదు. మిగతా బంధువులు అందరూ ఆమెచేత ఎంతో చాకిరీ చేయించుకున్నప్పటికీ పోషణభారం వహించడానికి ఎవరూ సిద్ధంగాలేరు. ఆమె అందరిళ్ళూ తిరిగితిరిగి వంచితురాలైంది. ఉమ ఎప్పుడైనా వస్తే ఆమెకు రెండు చీరలు కొనిపెట్టి, రెండు పుణ్యక్షేత్రాలు చూపించి ఖర్చుకో నూరు రూపాయలు చేతిలో పెట్టి వెళ్ళేది.

రమ్మనిపిలిచే దిక్కులేని పరిస్థితిలో అన్నపూర్ణ అన్నగారు చెన్నకేశవయ్యగారు ఈ ఆశ్రమం గురించి చెప్పి చీటీఇచ్చి పంపించారు.

అదీసంగతి!

నాగమ్మ కథ విన్న యశోదకి మనసు బరువుగా అయిపోయింది. వేదమ్మగారి పరిస్థితే కొంతనయం. బాల వితంతువైనా అన్నగారి ప్రోత్సాహంతో చదువుకుని తన కాళ్ళపై తాను నుంచుని నిలదొక్కుకుంది. నాగమ్మలాంటి వారి పరిస్థితి మరీ దుర్భరం. ఆమెని తీసికెళ్ళి వేదమ్మకి పరిచయం చేసొద్దామని లేచింది యశోద.

లోపల్నుంచి ముసలివాళ్ళ మాటలు వినిపిస్తున్నాయి.

"ఈకాలం పిల్లలిలావున్నారు అంతా

ఖర్మ— అంతే!''

''అలాచూస్తే పిల్లల్లేనివాళ్ళవనే నయంకదా''

''ఏదోచెప్తారే 'నపుత్రస్య గతిర్నాస్తి' అని'' అన్నారు శేషయ్య.

''అయ్యా శేషప్పగారు! 'నపుత్రస్య' కాదు, 'అపుత్రస్య' '' సరిదిద్దారు వేదమ్మగారు.

''అపుత్రనో, నపుత్రనో మొత్తంమీద గతిమాత్రం నాస్తి'' అన్నాడాయన.

వాళ్ళమాటలకి నవ్వుకుంటూ లోపలకొచ్చి యశోద నాగమ్మని అందరికీ పరిచయం చేసింది. వేదమ్మగారు తనకోతోడు దొరికిందని సంతోషించారు.

★ ★ ★

''మనకోపెద్ద సమస్య పరిష్కారమయింది'' అన్నారు జగన్నాథం ఒకపేపరుచుట్టని యశోదచేతికందిస్తూ. అదొక దానపత్రం తాలూకు నకలు. జగన్నాథం క్లయింట్ 'వీరేగౌడ' అనే ఆయన తమ ఇంటినొకదాన్ని 'వానప్రస్థం' కోసం దానంచేశారు.

''ఈఇల్లు కోర్టుకేసులో వున్నది కదా?'' అని అడిగింది యశోద ఆశ్చర్యంగా.

''నిజమే... ఏదో పట్టుదలకోసం కేసునడిపించాడుగాని, అతనికీ ఈఇల్లు అవసరంలేదు. 'అద్దెకిస్తావా' అనడిగాను. నేనెందుకడిగానో తెలుసుకుని, సత్ప్రయోజనానికని దానమేచేశాడు. అతనికున్న ఆస్తిపాస్తుల్లో ఇదోలెక్క కాదుగాని,మన అదృష్టంకొద్దీ అతనికీ ఉదారబుద్ధికలిగింది. దగ్గర్లో పెద్ద ఇల్లు దొరికింది. ఆదివారం ఓసారి వెళ్ళి చూసొద్దాం. సున్నాలు కొట్టించడం, రిపేర్లు ఎంతవరకూ పనిపడుతుందో చూసుకుని వద్దాం''

''అవును... త్వరగానే చేయించాలి. ఇక్కడింక చోటూ చాలదు. ఇవాళకూడా మరొకరు కొత్తగా వచ్చారు'' అని నాగమ్మ విషయం క్లుప్తంగా చెప్పింది యశోద.

''చాలామందిని చేర్చుకున్నా కష్టమే. ఇరవై అయిదు, ముప్పయిమందికంటే ఎక్కువకాకుండా పరిమితి పెట్టుకుని వున్నవాళ్లని బాగా చూసుకోవాలి'' అన్న జగన్నాథం మాటలకి యశోదకూడా సమ్మతి తెలిపింది.

పొద్దున్నే జగన్నాథం కాఫీతీసుకెళ్ళేవేళకి నాగమ్మ చన్నీటిస్నానంచేసి, సన్నగొంతుతో దేవుని స్తోత్రాలను పాడుకుంటూంది. ఆమెని చూసి ఈమే నాగమ్మగారయ్యుంటారని అనుకున్నాడు జగన్నాథం. అతనివెంటవచ్చిన ప్రతాప్‌ని చూసి- ''బాబూ, ఇలారా'' అని పిల్చిందావిడ. ప్రతాప్ దగ్గరకి వెళ్తే నైవేద్యం పెట్టిన బెల్లంముక్క వాడిచేతిలో పెట్టింది.

దాన్ని నోట్లోవేసుకుని చప్పరిస్తూ ప్రతాప్ అడిగాడు- ''అవ్వా! రోజూ కాఫీ నేనేతెచ్చిపెట్టనా?'' అని. నాగమ్మ బోసినవ్వు నవ్వింది.

వెంకట్రావుగారి జ్వరం కాస్త ఎక్కువయినట్టుంది. కషాయంవల్ల ఏమీ ఉపయోగం వున్నట్టులేదు.

''నాన్నా... ఈ తాతగార్ని ఇంటికిపంపేస్తే మంచిదికదా'' అన్నాడు ప్రతాప్ తండ్రితో.

జగన్నాథంకూడా అదే ఆలోచిస్తున్నట్టున్నాడు. అలా చూడబోతే వెంకట్రావుగారికి ఇక్కడ చేరాల్సిన అవసరంలేదు. కొడుకూ, కోడలు వున్నారు. అంతోఇంతో పెన్షన్‌వస్తుంది. కానీ ఇంట్లోకంటే ఇక్కడే ప్రశాంతంగా వున్నారు. యశోద అభిమానంగా చూసుకుంటుంది సరే... కాని ఆ కొడుకు, అదేంమనిషో! వచ్చిన పెన్షన్‌కాస్తా పట్టుకుపోయాడు. ఒంట్లోబాగోలేదంటే చూడ్డానికైనా రాడు.

''నాన్నా ఎవరోవచ్చారు'' అంటూ అశోక్‌వచ్చాడు.

ఇంత పొద్దున్నే ఎవరొస్తారబ్బా, ఎవరన్నా ఇక్కడ చేరడానికని వచ్చారేమో అనుకుంటూ వెళ్ళాడు. వరండాలో కుర్చీలో కూర్చున్న ముసలాయనెవరో గుర్తుతెలీలేదు జగన్నాథానికి. ఒత్తైనమీసాలు, వంచె, కోటు, చేతిలో ఒకసంచీ, కర్ర! ఎవరీయన అని ఆలోచిస్తున్నాడు.

''ఏవయ్యా ముసలాళ్ళకేదో ఇల్లు-వాకిలీ అని ఏటో జేశావంటనే? నన్నూ చేరమంటావేటి?'' అంటుండగానే-

లోపల్నుంచి వచ్చిన యశోద- ''అనెకల్లు రామప్పగారా... అంతా బాగున్నారాండీ?'' అని పలుకరించింది.

రామప్ప, శివరామయ్యగారు బాల్యస్నేహితులు. ఆయన అప్పుడప్పుడొచ్చి చూసిపోతూండేవారు. ఎప్పుడూ వుట్టిచేతుల్తో రానేరా

రు. ఊర్నుంచి అనపకాయలో, బంగాళాదుంపలో, బెల్లమో, పళ్ళో ఏదోఒకటి తేవలసిందే. సంచిలోంచి పెద్దపెద్ద మల్‌గోవా మామిడిపళ్ళని బయటికి తీసి బల్లమీద పెడుతూ "మల్‌గోవా పళ్ళంటే శివరామయ్యగారికి శానా ఇష్టం" అన్నారు.

"అవునవును" అన్నాడు జగన్నాథం. ఈయనెందుకు వచ్చారన్న సంగతిమాత్రం అతనికర్థంకాలేదు.

రామప్ప యశోదతో- "ఏంతల్లీ... నీ ఆశ్రమం కాస్త చూద్దాం" అన్నాడు.

"అటువేపు మూడుగదుల్నీ కేటాయించాం రామప్పగారూ! ఎవరో పుణ్యాత్ములు ముందువీధిలో ఒక ఇంటిని దానం చేశారు. ఒకటిరెండు నెలల్లో రిపేర్లవీచేయించి అక్కడికి మార్చేస్తాం" అంది.

"చూద్దాం పదవయ్యా" అని ఆయన లేచారు. ఆయనటువేపు వెళ్ళొచ్చేలోగా కాస్త టిఫినేమన్నా తయారుచేద్దామని వంటింటివేపు నడిచింది యశోద. ఆమె వెనకాలే వెళ్ళిన అశోక్-

"ఏమ్మా... ఆయనకూడా ఇక్కడ చేరడానికే వచ్చారంటావా?" అనడిగాడు.

"లేదనుకుంటా, అయినా ఖచ్చితంగా అవును, కాదు అని చెప్పడం ఎలా? చూద్దాంలే" అనేసి వుల్లిపాయలు తరగసాగింది.

అన్నీ చూసొచ్చిన రామప్పగారు, "ఏటోనమ్మా కడుపులో దేవినట్టయింది. ఏదో, రామాకృష్ణా అనుకుంటూ మనవల్తో గడపాల్సిన వయ**సులో ఈ ఖర్మేమిటో. పిల్లలు పుట్టిన్నాట్నించి** పిల్లలు పిల్లలంటూ ప్రాణాలొడ్డి పెంచుతాం. ముసల్తనంలో ఇదా వాళ్లు చెయ్యాల్సింది? ఏదో నాగమ్మ వేదమ్మలాంటి వాళ్ళయితేసరే, మా వెంకట్రామయ్య, నరసిమ్మయ్య, అళ్ళకేవొచ్చింది చెప్పండమ్మా. మగపిల్లల్లేరూ?" అన్నారు బాధగా.

"కాలానికి తగ్గట్టుగా సర్దుబాటు చేసుకోవల్సించే రామప్పగారూ, పిల్లల్తో సుఖంగా గడపాలినిజమే. కాని ఒకరికొకరికి పడక పోట్లాలాడుకుంటూ బతకాల్సొచ్చిందంటే ఇంట్లో ఇంక మనశ్శాంతేముంటుంది. అలా మరొకరికి భారంగా బతికేకంటే ఇలాంటిచోట శాంతిగా బతకడం నయం కదా" అన్నాడు జగన్నాథం.

"అవునేమోలే" అన్నారు రామప్పగారు. ఇంతలో ప్లేటునిండా ఉప్మా తెచ్చి ఆయన ముందుంచింది యశోద.

"మీ మామగారున్నప్పుడెట్లా అభిమానంగా వుండేవారో అట్టానే నడుపుకొస్తన్నావామ్మా" అంటూ ప్లేటు తీసుకున్నారు. తింటూ, "అందరికీ ఇలా రుచిగా వండి నువ్వే ఒడ్డిస్తావని తల్చుకుంటే ఇక్కడే వుండిపోనా అనిపిస్తుంది" అన్నారు నవ్వుతు.

ఆయనీమాటలు పొగడ్తకి అంటున్నాడో, నిజంగా వుండే వుద్దేశంతో అంటున్నాడోనని పరిశీలనగా ఆయన మొహం చూస్తున్నాడు జగన్నాథం.

"కాని, నేనేడయినా వుంటానంటే మావాళ్ళే ఒప్పుకోర్లే ముందు. నా మనవలు నేలేకపోతే వుండ్లేరు. కూచోబోతే కుర్చీ తెచ్చివేస్తారు. నుంచుంటే చేతికర్రందించడానికి రడీగా వుంటారు". ఆయన మనవల్ని వాళ్ళనలా పెంచిన తల్లినీ పొగిడారు. యశోద మరికాస్త వుప్మా తెచ్చి ఆయన ప్లేట్లో వేసింది.

జగన్నాథం ఆఫీసుకి టైమవుతోందంటూ స్నానానికిలేచాడు. అతను తయారై వచ్చేవరకు కూర్చొని, అతనితోబాటే బయల్దేరారు రామప్పగారు.

"భోజనానికిక్కడికే వచ్చేయండి" అని చెప్పడం మర్చిపోలేదు యశోద.

వృద్ధాప్యంలో ఆయనలా బతగ్గలిగితే అదృష్టమే. భార్యలేదు. పిల్లలు మంచివాళ్ళు. ఇద్దరు కోడళ్ళు. ఇంటికి నిండుగా మనవలు. నిండైన సంసారం. అందరూ కలిసిమెలిసి లక్షణంగా వున్నారు. పిల్లలు బాధ్యతలు పంచుకుని, యాజమాన్యం పెద్దాయనకప్పచెప్పారు. పెద్దాయన అధికారాన్ని మితిమీరి చలాయించకుండా పట్టు-విడుపు చూసుకోవడంతో ఇంట్లో ప్రేమ, విశ్వాసం, సుఖశాంతులు సంపూర్ణంగా నెలకొన్నాయి. విలువలనేవి మనిషికోరకంగా వుండవు? ఆర్థికపరిస్థితి, క్రమశిక్షణ, వ్యక్తియొక్క మనోభావనలు, బయటి ప్రభావాలు- ఇవన్నీ సవ్యంగా వుంటేనే, ఒక వ్యక్తిగాని, ఒక సంసారంగాని సరిగ్గా రూపొందేది.

రెండు, రెండున్నర గంటలవుతుంటే జగ

న్నాథం వచ్చాడు.

'రామప్పగారేరి?'' అనడిగింది యశోద.

"ఆయన వచ్చినపని అయిపోయింది. వెంటనే బస్సెక్కేశారు. మళ్ళీ వచ్చేనెలలో వస్తారట'' అనిచెప్పి బట్టలు మార్చుకొచ్చి భోజనానికూర్చున్నాడు.

"నీకు సంతోషం కలిగించే మరో విషయం చెప్పారాయన'' అన్నంకలుపుతూ చెప్పాడు జగన్నాథం.

తనకి సంతోషం కలిగించేమాటా!

''ఇంతచేస్తున్నారు కదా, డబ్బెక్కణ్నుంచి అమరుతోంది'' అని అడిగారు. కష్టసుఖాలు చెప్పాను. ఏదన్నా ఒక ఖర్చు తనలెక్కలో వెయ్యండన్నారాయన. ఏడాదికయ్యే ఒడ్లో, బియ్యమో పంపిస్తామన్నారు. నేను ''బియ్యంలాంటివి ఇంత'' అని అంచనా చెప్పటం కష్టం. అదీకాక ఏడాదికయ్యేటంత సరుకులు నిలవ చెయ్యడమూ సమస్యే. కాబట్టి మీరివ్వదల్చుకున్నదేదయినా రొఖ్ఖంగానే ఇవ్వండి. బ్యాంకులో వేసుకుని వడ్డీని వాడుకుంటాం'' అని చెప్పాను. ' పదివేలిస్తాను. కాని ఒకషరతు. నేను ఈ డబ్బు ఇచ్చిన సంగతి ఎవరికీ చెప్పకూడదు. దానం అంటే కుడిచేత్తో ఇచ్చినది ఎడమచేతికి తెలియకుండాచేయాల్సింది అని అన్నారాయన ' అంటూ పూర్తిచేశాడు జగన్నాథం.

"ఎంత పెద్దమనసాయనది!" అంది యశోద సంతోషంగా.

రామప్పగారి కానుకతో యశోదకి ఎక్కడలేని ఉత్సాహం, ముందుకు చొచ్చుకుపోయే ధైర్యం కలిగాయి.

పరీక్షరాసి ఇంటికొచ్చిన అశోక్‌ని ఎలా రాశావని అడగాల్సిన అవసరం లేకపోయినా ''పరీక్షలా రాశావు నాన్నా?'' అని అడిగింది యశోద.

"బాగా రాశానమ్మా'' అని జవాబిచ్చాడు అశోక్. రామప్పగారు తెచ్చిన పళ్ళల్లో మంచి పండుచూసి అశోక్‌కిచ్చింది.

"అమ్మా... ఈసారి సెలవల్లో ఎక్కడికైనా ట్రిప్ వేసుకుందామమ్మా. నాన్నగారికి సెలవలుంటాయి కదా! మాఫ్రెండ్సంతా తాతగారింటికో, చిన్నాన్నగారింటికో ఎక్కడో అక్కడికి వెళ్తున్నారు. మనంకూడా ఎక్కడికైనా వెళ్దామమ్మా'' అన్నాడు అశోక్.

"మనకి అలా వెళ్ళడానికి అమ్మమ్మ, తాతగారు మనకు ఎవరున్నారు చెప్పు'' అంది విషాదంగా.

"నేనన్నది అది కాదమ్మా, మా ఫ్రెండ్ రోషన్‌వాళ్ళు కాశ్మీరు వెళ్లారు. కార్తీక్ వాళ్ళు సౌత్‌ఇండియా టూర్ చేస్తున్నారు. మనం కూడా అలాగే ఎక్కడికయినా వెళ్లచ్చు కదా''

"మనం అలా ఎక్కడికేనా వెళ్ళడానికి ఎలా వీలవుతుంది?''

"ఏమ్మా''

"నీకే తెలును. నువ్వే చెప్పు''

"అదే... ఈ ముసలాళ్ళందర్నీ వదిలిపెట్టి వెళ్ళడం ఎలాఅనే కదా'' అశోక్ గొంతులో ధ్వనించిన నిష్టూరాన్ని గుర్తించిన యశోద ఆశ్చర్యపోయింది. 'పిల్లలకి చికాకుకలిగేటంతగా తను ఈ ఇంటిని, పిల్లల్ని నిర్లక్ష్యంచేసిందా? తనకెందుకో అలా అనిపించడంలేదు మరి. అశోక్ చికాకుపడ్డా, ఈ సంవత్సరం ఎక్కడకీ వెళ్ళే వీలులేదు. ఈ సంవత్సరం ఆశ్రమాన్ని మరో ఇంటికి మార్చాలి. ముందు ఆ ఇంటిని నివాసయోగ్యంగా చేయాలి. జగన్నాథానికి శలవులివ్వగానే చెయ్యాల్సిన ముఖ్యమైన పనులవి. ఇంక కాశ్మీరేమిటి? కన్యాకుమారేమిటి?'

తల్లి అన్యమనస్కంగా వుండటం చూసి అశోక్ ఇంక మాట్లాడలేదు.

దానంగా లభించిన ఆ ఇంటిని చూసి యశోద పెద్ద ఇల్లు దొరికిందని ఆనందించినా, పాడుబడ్డట్టున్న ఆ ఇంటిని సంస్కరించడం ఎలా అన్న బెంగపట్టుకుంది. విశాలమైన ఆవరణలో మామిడి, పనస, సంపెంగ చెట్లున్నాయి. జగన్నాథానికి కోర్టుకి సెలవులివ్వగానే తెలుసున్న కంట్రాక్టరొకతన్ని పట్టుకుని ఇంటికి రిపేర్ల కార్యక్రమం మొదలెట్టాడు. రామన్నగారు, నరసింహయ్యగారు కూడా పక్కనేవుండి తోచిన సలహాలనిస్తూ, పర్యవేక్షణలు చేస్తూ సహాయంగా నిలిచారు. విరిగిన కిటికీలు, తలుపులు కొత్తగా అమర్చారు. పెచ్చులు లేచిపోయిన నేల మొత్తం తీసేసి కొత్తగా ఎర్ర సిమెంటుతో నేలని పరిపించారు. నీళ్ళగదిలో పెద్దకాగుని పొయ్యిలోకి తాపటంచేయించేశా

రు. వరండాలో కట్టిన తేనెతుట్టల్ని, ఇంటికి పట్టిన సాలెగూళ్ళని తీయించి ఇంటిని, ఆవరణని అద్దంలా చేసిపెట్టారు. ఇంటికి ఒక రూపంవచ్చి అందంగా కనిపించసాగింది.

ఆశ్రమాన్ని మార్చేటప్పుడు పరిచిత స్థలాన్ని వదిలివెళ్ళాలని బాధపడ్డా అందరూ ఒకరికొకరు మిత్రభావంతో సహకరించుకుని కొత్త ఇంటికి సంభ్రమంగా బయల్దేరారు. ఆ ఇంటికిగాను ఒక వంటవాడిని, పనివాడిని నియమించింది యశోద. ఇప్పుడు ఆమె ఆదర్శానికి ఒక స్పష్టమైన రూపం వచ్చింది.

ఇప్పుడు ఇంట్లో గదులన్నీ తెరిపిగావున్నాయి. అశోక్ తన సామాను అంతటినీ విశాలంగావున్న కుడివేపు గదిలో సర్దుకున్నాడు. ''హమ్మయ్య! ఇప్పుడు ఏ గోలలేకుండా హాయిగావుంది బాబూ!'' అన్నాడు.

''బోలెడు చోటుంది. హాయిగా ఒక టేబుల్ తెచ్చివేసుకుంటే టేబుల్ టెన్నిస్ ఇంట్లోనే ఆడుకోవచ్చు'' అన్నాడు ప్రతాప్.

ఒకటి రెండు రోజులు బయటకెక్కడికీ వెళ్లకుండా పిల్లలు తన వెంటవెంటే తిరుగుతూ కబుర్లుచేప్తుంటే యశోదకి కొంచెం ఆశ్చర్యంకలిగింది. 'ఇంట్లోనే ఆశ్రమం వుండటంవల్ల తను రోజుల్లో ఎక్కువభాగం అక్కడే గడిపేది. అందువల్ల పిల్లలకి కాస్త అసంతృప్తిగా వుండి వుండొచ్చు. ఇప్పుడు నియమితవేళల్లోనే అక్కడకి వెళ్ళొచ్చేపద్ధతి పెట్టుకోవడంవల్ల ఆ సమస్యవుండదు. తనకి తెలిసినంతవరకు ఆడవాళ్ళెంతమందో బయటఉద్యోగాలకు, సమాజసేవకోసం వెళ్తూవున్నారు. అలా బయటిపనులకి వెళ్ళేవాళ్ళు సంసారాన్ని, ఉద్యోగాన్ని కూడా సంతృప్తికరంగా నిభాయించాలంటే చాలా సున్నితంగా, సమతూకంగా వ్యవహరించాలి. తనయినా అంతే. ఇంటిలోని వాళ్ళకి నిర్లక్ష్యంచేస్తున్న భావన రాకూడదు. ఆశ్రమంలోని వృద్ధులకీ అసంతృప్తి కలుగకూడదు, అనుకుంది యశోద.

అశోక్ పరీక్షా ఫలితాలొచ్చాయి. రాష్ట్రంలో మూడవ ర్యాంకు సంపాదించాడు. అతన్ని లాయరుగాచెయ్యాలని జగన్నాథం కోరిక. అతనికేమో సైన్సులో ఆసక్తిఎక్కువ. అందుకని ఆ సబ్జెక్టులోనే ప్రోత్సహించారు. పిల్లలకి కాలేజీలు తెరవడంతో యశోదకి ఆశ్రమంలో ఎక్కువసమయం గడిపే వీలు దొరికింది.

ఆరోజు సాయంత్రంవేళవెళ్తే,వసారాలో ఒక పక్కగా కూర్చుని రామాయణం చదువుతున్నారు వేదమ్మగారు. నాగమ్మగారు వత్తులుచేస్తూ కూర్చుని వింటున్నారు. కొద్దిదూరంలో వెంకట్రావుగారు, నరసింహయ్యగారు, శేషయ్యగారు వింటూ కూర్చున్నారు. తలెత్తి యశోదని చూసిన వేదమ్మగారికి, ''ఆపద్దు, చదవండి'' అన్నట్టు సైగచేసి, లోపలికివెళ్ళింది యశోద.

కైకేయి వరాలడగడం, దశరథుడు ఒప్పుకోవడం, రాముడు అడవులకి వెళ్ళడం— ఇదీ ఘట్టం.

''కైకేయి కోరితే మాత్రం దశరథుడు విచక్షణలేకుండా రాముణ్ణి అడవులకి పంపేయడమేనా?'' అని ఒకరు.

''అదంతా దైవనిర్ణయం రాముడు అడవులకి వెళ్లకపోతే రావణసంహారందాకా కథ నడిచేదా? అప్పుడు రామాయణమే వుండేదికాదు'' అని మరొకరు.

ఇలా వాళ్ళు మాట్లాడుకుంటూ, చర్చించుకుంటూ పురాణపఠనం సాగిస్తుంటే యశోదకి చాలా బాగుంది. తనూ కాసేపు అక్కడ కూర్చుంది.

ఆశ్రమవాసులు బయటకి వెళ్ళకూడదనే నియమమేమీలేదు. అయినా వాళ్ళే కొన్ని నియమాలు పెట్టుకొని వాటికి బద్ధులై పురాణాలు, హరికథలు అంటూ బయటకిపోకుండా అక్కడే కాలక్షేపంచేస్తున్నారు. అందరికీ ఆసక్తి వుంటే ఇక్కడే అప్పుడప్పుడు పురాణమో, ప్రసంగమో, ఆధ్యాత్మికోపన్యాసమో ఇలాంటివి ఏర్పాటుచేయొచ్చు అనుకుంది యశోద.

''కష్టపడి పుత్రకామేష్ఠిచేసి నలుగురు పిల్లల్ని కన్న దశరథుడు వార్ధక్యంలో అనుభవించిన సుఖం మాత్రం ఏముంది గనుక! పిల్లలు, అందులోను మగపిల్లలు కావాలని తపించడం వాటికోసం జపతపాలు, యాగాలు చెయ్యడం.... పిల్లలున్నవాళ్లంతా ఏదో సుఖపడిపోతారనుకోడం మాత్రం వుట్టిమాట. ఇప్పుడు వెంకట్రావుగారికి, రామన్నగారికి, నరసింహయ్యగారికి అందరికీ పిల్లలున్నారు. ఏం లాభం? 'కలియుగం' అనుకుంటాం కలియుగమో, త్రేతాయుగమో ఏ యుగమైతేనేం కష్టా

లు, తాపత్రయాలు ఏ కాలంలోనైనా ఒక్కలాగే వున్నాయి'' అన్నారు నాగమ్మగారు.

వేదమ్మగారు పుస్తకాన్ని మూసిపెట్టారు. నాగమ్మగారు సరంజామానంతా సర్ది, చేసినవు వ్వొత్తుల్ని దోసిలినిండా పట్టుకుని తీసుకోమ్మా అని యశోద ముందుకి జాపారు. యశోద దోసిలిపట్టి తీసుకుంది.

వసారాలో ఒకమూల పడక్కుర్చీలో రామన్న గారు మందకొడిగా పడుకున్నారు. ఒక చిన్న తువ్వాలుని ఉండలా చేసి దవడకు అదిమిప ట్టుకున్నారు. ఆయన బాధేమిటో అర్థమైంది యశోదకి. దగ్గరకెళ్ళి 'పంటినొప్పా?' అనడి గింది. అవునని తలాడించాడాయన. వంటింట్లోకి వెళ్ళి పొయ్యిమీద మూకుడు వేడి చేసి దాంట్లో ఒక పిడికెడు ఉప్పుని వేయించి, శుభ్రమైన బట్టలో మూటగా కట్టి ఆయన దగ్గరకి తీసుకెళ్ళింది.

"పక్కకి తిరిగి పడుకోండ''ని చెప్పి కొద్దిగా వాచిన ఆయన దవడకి మృదువుగా కాపడం పెట్టింది. చల్లారిపోగానే మరోసారి వెచ్చచేసి తీసుకొచ్చింది. కళ్ళుమూసుకుపడుకున్న రామ న్న కంటిరెప్పలచుట్టూ తడి. యశోద కంగారు పడి-

"వేడెక్కువయిందా... నొప్పి పెడుతోందా?'' అనడిగింది.

"లేదమ్మా... హాయిగానే వుంది'' అన్నారా యన భారమైన గొంతుతో.

"రేపొకసారి డాక్టరు దగ్గరకెళ్ళివద్దాం'' అని చెప్పింది.

"అమ్మా ఏజన్మలో నాకూతురివో....!''

"ఏజన్మో ఎందుకు ఈ జన్మలో కూతుర్నే అనుకుంటే పోలా?'' అని నవ్వుతూ వాతావర ణాన్ని తేలికపరచింది యశోద. రామన్నగారె క్కువగా మాట్లాడేమనిషికాదు. కొడుకు మూడే ళ్ళపసిపిల్లాడిగా వుండగానే భార్యపోయింది. మళ్ళీ పెళ్ళిమాట తలపెట్టకుండా తనే బిడ్డని పెంచిపెద్దచేసాడు. ఆ కొడుకు ఇప్పుడు అమె రికాలో వున్నాడు. ప్రతివారం తప్పకుండా వుత్త రంరాస్తాడు. అప్పుడప్పుడు ఫొటోలు పంపిస్తా డు. చాలా ఏళ్ళుగా ఒంటరిజీవితానికి ఆయన అలవాటుపడిపోయారు. మనిషి ఒకరకంగా





రాటుతేలినట్టున్నారు. ఎంత పెద్దకు టుంబంలో వున్నవాళ్ళయినా వార్థక్యం వచ్చేస రికి ఒంటరితనపు మనోభావన మనిషిలో చోటు చేసుకుంటుంది. రామన్నగారికి ఆ ఏకాకితనం ఏనాడో స్వంతమైంది. పుస్తకాలే ఆయన సహచ రులు. డిటెక్టివ్ దగ్గర్నుంచి, వేదాంత గ్రంథాల వరకూ ఇదీ-అదీ అని లేకుండా అన్నీ చదువు తారు. ఆయన అలవాటు తెలుసుకున్న జగ న్నాథం ఆయన్ని రెండుమూడు లైబ్రరీలకు మెంబరుగా చేశాడు. ఆయనే వెళ్ళి పుస్తకాలని ఎన్నుకుని తెచ్చుకుంటారు. ఇప్పుడిలా నిస్స హాయంగా పడక్కుర్చీలో పడుకునుంటే యశో దకి బాధ కలిగి 'పుస్తకం ఏదన్నా తెచ్చిపెట్ట మంటారా?' అనడిగింది. ఆయన గోడపక్కను న్న బెంచివైపు చూపించారు. అక్కడొక పుస్తకం, ఆయన కళ్ళజోడు వున్నాయి. తెచ్చి ఆయన కందించింది యశోద.

బయట ఎవరో కాలింగ్‌బెల్ మోగించారు. ఇద్దరు యువతులు లోపలకొచ్చి యశోదని చూసి "మీరేనా ఓల్డేజ్ హోమ్ సెక్రటరీ?'' అని అడిగారు.

"ఊఁ... ఏంకావాలిమీకు?''

"మనదేశంలో చాలినన్ని ఓల్డేజ్ హోమ్స్ లేనేలేవు. ఎన్నోచోట్లో కనుక్కుంటే, ఎవరో ఈఅ డ్రస్ ఇచ్చారు. నేను మా అత్తగారినిక్కడ చేర్చాలని వచ్చాను'' అంది ఒకామె.

"నేనూ అంతే'' అందుకుంది మరొకామె.

"కూర్చోండి. స్థిమితంగా మాట్లాడుదాం'' అంది యశోద.

ఒకామె అత్తగారు ఉబ్బసపురోగి. మరొకామె అత్తగారు మంచంమీదుంది. ఇంట్లోనే సేవచే యాల్సిన పరిస్థితి. అందువల్ల వాళ్ళనిక్కడ చేర్చాలనుకుంటున్నారు. మామూలుగా ఎలాంటి పరిస్థితిలోనైనా శాంతంగా మాట్లాడే యశోదకే ఒళ్ళుమండింది.

"చూడండి... ఇది ఆస్పత్రికాదు. వయసు మళ్ళిన అత్తగార్లని చూసుకోవడం కోడళ్ళుగా మీబాధ్యత. అనారోగ్యం వచ్చేసరికి తీసుకెళ్ళి ఎక్కడో చేర్చేసి వదిలించుకోవాలనుకోవడం సరియైన పద్ధతికాదు. చూసుకొనే దిక్కులేకనో, తప్పనిసరి పరిస్థితుల్లోనోవుంటే మాత్రమే ఇక్కడ చేర్చుకుంటాం. రోగిష్టివాళ్ళనిగాని, పిల్లలుండీ చూసుకోవడానికి ఒళ్ళొంగని వాళ్ళ

పెద్దవాళ్ళనీ చేర్చుకోం'' అని జవాబిచ్చింది.

"అయితే చేర్చుకోరన్నమాట'' అని లేచారు వాళ్ళిద్దరు. వెళ్తూ," ఖర్మ నాకొచ్చిపడింది'' అని ఒకరు,

"మునల్ది ఎన్నాళ్ళిలా మంచంమీదుండి ప్రాణాలు తీస్తుందో, చావనయినా చావదు'' అనిమరొకరుమాట్లాడుకుంటూ వెళ్లిపోయారు.

'ఛ... ఇంత అనవ్యాంగా మాట్లాడుకుంటారా? మనుమలేనా వీళ్ళు? తన భర్తకి జన్మనిచ్చిన తల్లి కష్టనష్టాలకోర్చి కొడుకుని ఈనాటి స్థితిలో నిలబెట్టటానికి కారణమైన తల్లి! ఆమెని ఇంత నికృష్టంగా చూడటమా? వాళ్ళుమాత్రం ము నలివాళ్ళవరా? ఎవరికైనా ఎల్లకాలం యౌవనావస్థలో వుండటానికి సాధ్యమా? వాళ్ళకిమాత్రం రోగం-రొష్టు అన్నది రాదా? వచ్చిన వాళ్ళిద్దరేగాని నలుగురికి నరివడా గోలచేస్తున్నారు? వాళ్ళమాటలు వినిబాధ కోపం రెండూ యశోదకు కలిగాయి.

వాళ్ళతో చూడ్డానికెవరూ లేనివాళ్ళని మాత్రం చేర్చుకుంటామని చెప్పింది. మరి వెంకట్రావుగారిని చేర్చుకోలేదా? కొన్ని నడలింపులు తప్పవు. కాని అత్తగారు అనే అభిమానంతో చూనుకోవలసిన మనిషిని, అనారోగ్యంతోవున్న మనిషిని వదిలించుకోవాలన్న ధోరణిలోవున్నవాళ్లని చూస్తే ఒళ్ళు మండింది యశోదకి.

ఇదంతా గమనిస్తూ అందరూ వసారాలోనే వున్నారు. "అయితే మీకూ కోపంవస్తుందన్నమాట!'' అన్నారు శేషయ్యగారు.

"పురందరదాను చెప్పలేదా? "శక్తి అయితే హితులైన బంధువుల శక్తి అయితే...'' అనేదో చెప్పబోయి వెంకట్రావుగారు గుర్తురాక ఆగిపోయారు.

వెంటనే వేదమ్మగారు "శక్తుడయిన హితులౌదురు బంధువుల శక్తుడయిన విరోధులు వారే ఈ భువిని అని చెప్పారు పురందరదానులు'' అని సరిచేశారు.

"మొత్తానికి జీతంలేని మేష్టరమ్మగారు మీరు'' అని నవ్వారు శేషయ్యగారు. ఇంతలో-

బండిలోంచి ఒక పెట్టి, పక్కచుట్ట దింపుకుని ఇద్దరు మనుమలు దిగారు. అందులో ఒకరు మంచి ఎత్తుగావున్న వ్యక్తి కోటు, జరీ అంచు పంచె నేలని తాకేలా కట్టుకున్నారు. అరవైనాలుగు, అరవైఅయిదేళ్ళ వయను, మంచి ఠీవితో కళకళలాడే ముఖం, చేతిలో ఖరీదయిన నల్లటి చేతికర్ర, నాలుగువేళ్ళకి ఉంగరాలు... యశోదకి ఆయనెక్కడో చూసినట్టుంది. అంతలో లోపల్నుంచి వచ్చిన వెంకట్రావుగారు-

"ఓహెూహెూ మోహనరావుగారు!'' అంటూ చేతులు చేర్చి గౌరవంగా నమస్కరించారు.

వెంటనే గుర్తొచ్చింది యశోదకి ఆయన ప్రఖ్యాత రంగస్థల నటుడన్న నంగతి! తనూ ఆయన నాటకాలు, భక్త ప్రహ్లాద, ధ్రువచరిత్ర, భూకైలాస్ వగైరా చూసింది.

ఆయనతో వచ్చిన మరొకాయన ముందుకొచ్చి- "వీరిని ఇక్కడ చేర్చుకోవాలమ్మా'' అన్నారు.

యశోదకి ఆశ్చర్యమూ, దుఃఖమూకూడా కలిగాయి. ఎంత గొప్పకళాకారుడు! ఆయనకి ఇక్కడ చేరవల్సిన పరిస్థితి ఎందుకొచ్చిందో!

గార్డియన్ అనున్నచోట 'రఘురాం' అన్నపేరుని రాశాడా వ్యక్తి. వయను, మొదలైన వివరాలన్నీ రానుకుంటూ వంటమనిషి నాగన్నని పిలిచి మరొకరికి వంటచేయాలని పురమాయించింది యశోద. మోహనరావుగారికి రామన్నగారి గదిలో మంచంవేయించింది.

రఘురాంతో ఆయన భోజనవుటలవాట్లు గురించి చర్చించింది. "ప్రత్యేకంగా ఏంలేదు, అంతా అందరిలాగే'' అని బదులిచ్చాడాయన.

వెంటనే మోహనరావుగారు- "చూడమ్మా భోజనం ఎలావున్నా బాధలేదు, రాత్రిపూట మాత్రం భోజనం అయ్యాక ఒక గ్లానుడు పాలు— అందులో కుంకుమపువ్వు, బాదంపప్పు, కలకండ వేసిస్తే చాలు. అదొక్కటి మాత్రం తప్పనిసరి. ఎందుకంటే కంఠం బాగుండాలి కదమ్మా, అందుకని!... అన్నట్లు, రఘురామయ్యా హార్మోనియం ఎప్పుడు పంపిస్తావు?'' అని అటు తిరిగారు.

యశోదకి భయం పట్టుకుంది. ఇంతమంది మధ్య ఈయనకి ప్రత్యేకంగా బాదంపాలు

అమర్చడం ఎలా?

అంతలో రఘురాం ఆమెకి కనుసైగచేసి, మోహనరావుగారితో "హార్మోనియం రేపో, ఎల్లుండో తెచ్చిపెడతాను" అని చెప్పి బయల్దేరాడు.

వెళ్ళేటప్పుడు అతని మొహంలోని బెంగని గమనించింది యశోద. గేటువరకు వెళ్ళి "ఇక్కడ మేం వారిని జాగ్రత్తగానే, చూసుకుంటాం. మీరేం బెంగపెట్టుకోకండి" అని చెప్పింది.

"రావుగారికి రాజా వేషం వేసివేసి అదే ఠీవి, స్టైలు అలవాటయిపోయింది. పాలల్లోకి బాదంపప్పు, పటికబెల్లం నేను తెచ్చిపెడతాను. అంతవరకూ ఎలాగో సర్దుబాటు చేయండి" అన్నాడు.

"మీరు ఆయనకేమవుతారు?"

"రక్తసంబంధమేమీ లేదమ్మా. ఆయన నాటకాలన్నీ ఎన్నోసార్లు చూశాను. ఆయన అభిమానిని అంతే"

"వారికి బంధువులెవరూ లేరా?"

"ఇప్పుడెవరూ లేరనే చెప్పొచ్చు"

"ఇంకేం బాధపడకండి.మేంవున్నాం. మీరు నిశ్చింతగా వుండచ్చు" అని చెప్పి లోపలికొచ్చేసరికి మోహనరావుగారు మిగతావాళ్ళతో పాత స్నేహితుల్ని కలుసుకున్నట్టుగా కబుర్లు చెప్తున్నారు. అదిచూసి ఆనందపడింది యశోద.

లోపలి గదిలో వేదమ్మ- "ఈ నాటకాలవాళ్ళు, సంగీతంవాళ్ళు...కళాకారులంతా ఇంతే. ఎంత సంపాదించినా 'కష్టకాలానికి' అని ఒకింత దాచుకోరు. ఆలెక్కన గవర్నమెంట్ ఉద్యోగమే నయం" అని వ్యాఖ్యానిస్తున్నారు.

"మీది ప్రభుత్వ ఉద్యోగం కదా అని ఇలా మాట్లాడతారన్నమాట"అని హాస్యంచేశారు నాగమ్మగారు.

మిడిల్‌స్కూల్ పంతులమ్మగా రిటైరైనా వేదమ్మగారు వార్ధక్యానికి కావల్సిన ఏర్పాట్లని నవ్యంగా ఏర్పరచుకున్నారు. ఆమాట నిజమయినా మోహనరావుగారి ఎదురుగా అనకూడదు కదా!

★ ★ ★

రాత్రి తొమ్మిదిగంటలకి వార్తలు వింటున్నాడు జగన్నాధం. యశోద భోజనాలకి ఏర్పాటు చేస్తోంది.

వెనుకవేపు గోడదగ్గర్నుంచి శ్రీదేవి "యశోదా!" అని పిలిచింది. వెనకాల లైటువేసి తలుపుతీసింది యశోద. శ్రీదేవి ఒకగ్లాసుని గోడమీదనుంచి అందిస్తూ "మైసూరునుంచి బంధువొకాయన వచ్చారు. ముసలాయన. రాత్రిళ్ళు భోజనంచేయరు. ఇంట్లో పళ్ళుకూడా ఏమీలేవు. పాలే మా తోడుపెట్టేశాను. ఒక గ్లాసుడు పాలుంటే ఇస్తావా?" అనడిగింది.

"దానికింత ఉపోద్ఘాతం ఎందుకు?" అంటూ గ్లాసు అందుకుని, దాన్నిండా పాలు, రెండు అరటిపళ్ళుకూడా ఇచ్చింది యశోద.

పొద్దుటే వంటింట్లో కాఫీ కలుపుతుంటే పక్కింట్లోంచి మంత్రోచ్చారణ వినపడింది. 'ఓహో, రాత్రివచ్చిన చుట్టంకాబోలు' అనుకుంది యశోద. పూజయ్యాక ఆయన తులసికోటలో నీళ్లుపోయడానికి రావడం కిటికీలోంచి చూసింది. చూసిన వెంటనే గౌరవభావం కలిగేలాంటి గంభీరమైన స్వరూపం, ముఖంలో సాత్త్వికతేజస్సు, ఎత్తైన విగ్రహం ఆయనది.

శ్రీదేవి అప్పుతీర్చడానికి పాలగ్లాసుతో వచ్చింది. "అతిథికోసం తీసుకున్నపాలు అప్పుతీర్చడమేమిటి వద్దు శ్రీదేవీ" అని వారిస్తూ చెయ్యిఅడ్డుపెట్టి- "ఎవరాయన?" అంటూ అడిగింది.

"దూరపుబంధువు అసలు వస్తారన్న సంగతే ముందుగా తెలియదు. నాలుగైదు రోజులుండవచ్చేమో" అంది శ్రీదేవి.

సాయంకాలం మళ్ళీ వచ్చింది శ్రీదేవి.

"యశోదా... ఆయన మీ ఆశ్రమంలో చేరతారట" అంది.

"అదేమిటి!"

వివరాలన్నీ తరువాత చెప్తాను కాని, ఆయన అంతోఇంతో వున్నవాడే. ఇల్లంటే ఎందుకో విసుగనిపించి, విరక్తిగా అనిపించి ఇలా బయల్దేరారు. మాటల్లో 'వానప్రస్థం'గురించి చెప్పాను. "ఇప్పుడు నాకు అదే సరియైన గమ్యం" అన్నారు. ఆయన పరిస్థితి చూసి నీకోమాట చెప్పిపోదామని వచ్చాను.

ఎంత చక్కటి వర్చసు! చూస్తే చెయ్యెత్తి దండంపెట్టాలని అనిపిస్తుంది. మంచి పండి

తుడయ్యుండాలి. విజ్ఞానం ఆయన ముహంలో ప్రతిబింబిస్తున్నట్టుంది.

"అలాగేలే... రేపు తీసుకురా" అంది యశోద.

'పేరు – మృత్యుంజయశాస్త్రి. వయసు – అరవై, ఆరోగ్యం – ఉత్తమం'... ఇలా దాఖల యింది ఆశ్రమం రిజిస్టర్‌లో.

ఆశ్రమ వాతావరణాన్నీ ఇతర సభ్యుల్నీ చూసి సంతోషించారు శాస్త్రిగారు. ఆయనకి మోహనరావుగారితో పరిచయం వుందికూడా.

లోపలి గదిలో పాప పుణ్యాలగురించి, కర్మ సిద్ధాంతం పునర్జన్మల గురించీ మాట్లాడుతున్న వెంకటరావుగారు-

"పాప పుణ్యాల ఫలాన్ని అనుభవించడానికి నరకానికో, స్వర్గానికో పోవలసిన అవసరంలేదు. ఈ కలియుగంలో అన్నీ ఇక్కడే అనుభవించాలి. "అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ..... తరువాతేదో ఉండాలబ్బా ..." అంటూ ఆగారు.

అంతలో లోపలికొచ్చిన వేదమ్మగారు- "బయటకొచ్చి చూడండి, మంచి పండితుడొకాయనవచ్చారు. ఇక్కడ చేరుతున్నారు. ఇకమీదట మీ మిడిమిడి సంస్కృతజ్ఞానం కట్టిపెట్టాల్సిందే" అన్నారు.



ఆదేవారంలో చేరిన మరొక సభ్యుడు రాజారావుగారు. ఆయన ఆశ్రమంలో చేరాక ఎవరికీ పొద్దుపోవడం ఎలాగన్న సమస్యే ఉదయించలేదు. ఏభైఏనిమిదేళ్ల వయసులో నలభై అయిదేళ్ళ మనిషిలా కనిపించే రాజారావుగారిది మంచి ఆరోగ్యం, దృఢశరీరం. యోగాసనవిద్యలో నిష్ణాతుడు. మంచి క్రికెట్ ఆటగాడు. కాలేజీలో చదువుకుంటూండిన రోజుల్లో వాళ్లటీమ్‌కి ఆయనే కెప్టెన్. గవర్నమెంట్ సర్వీసుచేసి రిటైరై వచ్చారాయన. తన ఆప్తమిత్రుడయిన కాఫీప్లాంటర్ ఒకాయన సహవాసంలో విదేశ యాత్రకూడా చేసి వచ్చాడు.

ఆయన తన అనుభవాలను రసవత్తరంగా వర్ణిస్తుంటే అంతా వారి పనులు మర్చిపోయి వినేవారు. రామన్నగారికి పంటినొప్పి, వెంకట్రావుగారికి మోకాళ్ళనొప్పులూ గుర్తొచ్చేవికావు. నాగమ్మగారు ఒత్తులు చెయ్యడం ఆపేసేవారు.

రాజారావుగారికి మోహనరావుగారితో మాట్లాడం అంటే ఎక్కడలేని ఉత్సాహం కలిగేది. సంగీతం, నాటకం వీటిగురించి మాట్లాడేవారు. పూర్వకాలపు నాటకాల గొప్పదనాన్ని పొగిడేవారు.

మోహనరావుగారికి స్ఫూర్తి కలిగిందంటే- పునుగు, జవ్వాది, కుంకుమ కెసరి గంధంబు ... అనో లేదా మరింకేదో పాటనో అందుకునేవారు. చుట్టూ పక్కవాద్యాలున్నట్లుగానే సంగతులువేస్తూ ఆయన పాడుతుంటే అందరికీ దుఃఖం, సంతోషం ఒక్కసారే కలిగేవి.

ఒకరోజు మోహనరావుగారు మంచి ఉత్సాహపువూపులో వుండి భూకైలాస్ నాటకంలో ఒక ఘట్టాన్ని అభినయించి చూపారు. లింగం భూమికి అతుక్కుపోయి, పైకిఎత్తడానికి సాధ్యపడని పరిస్థితితో రావణునిగా ఆయన నటన చూసేవాళ్లకి రంగస్థలం, ఆభరణాలు, వస్త్రాలంకరణ ఏదీలోటుగా అనిపించలేదు. అద్భుతమైన ఆయన అభినయంతప్ప ఇంకేమీ కనపడలేదక్కడివారికి.

రాజారావుగారయితే ఆయన నాటకాలని నాటకరంగంపై ఎన్నోసార్లు చూసినవారే. ఆయన అభినయనానికి ముగ్ధులై అడగకూడని ప్రశ్న ఒకటి అడిగేశారు.

"అయ్యా! మీరెందుకు నాటకాల్లో నటించడం మానేశారూ?" అని.

మోహనరావుగారి ముఖం చిరచిరలాడింది. ఆయన తిరస్కారంగా, "జుట్టు కాస్త తెల్లబడ్డంత మాత్రాన ధృతరాష్ట్రుడి వేషం వెయ్యమంటాడా ఆ ఛండాలుడు–!" అని ఎగిరిపడ్డారు. రాజారావుగారికి అర్ధమయింది.

"ఆమాటన్న పాపిష్ఠివాడెవడు? బుద్ధిమా

లిన ఆ మనిషి ఇవాళ్టి మీ అభినయాన్ని చూస్తే తెలిసొచ్చేది'' అన్నారు.

ఆ పొగడ్తతో శాంతించారు మోహనరావుగారు.

''వాళ్ళమొహం, వాళ్ళకేం అర్థమవుతుంది గనుక! అసలు నేనే ఒక కంపెనీ మొదలెడతాను. మిమ్మల్ని సెక్రటరీగా చెయ్యాలనుకుంటున్నాను. బ్రహ్మాండమైన సీన్లతో సుభద్రాకల్యాణం వేద్దాం. కాని సుభద్రవేషానికెవర్ని సెలెక్ట్ చేద్దామంటారు!'' అని ఆలోచన మొదలెట్టగానే రాజారావుగారు మాట మారుస్తూ–

''నేను లండన్ వెళ్ళినప్పుడు ఒక నాటకం చూశాను.'' అంటూ తమ అనుభవాల పేటిక లోంచి ఒక రసవత్తరమయిన కథని బయటకి తీశారు.

మోహనరావుగారికి అప్పుడప్పుడు ఇలాంటి ఆవేశం పొంగి వచ్చేస్తుంటుంది. ఎన్నో ఏళ్ళపాటు నాటకరంగంలో రాజులా వెలిగి ఇప్పుడు ఇలాంటి పరిస్థితిని ఎదుర్కోవాలంటే కష్టంగానే వుందాయనకి. జుట్టుకి నల్లరంగేసినా, ముఖంలో వచ్చిన ముడతలకి ముక్తేది?

సినిమాల జోరు ఎక్కువై నాటకం కంపెనీలు మూలబడసాగాయి. ''అరవైయేళ్ళ అర్జునుణ్ణి, ఏభైయేళ్ళ సుభద్రని చూడ్డానికి మీ కంపెనీ నాటకాలకి రావాలా?'' అని జనం హాస్యం చేస్తుంటే, మోహనరావుగారు నాటకాలాడే కంపెనీ యజమాని అప్పాజీగారు 'మురళీధర్' అనే కొత్తహీరోని తయారుచేసి స్టేజి మీద నిలబెట్టారు. పొడుగ్గా, ఎర్రగా వుండే 'మురళీధర్' ప్రేక్షకులకి ప్రీతిపాత్రుడయ్యాడు. మోహన్రావుగారికున్న సంగీతజ్ఞానం ఆ ఠీవి, గాంభీర్యం అతనికి లేకపోయినా వయసులో వున్నాడన్న కారణం వల్ల చలామణీ అయిపోయాడతను. తనుకాక మరొకరు హీరో వేషాలేస్తుంటే మోహనరావుగారికి ఆ కంపెనీలో వుండటం ఇష్టం లేకపోయింది. ఆకాశంలో విహరిస్తున్న మనిషి తన్నని నేలమీద పడ్డట్టయింది. పడినవాళ్ళు గాయపడక తప్పదు కదా, ఆ గాయన్ని కాలమే మాన్పాలి.

బాదంపప్పు, పటికబెల్లం పొట్లాలు తీసుకొచ్చిన రఘురాం యశోదనడిగాడు-

''మన మోహనరావుగారి జీవితచరిత్రని ప్రచురిస్తామని ఒక పత్రికవాళ్ళడిగారు. నేను రోజూ సాయంత్రం వచ్చి ఆయనదగ్గర కూర్చుని అన్నీ తెలుసుకుని రాసుకెళ్తూ వుంటాను. మీకేమయినా అభ్యంతరమా?''

''దానికి నన్నడగాలా... నిస్సంకోచంగా రాసుకోండి'' అంది యశోద.

విషయం 'ఫలానా' అని చెబితే మోహనరావుగారు అంగీకరించారు. సరే రాద్దామని పుస్తకం, పెన్ను పట్టుకుని కూర్చుంటే అదంత సులువైన పనిలా కనిపించలేదు.

''రాసుకో... పంతొమ్మిదొందల నలభైఆరు, చామరాజ నగరం క్యాంపు...'' అని మొదలెట్టి ఒక సంఘటనని వర్ణించారు. ఇలా ఒక్కొక్క సంఘటననీ వర్ణించుకుంటూ పోతే ఎలా? ప్రతిసాయంకాలం కూర్చుని ఒక్కొక్కటీ వరసగా గుర్తుచేసుకుని, చెబితే రాయాలంటే రఘురాంకి కష్టమే. ఆయనే రాసిపెడితే బాగుంటుంది. కాని ఆయనలారాసే రకంకాదు.

ఈ బాధల్ని యశోదతో చెప్పుకుంటే- ''ఒక పని చెయ్యండి. రాజారావుగారిక్కడే వుంటారు కదా! ఈయన అప్పుడప్పుడూ ఒక్కోసంగతి చెప్తుంటే రాజారావుగార్ని పద్ధతిగా రాసి వుంచమందాం. తరువాత దాన్ని మీరొక నిర్దిష్టరూపానికి తెచ్చుకుందురుగాని'' అంది.

ఆమె సూచన రఘురాంకి, రాజారావుగారికీ కూడా నచ్చింది. మోహనరావుగారి జీవితచరిత్ర ఒక రూపాన్ని దిద్దుకోడం మొదలెట్టింది–

మిడిల్స్కూల్ చదువు పూర్తయేటప్పటికి కుర్రాడికి పధ్నాలుగేళ్ళు నిండాయి. పల్లెలో చదువుకి అనుకూలంలేదు. తండ్రిలేని పిల్లాడు. మగవాళ్ళ అదుపాజ్ఞల్లో పెరిగితే మంచిదని తల్లి అచ్చమ్మ, కొడుకుని మైసూర్లో తన అన్నగారింటికి పంపించింది. మేనమామ కొడుకు చంద్రు కూడా మోహన్ వయసువాడేగాని అప్పుడే హైస్కూల్ సెకెండియర్లో వున్నాడు. అతనికంటే పెద్దది గౌరి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళింది. ఆ ఇంటికి మోహన్ కొత్తవాడేంకాదు. తల్లితో ఎన్నిసార్లో వచ్చాడు. రెండుమూడుసార్లు నవరాత్రులప్పుడొచ్చి మహారాజుగారి వూరేగింపు, రాజభవనపు దీపాలంకరణ, ఉత్సవాలు అన్నీ చూశాడు.



కాని అక్కడే వుండి చదువుకోవాలంటే మాత్రం ఎందుకో ఇబ్బందిగా అనిపించింది.

"చదివింది చాలు, నేనక్కడికివెళ్లను?" అన్నాడు. తల్లి ఒప్పుకోలేదు.

"మనకేవన్నా ఆస్తాపాస్తా? చక్కగా చదువుకుని మంచి ఉద్యోగంలో చేరు. నీకాళ్ళమీద నువ్వు నుంచోగలిగితే అంతే చాలు. ఇంతకీ అదేమన్నా పరాయి చోటా? స్వంత మేనమామ ఇల్లేగా" అని నచ్చ చెప్పి పంపించిందావిడ.

మేనమామ శ్యామరావు చాలా క్రమశిక్షణ గల మనిషి. ఆయన కొడుకూ అంతే. మేనత్త మృదుస్వభావంగల స్త్రీ. పల్లెటూళ్ళో స్వేచ్ఛగా పెరిగిన మోహన్ కిక్కడ ఊపిరాడేదికాదు. ఇక్కడపొద్దున కాఫీ తాగడం దగ్గర్నుంచి రాత్రి నిద్రపోయేవరకూ అన్నీ నియమబద్ధంగా గడియారం ప్రకారం జరుగుతాయి. తన వయసువాడే అయిన చంద్రూతో కొంచెం కబుర్లు చెబుదామా అంటే అతనేమో తన చదువు, స్నేహితులు, లైబ్రరీ అంటూ బిజీగా వుంటాడు. తీరిగ్గా వుంటే బాగానే మాట్లాడతాడు. మోహన్‌కి కాస్త సంతోషకరమైన విషయం ఏమిటంటే అతని చిన్న మేనమామ రంగారావు సహవాసం. అతనికొక పుస్తకాల దుకాణం వుంది. అక్కడ స్కూలు పుస్తకాలు, నోట్‌బుక్స్ మాత్రమే కాకుండా కథల పుస్తకాలు కూడా వుండేవి. మోహన్‌కి మొదట్నుంచి చిన్నమామయ్య దగ్గర చనువెక్కువ. ఇప్పుడూ అతడెక్కువగా ఈ బ్రహ్మచారి మామయ్య సహవాసంలోనే గడుపుతాడు.

దసరా నవరాత్రులకి కొన్నాళ్ళు ముందు ఒకరోజు వీధిలో దండోరా వినిపించింది. ఊళ్ళోకి జగదీశ్వరి నాటకాల కంపెనీ వచ్చిందని చాటింపు! కురుక్షేత్రం నాటకమట! మోహన్‌కి చిన్నప్పట్నుంచీ సంగీతమన్నా నాటకాలన్నా ఎంతో ఇష్టం. తల్లిపాడే భక్తిగీతాన్ని తనూ నేర్చుకుని ఆమెకంటే కూడాశ్రావ్యంగా పాడేవాడు. పల్లెలో స్నేహితులవల్ల జగదీశ్వరి కంపెనీ నాటకాల గొప్పతనం ఏమిటో తెలుసుకున్నాడు. అందులోనూ వాళ్ళ 'కురుక్షేత్రం' చాలా వైభవంగా వుంటుందట. ఆ నాటకాన్నెలాగైనా సరే చూడాలని అతని కోరిక. తన కోరిక తీరాలంటే రంగారావునే ఆశ్రయించాలన్న సంగతి అతనికి తెలుసు.

నాటకం ప్రకటన తాలూకు కాగితాన్ని తీసుకెళ్ళి చిన్నమామయ్యకి చూపిస్తే, ఆయన నవ్వి, వీపుమీద తట్టి, "అలాగే వెళ్దాంలే" అన్నారు.

నాటకాన్ని ఒక్కసారి చూడ్డంతో కుర్రాడు తృప్తిపడలేదు. రెండుమూడుసార్లు చూశాడు.

ప్రతిరోజు వేళకి ఇల్లు చేరకపోవడంతో శ్యామరావుగారు కోప్పడ్డారు. "పరీక్షలు దగ్గరకొచ్చాయి కదా, ఒళ్ళొంచి చదువుకోడం మానేసి, ఈ నాటకాలు పట్టుకు తిరగడవేమిటి? అందుకేనా మీఅమ్మ నిన్నిక్కడకి పంపించింది?" అని మందలించారు.

మోహన్‌కి చదువులో ఆసక్తిలేదు. మామయ్యగారింట్లో బిగువైన వాతావరణం అతనికి నచ్చలేదు. సెలవుల్లో పల్లెకి వెళ్ళిన అతను తిరిగి మైసూరుకి రానేలేదు. అక్కడితో అతను చదువుకి మంగళం పాడేశాడు.

కొడుకు బాగా చదువుకొని వృద్ధిలోకి రావాలన్న తల్లి కోరిక నెరవేరలేదు. చుట్టుపక్కల వూళ్ళల్లో జాతరలు, సంబరాలు జరిగినప్పుడు ఏ నాటకం కంపెనీ వచ్చినా సరే ఇతను వెళ్ళక తప్పదు. అదీ ఒక్కసారికాదు. రెండుమూడు సార్లు. ఆ నాటకాన్ని చూసి వచ్చాడంటే ఆ పద్యాలు, సంభాషణలు తు.చ. తప్పకుండా అప్పగించేవాడు. ఆ పాటలు, పద్యాలకి తన కల్పనని జతచేసి స్నేహితుల్ని చేర్చి నాటకం ఆడేవాడు.

అచ్చమ్మగారి చెల్లెలి కూతురు పెళ్ళికి పిలుపువస్తే ఆవిడ బయల్దేరారు. కొడుకునీ రమ్మని పిలిచారు.

పెళ్లయిన వారంరోజుల్లో ఆ వూరికి జగదీశ్వరీ నాటకాల కంపెనీ విజయం చేస్తుందని తెలిసిన మోహన్ సంతోషంగా బయల్దేరాడు.

పెళ్ళికి మైసూరు నుంచి మేనమామలిద్దరూ, చంద్రూతోసహా వచ్చారు. చంద్రు బి.ఎస్‌సి పూర్తిచేసి ఎం.ఎస్‌సిలో చేరాడు. అతన్ని చూసిన అచ్చమ్మగారికి తన కొడుకూ అలా చదువుకుని టిప్-టాప్‌గా వుండకూడదా అనిపించింది. ఏమిటో అంతా నుదుటిరాత అనుకుని తన బాధని కొడుకు దగ్గర కూడా బయటపెట్టారు. ఏంలాభం?





లగ్నంనాడుండి చంద్రువెళ్ళిపోయాడు. శాస్త్రాలన్నీ పూర్తవగానే మిగతా బంధువులూ వెళ్ళిపోయారు. చెల్లెలి బలవంతంతో అచ్చమ్మగారు కొన్నాళ్ళక్కడే ఆగిపోయారు. అందువల్ల మోహన్‌కి లాభమే జరిగింది. జగదీశ్వరీ కంపెనీవాళ్ళు 'కురుక్షేత్రం', 'కృష్ణలీలలు' నాటకాలే కాకుండా ఇంకా, 'మన్మధ విజయం', 'యమధర్మ గర్వభంగం' నాటకాలని కూడా ఆడబోతున్నారు. మోహన్ ఒక్కరోజూ మానకుండా ఆ నాటకాలన్నీ శ్రద్ధగా చూశాడు. ఒక్కొక్కపాత్ర ప్రదర్శించే హావభావాలు, చెప్పే సంభాషణలు, పాటలు అన్నీ శ్రద్ధగా గమనించేవాడు.

ముఖ్యపాత్రధారులే కాకుండా చిన్నచిన్న పాత్రలను ధరించేవారు కూడా చూపించే నటనాకౌశలాన్ని చూసి ముగ్ధుడయ్యేవాడు. అదే జగదీశ్వరి కంపెనీలో గొప్పదనం. నాటకంయొక్క యశస్సుకి ప్రతిఒక్కరూ శ్రమించేవారు. రోజూ వచ్చి ముందువరసలో కూర్చొని ఆసక్తిగా నాటకాలు చూసే మోహన్‌ని కంపెనీ యజమాని శివనంజప్పగారు గమనించారు.

ఆఖరి రోజున నాటకం అయిపోయాక మోహన్ వారి ముందు నుంచుని 'నమస్కారం' అని పలుకరిస్తే ఆయన చిరపరిచితుడిలా మాట్లాడించారు. ఆ కంపెనీలో చేరాలన్న కోరికను మోహన్ వ్యక్తంచేయగానే ఆయన సంతోషంగా అంగీకరించారు.

కొడుకు నిర్ణయాన్ని విని అచ్చమ్మగారు లబోదిబోమన్నారు. "నాటకాలు చూడ్డానికి బాగుంటాయి నిజమే. కాని నాటకం కంపెనీలో చేరి నిలదొక్కుకోవడం తమాషానా? నీతి నియమాలు లేని జీవితం, ఊరూరా తిరగటం .... ఎందుకొచ్చిన బాధ! ఇవన్నీ మనకొద్దు నాయనా" అని చెప్పిచూశారు. ఉపాయంగా మైసూరు తీసుకెళ్ళి అన్నగారిచేత బుద్ధిచెప్పించారు.

"ఇవేం సరదాలు? నాటకాలు, సంగీతం వీటితో కడుపునిండునా, కాలునిండునా? ఎస్సెసెల్సీ అయినా పూర్తిచేసి నెలకి ఇంత అని జీతం వచ్చే ఉద్యోగం చూసుకో ముందు. అప్పుడు కావాలంటే నాటకాలూ వెయ్యి. అంతే గాని కంపెనీలని పట్టుకుని వేళ్లాడితే ఏంఉవ యోగం వుండదు" అని చెప్పారాయన.

ఎవరెన్ని బుద్ధులు చెప్పినా మోహన్ తలకెక్కలేదు. తన నిర్ణయాన్ని ఇంకొంచెం దృఢపరుచుకొని ముందుకిసాగదల్చుకున్నాడు.

మంచి స్వరం, సంగీతజ్ఞానముగల అతనికి ప్రసిద్ధ సంగీత విద్వాంసుడయిన వెంకటరమణశాస్త్రిగారిదగ్గర సంగీతాభ్యాసం ప్రారంభమయింది. రంగస్థలాలంకరణలో సహాయపడటం, చిన్నచిన్న పాత్రలనభినయించడం, గంటలకొద్దీ సంగీతాభ్యాసంచెయ్యడం.... ఇలా రెండేళ్ళు గడిచిపోయింది. ఎంత చిన్నపాత్రయినా అతనికి తప్పనిసరిగా ఒక పాటపాడే అవకాశం దొరికేది. అయితే ఎంతో ఉత్సాహంతో, కోరికతో కంపెనీలో చేరిన అతనికి ఈ చిన్నచిన్న పాత్రలతో తృప్తిదొరికేదికాదు. అలాగని తన అసంతృప్తిని బయటపెట్టుకోవడం కుదరదు. సంగీతాభ్యాసంలో కూడా ఆసక్తి తగ్గసాగింది.

ఓనాడు శివనంజప్పగారు అతన్ని పిలిచి "ఈమధ్య సంగీతం సరిగ్గా అధ్యయనం చేయటంలేదని మేష్టారు చెబుతున్నారు. నిజమేనా బాబూ?" అన్నారు.

మోహన్ మాట్లాడలేదు.

"నీకు నిరుత్సాహం కలిగివుండచ్చు. ఇక మీదట సంగీతాన్ని బాగా ప్రాక్టీస్‌చెయ్యి. మనం వెయ్యబోయే 'శాకుంతలం' నాటకంలో నువ్వే దుష్యంతుడివి" అన్నారు.

ఎదురుచూసిన అవకాశం వచ్చేసరికి మోహన్‌కి చాలా ఆనందం కలిగింది. రెండింతల ఉత్సాహంతో ప్రాక్టీస్ మొదలుపెట్టాడు. దుష్యంతుడి పాత్ర దొరకడం అతడికొక అపూర్వమైన అవకాశం.

మొదటి ప్రదర్శననాడు కిక్కిరిసిన జనసమూహం ముందు మంచి అనుభవమున్న నటుడిలా ఒక పాటలోగాని, ఒక సంభాషణలో గాని ఏమాత్రం లోపంలేకుండా అభినయించాడు మోహన్. దుష్యంతుడి పాత్రలో అతడి ఠీవి, దర్జాచూస్తే అతను పుట్టడమే రాజకుమారుడిగా పుట్టాడేమోనన్నంత సహజంగా వుండేది ఎన్నోపాటలకి 'ఒన్స్‌మోర్' అరుపులు వినవచ్చాయి. రంగస్థలం అంతా తన ఆటలమైదానం అన్నంత స్వేచ్ఛగా విహరించాడతడు. అతడి ప్రతిభముందు శకుంతల పాత్ర చిన్న



బోయింది.

శాకుంతలం నాటకం అతని స్వంతమైపో యింది.

శివనంజప్పగారు దగ్గరకొచ్చి, రెండుచేతులు పట్టుకుని "అద్భుతంగా నటించావు బాబూ" అని అభినందించి తన మెడలోవున్న బంగారు గొలుసునొకదాన్ని అతనిమెడలో అలంకరించారు.

ఆ ఒక్క నాటకమే మైసూరులో ఇరవై అయిదుసార్లు ప్రదర్శించారు. చూసిన వాళ్ళే మళ్ళీమళ్ళీ చూశారు. ఆ నాటకంలో పాటల వరుసలు ప్రజల నోళ్లల్లో నాట్యమాడాయి. మోహన్ వీధిలోనడుస్తుంటే —

"అతనే దుష్యంతుడి పార్టుచేసినతను.... ఎంత అద్భుతంగా పాడతాడో తెలుసా?" అని జనం మాట్లాడుకునేవారు. మోహన్ చెవులు చురుకుగా వినేవి ఆ మాటల్ని పొగడ్తలు వింటుంటే సహజంగానే సంతోషం కలిగేది.

శాకుంతలం అయ్యాక 'కబీర్‌దాస్' మొదలయింది. అందులో మోహన్‌కేమీ పాత్రలేదు. 'కబీర్‌దాస్' గురించిన ప్రచారం జరుగుతున్న



రోజుల్లో మోహన్ నాలుగురోజులు తమ పల్లెకి వెళ్ళివద్దామనుకున్నాడు. అప్పటికే పల్లెలో శాకుంతలం గురించి కావలసినంత ప్రచారం జరిగింది. ఏదోపనిమీద మైసూరు వెళ్లిన వాళ్లు నాటకం కూడా చూసివచ్చారు. తమ వూరి కుర్రాడు రాజు వేషం కట్టడం వారందరికీ గర్వకారణంగా అనిపించింది. వూరందరికీ ఆ విషయం చెప్పారు.

మోహన్‌పల్లెలో వుండగా అతనితోపాటు ఆటలు, నాటకాలు ఆడిన వాళ్ళొచ్చి "మాక్కూడా కంపెనీ నాటకాల్లో పార్టు ఇప్పించు" అని అడిగారు.

"అయ్యో! కంపెనీ నాటకాల్లో పార్టుచెయ్యడమంటే ఇక్కడ ఆడినట్టు కాదర్రాబాబూ! సంగీతం ఏళ్ళతరబడి నేర్చుకోవాలి. పగలు-రాత్రి రిహార్సల్స్ చెయ్యాలి. చాలా కష్టపడాలి. లేకపోతే డబ్బిచ్చి టిక్కెట్టు కొనుక్కుని వచ్చేవాళ్ళంతా వూరుకుంటారా?" అన్నాడతను.

ఆ మాటలకి అప్పుడు వూరుకున్నా తరువాత వాళ్ళల్లోవాళ్ళు "ఇక్కడ నాటకాలాడినప్పుడు మాత్రం మనవెంటవద్దాడు. ఇప్పుడు మనల్ని కంపెనీలో చేర్చుకోమంటే వంకలు పెడుతున్నాడు. తను మాత్రం రాజాపార్టు చేసి పెరిగిపోవాలని కాబోలు" అని గొణుక్కున్నారు.

వారంరోజులకల్లా శివనం జప్పగారు కబురు పంపారు. వెంటనే బయల్దేరి వెళ్ళాడు మోహన్. 'రాజాహరిశ్చంద్ర' నాటకానికి రిహార్సల్స్ ప్రారంభం అయ్యాయి. మోహనే హరిశ్చంద్రుడి వేషం కట్టాడు. దుష్యంతుడి పాత్రకీ, హరిశ్చంద్రుడి పాత్రకీ గల వ్యత్యాసాన్ని శ్రద్ధగా దృష్టిలో పెట్టుకుని మోహన్ చాలా జాగ్రత్తగా నిర్వహించాడు ఆ పాత్రని. హరిశ్చంద్రుడికి కావల్సిన హావభావాన్ని మనోభావాన్ని తనలో పరిపూర్ణంగా నింపుకున్నాడు. రిహార్సల్స్‌లోనే అతని అభినయాన్ని చూసి కంపెనీలో అందరూ ముగ్దులైపోయారు.

నాటకానికి మంచి ప్రచారాన్నిచ్చారు. మోహన్ దుష్యంతుడి పాత్రని చూసినవాళ్ళంతా మోహన్‌కోసమే 'హరిశ్చంద్ర' చూడ్డానికి వచ్చేవారు. మొదటిరోజు చాలామంది ఎంతో ఉత్సాహంతో వచ్చి టిక్కెట్లు దొరక్క వెనుదిరగాల్సొచ్చింది. హరిశ్చంద్ర పాత్రకి మోహన్ వయసులో చిన్నవాడనిపించినా అతని అభినయంలో లీనమైన జనాలు ఆమాటే మర్చిపోయారు. శాకుంతలం నాటకంలో శృంగారరసాన్ని ఎంత బాగా పోషించాడో అంతకంటే ఎక్కువ బాగా హరిశ్చంద్రలో శోకరసాన్ని అభినయించాడు. స్మశాన దృశ్యం వచ్చిందంటే ప్రేక్షకులతోబాటు మిగిలిన పాత్రదారులు కూడా కన్నీరు కార్చేవారు. రెండు నాటకాల్లో విజయం సాధించేసరికి మోహన్‌కి నాటకరంగంలో భద్ర స్థానం దొరికింది. శివనంజప్పగారు ఆయారోజుల రాబడిని బట్టి పాత్రదారులకి అప్పుడప్పుడు డబ్బిచ్చేవారు. తనకి చాలా త్వరగా హీరో పాత్రని ఇచ్చిన శివనంజప్పగారంటే మోహన్‌కి చాలా గౌరవం. ఆయన సంతోషం కొద్దీ ఏమిస్తే దాన్ని తీసుకెళ్ళి తల్లిచేతికి అందించేవాడు. తనంతటతను ఒక్కనాడు కూడా 'ఇంతకావాలి' అని అడగలేదు. మైసూర్‌లో మాత్రమే కాకుండా మండ్య, హాసన్, నంజనగూడు మొదలైన వూళ్ళల్లో కూడా ప్రదర్శనలు జరిగేవి.

మండ్యలో హరిశ్చంద్రనాటకం జరుగుతోంది .... నక్షత్రకుడు హరిశ్చంద్రుడిని వేధిస్తున్నాడు.... ఆ బాధలు తట్టుకోలేక హరిశ్చంద్రుడు భార్యాబిడ్డల్ని అమ్మేశాడు.. ఆ సమయంలో లోపలేవో గుసగుసలు! నాటకం మూడొంతులు గడిచే సమయానికి శివనంజప్పగారికి గుండెనొప్పి! పడుకోపెట్టారు. మరికాసేపటికి ప్రాణం పోయింది.

తెరవెనుక నుండి వినబడుతున్న మాటలు పాత్రధారుల్ని కుంగదీశాయి. అయినా డబ్బిచ్చి నాటకానికొచ్చిన ప్రేక్షకుల కోసం గట్టిమనసు చేసుకుని, ధైర్యాన్ని తెచ్చుకుని నాటకం పూర్తయిందనిపించాడు మోహన్. తరువాత లోపలకి వెళ్ళి శివనంజప్పగారి మృతదేహంమీద పడి ఘొల్లున ఏడ్చేశాడు. ఇన్నాళ్ళూ తండ్రిలాగా తనని చూసుకున్న శివనంజప్పగారి మరణం అతడిని దిక్కులేని వాడిగా చేసేసింది.

శివనంజప్పగారి మరణంతో కంపెనీ నిరాధారమైపోయింది. శివనంజప్పగారి పిల్లల్లో ఎవరికీ నాటకాలంటే ఆసక్తిలేదు. కంపెనీ సామానంతా అమ్మేసి కంపెనీ మూసేశారు. నటులెవ్వరికీ ఒక్క పైసా కూడా ఇవ్వలేదు.




మోహన్‌కి ఇంకేమి చెయ్యాలో తోచక పల్లెకి వెళ్ళిపోయాడు. కొడుకు పరిస్థితిని చూసి తల్లికి జాలివేసినా,చదువొదిలేసి నాటకాలవెంటపడ్డాడన్న కోపం మాత్రం పోలేదు

"నేను ముందే చెప్పాను ఈ నాటకాలు అవీ పనికిమాలిన నరదాలని.చక్కగా చంద్రూలాగ చదువు కుంటే నువ్వూ ఈ పాటికి మంచి జీతం తెచ్చుకునేవాడివి. ఇప్పుడు ఎటూ కాకుండా అయిపోయావు" అన్నదావిడ.

రెండునెలలు గడిచాక షిమోగాలోని అరవిందా థియేటర్స్ అనే సంస్థ నుంచి ఒక ఉత్తరం వచ్చింది. రెండునెలల నుంచి ఇంట్లో కూర్చుని కూర్చుని పిచ్చెక్కివున్నాడతడు. ఉత్తరం అందుకొని వెంటనే బయల్దేరాడు.

జగదీశ్వరీ కంపెనీలో పని చేస్తూండిన ఒకరిద్దరు అప్పటికే అక్కడ చేరారు. 'సుభద్రాకల్యాణం' నాటకానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. మోహన్‌ని అంత హడావుడిగా పిలిపించడానికి కారణం వుంది. అరవిందా థియేటర్స్‌వారు వేయించే నాటకాల్లో గంగాధర్ అనే అతను హీరో వేషాలేస్తుంటాడు. సుభద్రా కల్యాణంలో అర్జునుడతడే. నాటకం ఇంకోవారంలో ప్రదర్శించాలనగా వెయ్యి రూపాయల ఎడ్వాన్స్ కావాలని గొడవ పెట్టి వెళ్ళిపోయాడు. నాటకం వారం రోజులుందనగా వాళ్ళింకో హీరోని తయారుచేయడం సాధ్యమయ్యేపనికాదు గనుక తనకే టెలిగ్రాం మనియార్డరు ద్వారా డబ్బు పంపి వెనక్కి పిలుస్తారనుకున్నాడతడు. యజమాని పడే కష్టాన్ని చూసి హార్మోనిస్టు శేషాచలం, తనతోబాటు జగదీశ్వరి కంపెనీలో పనిచేస్తూండిన మోహన్ గురించి చెప్పాడు. మోహన్ ఖ్యాతి షిమోగాకి కూడా పాకింది. నరే, పిలిపించారు.

పగలు, రాత్రి, నంభాషణల్ని పాటల్ని కంఠస్థం చేస్తున్న మోహన్‌ని చూసి యజమాని తృప్తిపడ్డాడు. నాటకంలో మోహన్ పాత్ర బాగా ఒప్పింది. కాని సుభద్ర, కృష్ణుడు, నారదుడు బొత్తిగా లాభంలేదు. మిగతా చిన్న పాత్రలకి మరీ చేతకాని వాళ్ళని పెట్టేశారు. అదీకాక కంపెనీలో ఐకమత్యం బొత్తిగా లేదు. ఒకరి మీద ఒకరు పితూరీలు చెప్పుకోడం.... ఆ వాతావరణం మోహన్‌కి అసలు నచ్చలేదు. నెలన్నర గడిచినా మోహన్ చేతికి డబ్బేమీ అందలేదు. భోజనఫలహారాలు గడిచిపోతున్నాయి. నటించాలన్న కోరిక తీరిందంతే. కంపెనీలో మిగతావారికి ఇతడిమీద అభిమానంలేదు. గంగాధర్ వెళ్ళిపోయాక హీరో పాత్ర తమదే అని ఆశపెట్టుకున్న ఇద్దరు ముగ్గురు నటులకి మోహన్‌ని చూస్తే అయిష్టం. అతని అనుభవం, ప్రతిభ - ఆ రెండింటితోనూ వారికి సంబంధం లేదు. వాళ్ళెవరూ మోహన్‌ని పలకరించను కూడా పలకరించేవారుకాదు.

అన్నివిధాలుగా అసంతృప్తి కలిగిన పరిస్థితుల్లో మోహన్ తనంతతనే వెళ్ళి డబ్బు కావాలని అడిగాడు. ఆ కంపెనీ యజమాని నయమైన మాటల్లో "డబ్బెక్కడికి పోతుంది స్వామీ! ప్రస్తుతం ఆర్థికపరిస్థితి అంత బాగోలేదు. సుభద్రాకల్యాణం వేయించడానికి ఖర్చు పెట్టిన డబ్బు దండగైపోయింది" అని వాపోయాడు.

ఆమాట నిజమే. కిక్కిరిసిపోవలసిన హాలు, జనం తక్కువగా ఉండటంతో వెలవెలబోయింది. ఇంక ఎక్కువగా తర్కించకుండా "నరే... డబ్బు వూరికి పంపించండి" అని చెప్పి మూటముల్లె కట్టాడు.

వయసొచ్చిన కొడుకు ఇలా నాటకాలంటూ వూళ్ళు వెంట తిరుగుతున్నాడే అని తల్లికి బాధ. పెళ్ళి చేస్తే ఇంటిపట్టున వుంటాడేమోనని ఆశ. అతనేమో ఇప్పుడే పెళ్ళీగిళ్ళీ ఏమీ వద్దన్నాడు. పదిరకాలుగా కొడుక్కి నచ్చజెప్పిందావిడ. నరే... అతడు "ఊ" అన్నాక సంబంధాలు చూడ్డం మొదలెట్టింది. ఒకటి రెండు చోట్ల ప్రయత్నం చేస్తే వాళ్ళు నాటకాల కుర్రాడు ఒద్దన్నారని తెలిసి ఖిన్నురాలయింది.

ప్రైమరీ స్కూలు మాస్టరయినా నరే, వున్న కాస్త పొలం చూసుకుంటూ కుదురుగా వుంటే బాగుండేది. అప్పుడు జనం ఇలా మాట్లాడే అవకాశం కలిగేది కాదు అనుకుందావిడ. అన్నగారికి, అక్కగారికి, చెల్లెలికి ఉత్తరాలు రాసింది. అక్క దగ్గర్నుంచి వెంటనే వుత్తరం వచ్చింది. అప్పటికే ఆవిడ ఒక సంబంధం చూసి వుంచింది. జాతకాలు కలిశాయి. ఇక పిల్లని చూసి ఒప్పుకోవడమే తరువాయి. నాటకాల మోజున్న కుర్రాడు కదా అని, అందమైన,

తెల్లనైన పిల్లని చూసిందావిడ. ఆ పిల్ల పేరు లక్ష్మి.

లక్ష్మిని ఇంటికి తీసుకొచ్చాక మూడు నెలల పాటు ఎక్కడకీ కదల్లేదతడు. చిన్నచిన్న కంపెనీలనుంచి ఉత్తరాలొచ్చినా జవాబు కూడా రాయలేదు. అరవిందా థియేటర్స్‌లో అయిన అనుభవం మళ్ళీకోరుకోవడంలేదతను.ఇంట్లో లక్ష్మి వున్నది గనుక తోచదనే సమస్యలేదు.

హార్మోనిస్ట్ శేషాచలం మళ్ళీ ఒక ఉత్తరం రాశాడు. జగదీశ్వరి కంపెనీ వాళ్ళు కొందరు, అరవిందా థియేటర్స్ వారు కొందరు కలసి తామే ఒకకంపెనీని నడవటానికి నిర్ణయించినట్టూ, మోహన్‌ని కూడా వచ్చి చేరమని కోరుకుంటునట్టూ రాశాడతను. కాదనలేక వెళ్ళాడు మోహన్. ఆర్థికమైన మద్దతులేకుండా, ఒక యజమాని లేకుండా కంపెనీని నిర్వహించడం కష్టమని అందరికీ తెలును. అయినా శక్తికిమించి కష్టపడి రుక్మాంగద నాటకానికి సిద్ధంచేసుకున్నారు. చిక్కమగళూరు మొదలైన వూళ్ళలో సుమారుగా నడిచింది నాటకం. సాగర్‌లో వానవల్ల ప్రేక్షకులురాక కంపెనీలోని నటులకి భోజనసదుపాయాలు చెయ్యడమే కష్టమైపోయింది. మళ్ళీ అంతా వారివారిళ్ళకి చేరుకోవాల్సొచ్చింది.

మోహన్ వూరికి చేరేటప్పటికి మైసూరు నుంచి ఆయన మేనమామ వచ్చాడు.

"ఏమయ్యా... పెళ్ళయినా నాటకాలపిచ్చి ఇంకా వదల్లేదా?" అనడిగారు.

"అది వదిలేపిచ్చి కాదనిమీకు తెలుసుకద మామయ్యా" అని జవాబిచ్చాడతడు.

"అయితే ఏదయినా మంచి కంపెనీలో చేరక ఎందుకొచ్చిన బాధలివి?"

మోహన్ వూరుకున్నాడు. తను చక్కగా పాడగలనని, అభినయించగలనని మోహన్‌కి తెలుసు. ఇప్పుడు తనువెళ్ళి ఎవరిముందయినా చేతులుకట్టుకునుంచుని వనిప్పించండి అని అడగటం అవమానం.

రంగారావుగారు, "వచ్చేనెలలో మైసూరుకి గజానన కంపెనీ వస్తోంది. వాళ్ళనాటకాల సంగతి నీకుతెలుసుగా. వచ్చేనెలలో అక్కడికిరా. వాళ్ళని అడిగిచూద్దాం. అమాటే చెప్పిపోదామని వచ్చాను" అన్నారు.

మోహన్ మళ్ళీ రెండుపూటలా శ్రద్ధగా సంగీతాన్ని అధ్యయనం చేయడం ప్రారంభించాడు. గజానన కంపెనీ నాటకాలన్నీ సంగీతమయమని అతనికి తెలుసు.

మొదటిరోజు కృష్ణలీలలు నాటకం ఆడారు వాళ్ళు. బ్రహ్మాండమైన సెట్టింగులు,ఉత్తమమైన అభినయం, రెండు ఫిడేళ్ళు, హార్మోనియం, తబలాలతో సంగీతం సమ్మిళితమై నాటకం రక్తిగట్టింది. ప్రజలమెప్పును పొందింది. 'వుంటే ఇలాంటి కంపెనీలో వుండాలి'అనిపించింది మోహన్‌కి.

ఒకరోజు రంగారావుగారే మోహన్‌ని కంపెనీ యజమాని అప్పాజీగారి దగ్గరకి తీసికెళ్ళారు. మోహన్ దుష్యంతుడిపాత్ర గురించి అప్పటికే ఆయన వినివున్నారు. కాని అప్పటికే ఆ కంపెనీలో ముఖ్యపాత్రలన్నిటికీ ఇద్దరిద్దరు పాత్రధారులున్నారు. ఒకవేళ ఎవరికైనా అనారోగ్యమో అనుకోని అవసరమో వచ్చి శలవుపెడితే రెండవవారు అన్నివిధాలా సిద్ధంగా వుంటారు. సమయంవస్తే అప్పాజీగారే కొన్ని పాత్రలని స్వయంగా నిర్వహించేవారు. అందుకని...

"కొత్తనాటకాన్ని మొదలుపెట్టేటప్పుడు కబురుచేస్తాను. సంగీతాభ్యాసాన్ని వదలిపెట్టకండి" అని చెప్పారు అప్పాజీగారు.

వారి కొత్తనాటకమే 'శకుంతల'.

నాలుగైదు నెలల నిరీక్షణ సార్థకమయింది మోహన్‌కి. శకుంతల పాత్రని నిర్వహించడానికి జానకి అనే నటి వుండేది. స్త్రీ పాత్రలని స్త్రీలే పోషించడం గజానన కంపెనీ ప్రత్యేకత. జానకికూడా మంచి సంగీతవిద్వాంసురాలు. మోహన్‌తో సరిసమానంగా శ్రుతిబద్ధంగా పాడేది. మోహన్ అప్పటికే దుష్యంతుడివేషం కట్టాడు గానీ, జానకికి శకుంతల పాత్రధారణ ప్రథమం. ఆ పాత్రకి కావాల్సిన రూపలావణ్యాలు, అవయవ సౌష్ఠం...వీటన్నిటితోపాటు మంచి ఉత్సాహమువున్నాయి. జానకి చేసే శకుంతల పాత్రనిర్వహణ మోహన్‌కి మంచి ఉత్సాహాన్నిచ్చింది. మూడునెలలు మంచి ప్రాక్టీసు జరిగాక నాటకం రంగప్రవేశం చేసింది. కంపెనీ ఏవూరికివెళ్ళినా జనం-'శకుంతల' నాటకాన్ని అడిగి ఆడించేవారు. మోహన్‌పాటలకి అత








# జండూ పంచారిష్ట




**ఐదు ఆయుర్వేద టానిక్‌ల అద్భుత మిశ్రణం. మీ జీర్ణశక్తిని మెంపొందింపజేస్తుంది.**

ఎక్కువగా, జబ్బులకు కారణం జీర్ణశక్తి లోపించడమే. వాటి లక్షణాలు వేరువేరైనా, ఫలితం ఒక్కటే — జీర్ణశక్తి క్షీణించడం, ఆరోగ్యం చెడిపోవడం.

జండూ పంచారిష్ట ఐదు మహాత్వపూర్ణమైన ఆసవములు, అరిష్టముల మిశ్రమం — అశ్వగంధారిష్ట, లోహాసవము, దశమూలారిష్ట, కుమారీ ఆసవము మరియు అంగూరాసవము. జండూ పంచారిష్టలో ఈ ఐదింటి మిశ్రమం జరిగినపుడు ఒక విశిష్టమైన, శక్తివంతమైన టానిక్ తయారవుతుంది. ఇది మీ జీర్ణశక్తిని పరిష్ఠం చేస్తుంది.

జండూ పంచారిష్ట ఆకలిని అధికం చేస్తుంది కూడా.

మీకు తెలిసిందే కదా ఆరోగ్యమే మహాభాగ్యం!

**జండూ పంచారిష్ట**

ఐదు ఔషధములతో కూడిన జీర్ణకారి టానిక్

ZP 16 173 TEL

డితో జానకి కలిసిపాడే డ్యూయెట్లకీ ప్రతిచోట 'వన్స్‌మోర్' తప్పేదికాదు. అదే కంపెనీలో మరొక ఉత్తమగాయకుడున్నాడు. భక్తిప్రధానమైన నాటకాల్లో హీరో పాత్రలు అతనివే. ఇద్దరూ మంచి గాయకులేగాని వేరువేరు విధాలైన పాత్రలు నిర్వహిస్తుండటంవల్ల వారిలోవారికి మనస్తాపాలు వచ్చే అవకాశం వుండేదికాదు. ఇద్దరూ ఒకరి ప్రతిభనొకరు మనస్ఫూర్తిగా అభినందించుకునేవారు.

ప్రాక్టీసులో వున్న మూడునెలలు మోహన్‌కి సంభావనగా ఏమీ లభించకపోయినా నాటకం ప్రారంభమయ్యాక ఇంత అని జీతాన్ని నిర్ణయించి ప్రతినెల ఐదవతారీఖుకి నిక్కచ్చిగా ఇచ్చేసేవారు. ఇది అతడికి కొత్త అనుభవం. మొదటి నెల జీతాన్ని అలాగే తల్లికి పంపేశాడు. ఆమె సంతోషంగా ఆశీర్వదిస్తూ ఉత్తరం రాయించింది.

వర్షాకాలంలో రెండునెలలు శలవులివ్వడం అప్పాజీగారికి అలవాటు. శలవుల్లో ఇంటికి వెళ్ళేడప్పుడు, మోహన్‌కి తన భార్య గుర్తొచ్చి తన దగ్గర కూడబెట్టి వుంచిన సొమ్ముతో ఒక బంగారు గొలుసు ‿యించి తీసుకెళ్ళాడు. అది చూసి అచ్చమ్మ

"లక్ష్మీ నీఅదృష్టం మంచిదమ్మా. వీడు కుదురుగా ఒకచోట వుండటమే కాక చేతినిండా సంపాదించగలుగుతున్నాడు" అన్నారు. ఆరెండు నెలలూ కొడుకుకి రకరకాల వంటలు చేసి తినిపించారు.

"లక్ష్మిని తీసుకుని ఆమె పుట్టింటికి నాలుగురోజులు వెళ్ళిరా" అని పంపించారు.

గజానన కంపెనీ ఆర్థికంగా భద్రమైన కంపెనీ. యజమాని అప్పాజీగారు, వారి పిల్లలు అంతా నటీనటుల పట్ల గౌరవంగా నడచుకునేవారు. మోహన్ తన ఉత్తమ సంగీతాభినయాలతో మాత్రమేకాక తన హుందాతనంతోను సూటిగా మాట్లాడే మనస్తత్వంతోను అప్పాజీగారికి ప్రీతిపాత్రుడయ్యాడు. మోహన్ సంగీతం జనానికీ ప్రీతిపాత్రమైంది. అతని రాగాలు రసికులనోట మళ్ళీమళ్ళీ వినవచ్చేవి. కొన్ని పాటలు రికార్డులుగా వచ్చి గ్రామఫోన్ వున్న ప్రతి ఇంటావెలిశాయి. నాలుగేళ్ళు ఆ

కంపెనీలో నిలదొక్కుకోగానే అప్పాజీగారు మోహన్ కోసమే నాటకాలు రాయించడం మొదలెట్టారు. మోహన్‌రావుగారు పాత్రధరిస్తున్నారంటే ఆ నాటకాలకి టికెట్ దొరకడం కష్టమయిపోయేది. చుట్టుపక్కల వూళ్ళవాళ్ళు బళ్ళు కట్టించుకునొచ్చి నాటకాన్ని చూసివెళ్ళేవారు. నెలల తరబడి ఒకేవూళ్ళో వుండాల్సొస్తే చిన్న ఇల్లొకటి తీసుకొని భార్యని వెంటబెట్టుకుని వచ్చేసేవాడతడు. తల్లిమాత్రం వూరొదిలి రావడానికిష్టపడేదికాదు. ఒక్కసారి మాత్రం అతడి వెంట 'తరీకెరె' కి వెళ్ళి అట్నుంచి అటే శృంగేరి కూడా చూసి వచ్చిందావిడ. కొడుకు రంగస్థలంపై దుష్యంతుడిగా, అర్జునుడిగా, హరిశ్చంద్రుడిగా అభినయించడం కళ్ళనిండుగా చూసిందావిడ. కొడుకుకిప్పుడు మంచి కీర్తి వచ్చింది. అప్పుడప్పుడు పేపర్లలో ప్రచురింపబడే వార్తలనీ , అతడి ఛాయా చిత్రాలనీ లక్ష్మి చూపించేది. అతడి గురించిన వ్యాసాలు చదివి వినిపించేది.

కొడుకు కాలేజీల్లో చదివి డిగ్రీ తీసుకోవాలన్న తన కోరిక నెరవేరక పోయినప్పటికీ ఏదో ఒకరంగంలో ప్రవేశించి అందులో కీర్తి సంపాదించడం చూసి అచ్చమ్మగారు ఎంతో సంతోషించారు. 'భగవంతుడు చల్లగా కాపాడాలివాణ్ని' అని దేవుణ్ణి వేడుకుంది.

లక్ష్మికి పిల్లల్లేరన్న కొరత తీరకుండానే ఆవిడ కన్ను మూసింది. తరువాత ఒక ఆడపిల్లని కన్నా ఆపిల్ల మూడునెలలు బతికి చనిపోయింది. రెండేళ్ళ తరువాత మళ్ళీ మగపిల్లాడు వుట్టాడు. వాడు రెండునెలల కంటే బతకలేదు. తరువాత లక్ష్మికి పిల్లలు కలుగలేదు. ఎక్కువగా దైవధ్యానంలో కాలంగడపటం, రామాయణం, భారతాలు చదువుతూ వుండటం, భర్తతో కూడావుంటూ అతనికి కావల్సినవి అమరుస్తూ అతని కీర్తిని, సుఖాన్ని కోరుతూ దైవాన్ని ప్రార్థించడంలో శాంతిని పొందేది లక్ష్మి. పొద్దున్న లేచేవేళకి మొహం కడుక్కుందుకు వేణ్ణీళ్ళు అమర్చటం దగ్గర్నుంచి రాత్రి రిహార్సల్స్‌చేసి అలిసివచ్చిన అతనికి సేదదీర్చడం వరకూ ప్రతీపనీ శ్రద్ధగా చేసేది. సంగీతం ప్రాణమైన పాత్రలలో నటించే అతని స్వరశ్రావ్యతని కాపాడటానికి జాపంపప్పు, ఎర్రకలకండ, కుంకుమపువ్వు మూడింటిని నూరి పాలల్లో కరగించి ప్రతిరోజూ




తాగించేది.

నాటకరంగంలో మోహన్ సంపాదించిన కీర్తి ఇంటింటా వ్యాపించింది. పిల్లల దగ్గ ర్నుంచి ముసలివాళ్ళవరకూ అతని పేరు పరిచయమే. మోహన్ నాటకాల కంపెనీల్లో చేరిన కొత్తల్లో అతని పేరు వింటే, 'ఆ... వాడా!' అని చులకనగా మాట్లాడిన బంధువర్గం ఇప్పుడు, పిలవకపోయినా అతడింటికి వచ్చి మర్యాదలు పొంది వెళ్తున్నారు.

బంధువర్గంలో ఎవరికైనా ఒడుగో పెళ్ళోఅంటే మోహనరావుగారి అదృశ్యహస్తం వుండా ల్సిందే. ఇలా వుండగా ఒకసారి-

శివమొగ్గ, సాగర్ క్యాంపులు పూర్తిచేసి 'అర సికెరె' అనే వూరికి బయల్దేరారు. అంతలో ఒకరాత్రివేళ, మోహనరావుగారికి విపరీతమైన చలి, జ్వరం వచ్చేశాయి. మలేరియాఅన్న విషయం వెంటనే అర్థమైపోయింది. రావుగా రు ప్రయాణాన్ని మానుకుని ఆగిపోయారు. రావుగారి పాత్రని ఆ స్థాయిలో అభినయించగ లిగే శక్తిగల వారు మరెవరూ లేకపోవడంతో నాటకప్రదర్శననే ఆపివేయవలసివచ్చింది. మోహనరావుగారి నాటకాన్ని చూడాలని తహ తహలాడిపోతున్న అరసికెరె ప్రజలు చాలా గొడవ చేశారు. అప్పాజీగారు స్వయంగా రంగ స్థలంమీదకొచ్చి ప్రేక్షకులముందు చేతులుజో డించి నమస్కరించి క్షమాపణలు కోరుకున్నా రు. మోహనరావుగారి అనారోగ్యవిషయం వివ రించి, వారి ఆరోగ్యం కుదుటపడ్డాక, మళ్ళీవా రు అభినయించే శకుంతల, శుభద్రాకళ్యాణం నాటకాలు ప్రదరించే ఏర్పాటుచేస్తానని మాటి చ్చారు.

మోహనరావుగారు సుమారు రెండునెలల పాటు కోలుకోనేలేదు. తరువాతకూడా చాలా నీరసపడ్డారు. కంపెనీ ఆవూరునుండి మరోచో టికి వెళ్ళిపోయింది. మోహనరావుగారు లక్ష్మీ మాత్రం అక్కడేవుండిపోయారు. పరిచయం లేనిచోట ఇలా వుండటం లక్ష్మికి నచ్చలేదు.

మోహనరావుగారు ఖిన్నులై "ఎక్కడికి వెళ్ళ గలం లక్ష్మీ" అనడిగారు.

లక్ష్మికి 'తమదీ' అంటూ ఒకచోటులేకపో వటం బాధాకరంగా తోచింది. ఊరిలోవున్న కాస్తభూమీ చేయిదాటిపోయింది. లక్ష్మికాసేపు ఆలోచించి "మైసూరులో మా అన్నయ్యగా రింటికి వెళ్దాం. మా వదినకూడా మంచావిడే" అంది.

మోహనరావుగారు కోలుకోవడానికి ఆరునెల లు పట్టింది. అప్పాజీగారు తమిళనాడు, ఆంధ్రావేపు టూర్ వెళ్ళబోతున్నారని తెలిసి రావుగారికి ఉత్సాహం వచ్చింది. తనిప్పుడు ఆరోగ్యంగా ఉన్నట్లు తెలియజేస్తూ అప్పాజీగా రికి ఉత్తరం రాశారు. రోజూఆయన జవాబు కోసం ఎదురుచూడ్డమే పనయింది.

నెలరోజులు గడచినా జవాబు రానేలేదు.

ఇదివరలో ఒకసారి కడప, కర్నూలు, తిరు చినాపల్లి, సేలం మొదలైన ఊళ్ళలో ఆయన నాటకాలు వేసినప్పుడు జనం ఆయన సంగీతా న్ని అభినయాన్ని మెచ్చుకుని బంగారువతకా లు, కానులు, శాలువలు మొదలైన బహుమ తులతో సత్కరించారు. ఆకానుకల వెనుకను న్న ప్రేమాభిమానాలు ఆయన మనసుని కది లించాయి. మళ్ళీఅటు వెళ్ళాలని మనసు తహతహలాడింది. ఎప్పుడు తన ఆరోగ్యం బాగుందని తెలిస్తే అప్పాజీగారే స్వయంగా వచ్చి వెంటబెట్టుకు వెళ్తారని కలలు కన్నాడు. అప్పాజీగారు రాలేదు.

మోహనరావుగారు ఆగలేక భార్యతో "ఓ సారి బెంగుళూరు వెళ్ళిరానా?" అన్నారు.

ఆవిడకి దుఃఖం తోసుకొచ్చింది. కంపెనీవా ళ్ళు గుంపులుగా వచ్చి రావుగారేం చెప్తే అది చెయ్యటానికి సిద్ధంగా వుండేవారు. అలాంటి దిప్పుడు 'నేనేవెళ్ళిరానా' అని అడిగే పరిస్థితి వచ్చిందే అని బాధపడిందావిడ. ఆరునెలలు అనారోగ్యంతో పడుకోడమే తప్పయిపోయిందా! అనుకుంది.

"మీరేంవెళ్ళద్దు... వాళ్ళిపాటికే మెద్రాస్ వెళ్ళిపోయారని పేపర్లోచూశాను" అని చె ప్పిందావిడ.

ఆయన పేపరు చూడలేదు. ఆవిడ చెప్పిన వార్త విని నివ్వెరపోయాడు. 'రాజు పాత్రకి తనులేకుండా అదెలా వెళ్తారు?' ఎన్నో కంపెనీ లనుంచి ఎక్కువడబ్బిస్తాం మా కంపెనీలో చేరండి. అనే ఆహ్వానం వచ్చినా నీతికి కట్టుబ డి వీరికంపెనీ వదిలిపెట్టలేదు. ఆవిశ్వాసం అయినా లేకపోయిందా వీళ్ళకి? అని బాధప

డి, సరే... నా తడాఖా చూపిస్తాననుకున్నాడు.

ఇదివరకు అడిగిన కంపెనీల వాళ్ళిద్దరికీ తను వారి కంపెనీల్లో చేరడానికి సిద్ధంగా వున్నట్లు రాశారు. వాళ్ళువచ్చారు, మాట్లాడించారుగానీ నాటకాల్లో వేషంఇచ్చే మాట మాత్రం ఎత్తలేదు. వాళ్ళపద్ధతిచూసి రావుగారికి ఒళ్ళుమండిపోయింది.

ఫలితంగా ఒక నిర్ధారణ జరిగింది. 'గజేంద్ర కంపెనీ' వెలసింది. కావాలనే ఆపేరు పెట్టారాయన. కొంతమంది పాతస్నేహితులకి ఉత్తరంరాసి పిలిపించారు. నటుల్ని, సంగీతకారుల్నీ చేర్చారు. 'నల-దమయంతి' నాటకం వెయ్యడానికి నిర్ణయించారు.

ఇంట్లో నాటకాలవాళ్ళు చేరడం లక్ష్మి అన్నావదినలకి నచ్చకపోవడంవల్ల మరోఇల్లు చూసుకోవల్సొచ్చింది. అదికాక నటులకి జీతమివ్వడానికి నాటకానికి అవసరమయ్యే సామాను కొనడానికి డబ్బుకావల్సొచ్చింది. రావుగారికి బాగా డబ్బొస్తున్నప్పుడు తన చేతికిస్తూండిన సొమ్ములోంచి లక్ష్మి బాగానే దాచింది. ఆమొత్తాన్ని ఆయనచేతిలో పెట్టి సమయానికి ఆదుకుంది. హాసన్‌లో జాతర సమయానికి అక్కడ క్యాంపు వేయదల్చుకుని బాగా ప్రాక్టీసు మొదలుపెట్టారు.

హాసన్‌లో ఒకనెలరోజులు నాటకం జరిగింది. జనం బాగానే వచ్చారుగాని సంపాదన విశేషంగా ఏమీలేదు. లెక్కలు వేస్తే ఖర్చుకి ఆదాయానికి సమానంగా సరిపోయింది. లెక్కలుచూసే మేనేజర్ని అడిగితే తగువుపెట్టుకుని వెళ్ళిపోయాడు.

నంజనగూడు, చామరాజనగరాల్లో లాభమూలేదు, నష్టమూలేదు అన్న ధోరణిలో నాటకం నడిచింది. రావుగారి పేరుచూసి జనం వచ్చేవారుగాని, మిగతా నటులంతా సామాన్యమైనవారే. భారీ సెట్టింగులు దృశ్యాలు, వుండవు. అప్పటికే మరికొన్ని భారీ కంపెనీలు లంకాదహనం, కురుక్షేత్రం లాంటి ఘనమైన నాటకాలు ఆడుతుంటే అవిచూసి ఆనందించే జనాలకి గజేంద్ర కంపెనీ నాటకాలు అంతంగా రుచించేవికావు. కేవలం మోహనరావుగారి అభినయం, సంగీతం పెట్టుబడిగా తయారయిన నాటకాలవి. తనకి ప్రియమైన నాటకం 'శకుంతల' అయితే తన అభినయంతో, సంగీతంతో ప్రజల మనసుని చూరకొనచ్చు అనుకున్నారుకాని తనకి సరిసాటిగా వుండే శకుంతలనెక్కణ్నుంచి తెచ్చేది? గజానన కంపెనీలోని జానకి వచ్చే అవకాశం లేదు. మిగతా కంపెనీలన్నింటిలోను పురుషులే స్త్రీపాత్రలు ధరిస్తారు. కొత్తగా ఎవర్నైయినా వెతుక్కోడమూ కష్టమే. కొన్ని కంపెనీలు సామాజిక నాటకాల్ని ఆడసాగాయి. వాటికైతే భారీ సెట్టింగులు అక్కర్లేదు. సంగీతమూ తక్కువే. ఎందుకోగాని మొదట్నుంచీ పౌరాణిక నాటకాలని అంటిపెట్టుకున్న రావుగారికి సామాజికనాటకాలువెయ్యడం నచ్చలేదు. సంసారాన్ని, కొత్త కంపెనీని నిభాయించాలంటే అప్పులు చెయ్యక తప్పటంలేదు. ఈలోగా రావుగారు మళ్ళీ జబ్బుపడ్డారు. ఈసారి నెలరోజులు పడక వేశారు. కంపెనీలోనివారంతా తలోదారి పట్టారు. ఖర్చులు పెరగటంతో లక్ష్మి ఒంటిమీద నగలు కరిగాయి. రావుగారు కోలుకోగానే పాత అనుభవాలన్నీ మరచి కొత్త ఉత్సాహంతో కంపెనీని ప్రారంభించారు. ఈసారి ఆయన ఎన్నుకున్న నాటకం-శ్రీకృష్ణలీలలు. ఈనాటకాన్ని ఎవరు ఎక్కడ ఆడినా ఆబాలగోపాలం చూస్తారని ఆయన నమ్మకం. చిక్కమగళూరు, ఉడిపి, కుందాపురాల్లో నాటకం జయప్రదంగా జరిగింది. ఖర్చు, రాబడి అక్కడికక్కడ సరిపోయేవి. పైన లాభాలేమి దొరకలేదు. పాత అప్పులు తీరకుండా అలాగే వుండిపోవడంతో వడ్డీలు పెరిగిపోసాగాయి. రాబడిమాట ఎలావున్నా కృష్ణలీలల నాటకం రావుగారికి చాలా ప్రియమైనది. చిన్నికృష్ణుని పాత్రలో చంద్రమౌళి అనే ఏడుసంవత్సరాల బాబు అద్భుతంగా నటించేవాడు. అతన్ని చూస్తే ప్రేమ పొంగుకొచ్చేది. ఎప్పుడూ నాటకాలు, సంగీతం, అభినయం, స్వంతకంపెనీ— ఈ ధ్యాసలోనే మునిగి తేలే రావుగారిని, ఎక్కడో సన్నగా పిల్లల్లేరే అన్నబాధ వేధించేది. చంద్రమౌళితో నటించేటప్పుడు, మాట్లాడేటప్పుడు ఒక విధమైన తృప్తి లభించేదాయనకి.

కుందాపురం నుంచి వచ్చిన కొన్నిరోజులకి చంద్రహాస నాటకం సిద్ధంచేసుకుని మరో వూరికి వెళ్ళారు. నాటక ప్రదర్శన ఐదురోజులు జరిగిందో లేదో ఆరవరోజు వుదయం లక్ష్మి ఆరోగ్యం ఆందోళనకరంగా వుందని వూరి

నుంచి టెలిగ్రాం వచ్చింది. తరువాతి ప్రదర్శనలని రద్దుచేసి వెంటనే మైసూరు ప్రయాణమయ్యారాయన. ఆయన వచ్చేటప్పటికే లక్ష్మి మరణించి రెండుగంటల సేపయిందన్నారు.

ఆయన జీవితంలో ఎన్నో చీకటి సమయాల్లో వెలుగుని చూపించిన దీవకళిక ఆరిపోయింది. ఇక అయనకి ఉత్సాహము, డబ్బు రెండూ లేవు.

ఒకరోజు మధ్యాహ్నం భోంచేసి వాకిట్లో నడుంవాల్చారు. వీధిగుమ్మంలో ఏదో నీడ కదిలింది. "ఎవరు?" అని వడుకున్న చోటినుంచే అడిగారు.

"నేను స్వామీ, అప్పాజీని"

ఆ పేరువిని గబుక్కున లేచి కూర్చున్నారు. కోపం, ఉత్సాహం రెండూ ఒక్కసారిగా ముంచుకొచ్చాయి. అప్పాజీగారు లోవలికొచ్చి చెప్పించు కోకుండానే కూర్చున్నారు. ఇంటి మొత్తానికి ఒక్కరేవున్న రావుగార్ని చూసి ఆయన బాధపడ్డారు. ఇటీవలే భార్యని పోగొట్టుకొని ఒంటరి జీవితం గడుపుతున్నా,రావుగారు అంతగా కుంగినట్టు కనవడలేదు.

"అమ్మగారు దైవసన్నిధికి చేరారని విన్నాను."

రావుగారు మౌనం వహించారు.

"మీ ఆరోగ్యం బాగోలేదని విన్నాను, ఒకసారి చూసిపోదామని వచ్చాను" ఎప్పటిలాగే స్నేహంగా, వినయంగా అన్నారాయన.

రావుగారు బింకం విడవక తప్పలేదు.

"ఒంట్లో బాగోకపోడం ఏమిటి? చూస్తే తెలీడంలా?" అని అడిగారు రావుగారు.

"అయితే మళ్ళీ కంపెనీకి రావచ్చుకదా?" అన్నారు అప్పాజీగారు.

రావుగారికి అమాట వినగానే సంతోషం ఉప్పెనలా పొంగివచ్చింది. కాని దాన్నణచుకొని-

"ఇదివరకు మీకొక వుత్తరం రాశాను..." అన్నారు.

రావుగారు ఉత్తరం రాశారు. కాని అది అప్పాజీగారి చేతికందలేదు. అనారోగ్యం వల్ల రావుగారు వెళ్ళగానే ఆస్థానంలో కోదండరాముడనే నటుడు వచ్చి చేరాడు. అతడికి సంగీతజ్ఞానం లేదుగాని. బాగానే పాడేవాడు. కంపెనీలో అతనికో భజనబృందం తయారయింది. ఆ బృందంలోని ఒకడి చేతిలో వడింది ఆ ఉత్తరం. దాన్నతడు చింపిపారేశాడు. అప్పాజీగారికి ఈ సంగతి తెలియదు. రావుగారు మరోకంపెనీని ప్రారంభించిన విషయం తెలిసి అప్పాజీగారు రావుగారిమీద ఆశని వదులుకున్నారు. హీరో పాత్రల్లో నిలదొక్కుకున్న కోదండరామాన్ని అదుపులో ఉంచడం అప్పాజీగారి తరంకాలేదు. రేపునాటకం అనగా 'ఇంటినుంచి టెలిగ్రాం వచ్చింది వెళ్ళిపోతా' అంటాడు. పొరుగూరిలో క్యాంప్ చేస్తే ఆఖరిక్షణందాకా రాకుండా సతాయిస్తాడు. వూరికెళ్ళి 'ఒంట్లో బాగోలేదు, రానని' టెలిగ్రాం ఇస్తాడు. తనులేకపోతే కంపెనీకింక దిక్కే లేదన్నట్టుగా ప్రవర్తించడం, అన్నమానం డబ్బడగడం అతనికి పరిపాటి. చివరకి, నెలరోజుల క్రితం కంపెనీ సొమ్ము, నగలు కొంత దోచుకుని సుందరమ్మ అనే చెలికత్తె పాత్రధారిణితో లేచిపోయాడు. కంపెనీకి చెడ్డపేరొస్తుందనే భయంతో అప్పాజీగారు విషయాన్ని గోప్యంగా వుంచారు. కోదండ రాముడు వెళ్ళిపోయాక అతడి భజనబృందం వున్నమాట బయటపెట్టారు. రావుగారు వుత్తరం రాసిన సంగతి తెలియగానే తక్షణం బయల్దేరి వచ్చారు. అప్పాజీగారు. "చూశారా ఎంతపనయిపోయిందో" అని వాపోయారు.

"ఛ... ఛ పోన్లెండి, ఎందుకదంతా? బెంగుళూరికేగా వెళ్ళాల్సింది? మధ్యాహ్నం బయల్దేరుదామా?" అనడిగారు.

భార్య పోయిన దుఃఖంలోవున్నా మోహనరావుగారికి అవకాశాల్లేక తన ప్రతిభ వ్యర్థమవుతోందనే దిగులు కూడా వుంది. మళ్ళీ ఈ అవకాశం దొరకడం ఆయన దుఃఖాన్ని మరచి కొత్త ఉత్సాహాన్ని తెచ్చుకోడానికి సహాయవడింది.

బెంగుళూరు రాగానే 'కవిరత్న కాళిదాసు' నాటకం అభ్యసించడం మొదలయింది. కాళిదాసు పాత్ర ధరించే ఉత్సాహంలో రావుగారు పదేళ్ళు చిన్నవారయ్యారు. రావుగారి రాకతో కంపెనీలో కొత్త చైతన్యం వుంజుకుంది. కాళిదాను పాత్రని, కవిరత్నకాళిదాను నాటకాన్ని ప్రేక్షకులు బాగా ఆదరించారు. రావుగారి పాటలకి




'వన్స్‌మోర్' అరుపులు మామూలైపోయాయి. చూసినవాళ్ళే మళ్ళీమళ్ళీ నాటకాన్ని చూడ్డాని కి వచ్చేవారు.

లోగడ రావుగారు స్వంత కంపెనీపెట్టి నాట కాలాడించినా ఇక్కడున్న వైభవోపేతమైన సీన రీలు, సెట్టింగులు, కళాకారుల సహకారం, చక్కటిప్రచారం అక్కడవుండేవికావు. తా మెంత బాగా అభినయించినా నాటకం శోభించడానికివన్నీ ఎంతో అవసరం అన్న సంగతి ఆయనకి అర్థమయింది.

కాళిదాసు నాటకం నడుపుతూండిన కా లంలోనే సినిమాయుగం ఆరంభమయింది. అయినా కళ్ళెదురుగా కళాకారుల్ని చూడ్డంలో ను, ఇష్టమైన పాటల్ని మళ్ళీమళ్ళీ అడిగి పాడించుకోవడంలోనూ ప్రేక్షకులకి ఎక్కువ తృ ప్తి దొరికేది. 'కాళిదాసే' కాదు, 'రత్నావళి', 'విరాటపర్వం', శకుంతల.

నాటకాలు కూడా విజయవంతంగానే నడిచేవి. ఉత్తరకర్నాటక, మహారాష్ట్రలో కొన్ని ప్రాంతాల్లో ఈ నాటకాలు జయభేరి మ్రోగించాయి. ఐతేళ్ల పాటు గజానన కంపెనీ పాలిట సువర్ణకాలమ యింది. అప్పుడప్పుడు రావుగారికిచ్చే సంభా వనని పెంచేవారు. డబ్బువల్ల ఆయనకున్న విరక్తిని అప్పాజీగారెప్పుడూ స్వార్థానికి ఉపయో గించుకోలేదు. రావుగారి రాబడిని, ఉదారబు ద్ధిని ఎరిగినవారంతా ఆయన దగ్గర కొచ్చి ఏవేవో కష్టాలన్నీ వెళ్ళబోసుకునేవారు. ఆయన తన దగ్గరెంత సొమ్ముంటే అంత ఇచ్చి మరీ పంపేవారు.

ఒకసారి బళ్ళారి క్యాంపు పూర్తిచేసుకుని వచ్చాక ఆయనకి పూర్వం వచ్చినట్టుగానే చలి-జ్వరం ప్రారంభమయ్యాయి. 'తివటూరు' కి బయల్దేరిన కంపెనీ ఇక ప్రయాణాన్ని ఆపుకోవలసివస్తుందేమో అనుకుంటున్న పరి స్థితిలో ఎవరో "మురళీధరం అనే అబ్బాయికి రాజా పార్టు తాలూకు డైలాగులన్నీ బాగా వచ్చు, అతన్నే తీసికెళ్తే సరి" అని సూచించా రు.

ఆ మురళీధరం అప్పటికే చిన్నచిన్న పాత్ర ల్లో బాగా అనుభవం సంపాదించాడు. చూడ్డాని కి ఎర్రగా, పొడుగ్గా మంచిరూపంతో వుంటాడు. వచ్చిన అవకాశాన్ని వదులుకోకుండా చక్కగా అభినయించాడు.

రావుగారు ఈసారి మూడునెలలపాటు లేవ లేకపోయారు. సేవలు చేయడానికెవరూ లేక పోవడంతో నయమవడానికి చాలాకాలం పట్టింది. మొదటి శక్తిని పుంజుకోడానికి మరో రెండునెలలు పట్టింది. రావుగారు మళ్ళీ నటించడానికి ముందుకి రాగానే మురళీధరం తను తీసుకున్న చోటునుంచి తప్పుకున్నాడు. రావుగారికింకా కొద్దిగా నీరసంగా వుండటం వల్ల కంఠంలో పటుత్వం కాస్త తగ్గినట్టు అని పించినా పట్టుదలతో సంగతులు వేసి మరీ పాడేవారు. అప్పటికే సినిమా మోజు మరిగిన జనాలు సరిసరి, కూర్చుంటే పాట, నుంచుంటే పద్యం! ఎవడిక్కావాలి ఈ నాటకాలు అని తిరస్కరించే పరిస్థితికి వచ్చారు.

ఒకరోజు రావుగారు దుష్యంతుడి పాత్రలో నటిస్తుండగా ఒక అల్లరి గుంపు-

"ఏయ్ ముసలాడా, జుట్టు నెరిసినా దు ష్యంతుడి వేషమే కావల్సొచ్చిందా?" అని అరిచారు. ఆరోజు నాటకం సవ్యంగా జరిగినా ఆయన మనసు వికలమైపోయింది. రాత్రంతా అద్దం ముందు కూర్చుని 'నేను ముసలాణ్ణి యిపోయానా? దుష్యంతుడి వేషం వెయ్యడాని కి ఏ మొగాడొస్తాడో ముందుకి రమ్మనండి చూద్దాం' అని తనలోతను మాట్లాడుకుంటూ కూర్చున్నారు. స్టేజిమీదకొస్తే ఆయన తన వయసునే మర్చిపోయేవారు. కాని ప్రేక్షకులు మర్చిపోతారా? సినిమాలతో పోటీ పడాల్సిన పరిస్థితి రావడం ఒక ప్రక్క, ప్రజల అభిరుచికి తగినట్టుగా మార్పులు చెయ్యాల్సిన అవసరం రావడం మరోప్రక్క ఒత్తిడి చేయడంతో అప్పా జీగారు చాలా ఆలోచించిన మీదట మురళీధ రాన్నే తరువాత నాటకాలకి హీరోగా నియ మించారు.

"మీ మనసుకి నచ్చిన పాత్రలని నటిస్తూ మిగిలినవారికి నటనలో మెళకువల్ని బోధిస్తూ ఇక్కడేవుండండి" అంటూ వినయంగా రావు గారిని వేడుకొన్న అప్పాజీగారిని బాగా తిట్టి పోసి రావుగారు కంపెనీ బయటకి వచ్చేశారు.

పెన్షన్ రూపంలో కొంత ధనాన్ని ముట్టజెప్ప డానికి అప్పాజీగారు సిద్ధపడ్డా "నీ దయాధర్మ భిక్ష నాకవసరంలేదు" అని తిరస్కరించారు రావుగారు. ఒక సంవత్సరం అక్కడ ఇక్కడ

గడిపేసి చివరికి ఎటూగాని పరిస్థితిలో వద్ద రావుగారిని వారి అభిమాని రఘురాం ఇక్కడికి తీసుకొచ్చి చేర్పించాడు. ఇదీ రావుగారి కథ!

రావుగారు చెప్పిన విషయాలకి, తనకి తెలిసిన మరికొన్ని విషయాలను చేర్చి రావుగారి రంగస్థల జీవితాన్ని పత్రికకి పంపించాడు రఘురాం.

ఆయన కథ ప్రచురణ ప్రారంభంకాగానే ప్రతివారం ఆ పత్రిక కోసం కాచుక్కూర్చునేవారు ఆశ్రమవాసులు. యశోదే స్వయంగాఅందరికీ చదివి వినిపించేది. మోహనరావుగారు కూడా అందరితోపాటు కూర్చుని వినేవారు. అక్కడక్కడ చిన్నచిన్న తప్పుల్ని సరిదిద్దేవారు. "చూడండి అది జరిగింది బళ్ళారి క్యాంపులో కాదు, హుబ్లీ క్యాంపులో" అనో తిరుచునాపల్లి వారు 'సుభద్రా కల్యాణం'లోవి కాదు 'శకుంతల' పాటలు పాడించుకున్నారనో చెప్తుండేవారు.

యశోద ఓపిగ్గా, "పుస్తకరూపంలో వచ్చేటప్పుడు సరిదిద్దుదాంలెండి" అని చెప్పి ముందుకి చదువుకెళ్ళేది.



ఆశ్రమానికి మరికొందరు వచ్చి చేరుకోడంతో మొత్తం సంఖ్య పదిహేనుకి పెరిగింది.

ఈమధ్యకాలంలో రామన్నగారు ఆశ్రమంనుంచి వెళ్ళిపోయారు. ఆయన కొడుకు, అమెరికానుంచి వచ్చి పట్టుపట్టి తండ్రిని తన వెంట తీసుకెళ్ళాడు. రామన్నగారికి, కొడుకు అంత ప్రేమగా, తనని తీసుకువెళ్తున్నాడన్న సంతోషం ఒక పక్క, ఊరిని, దేశాన్ని అలవాటయిన చోటుని, జనాన్ని వదిలిపెట్టి పోవాలన్న చింత మరొకవక్క...

ఆయన వెళ్ళేరోజున ఆశ్రమంలో వీడ్కోలు విందుని ఏర్పాటుచేసింది యశోద. విందునిచ్చి 'రామాయణ' గ్రంథాన్ని కానుకగా ఆయనకిచ్చింది. ఆయన ప్రయాణంరోజునమిగిలిన వృద్ధులందర్నీ ఎర్‌పోర్ట్‌కి తీసుకెళ్ళే ఏర్పాటు చేశాడు జగన్నాథం.

రామన్నగారు అమెరికా వెళ్ళిన కొద్దినెలలకి, ఆయన కొడుకు ఆశ్రమం కోసం ఒక ప్రొజెక్టర్‌ని పంపించాడు. అంతేకాక తనతండ్రి పేరిట కొంతమొత్తానికి ఆశ్రమానికి కానుకగా పంపించాడు. ఇదొక అపురూపవిషయంగా అందరూ చెప్పుకున్నారు. పిల్లలుండీ లేనట్టుగా బ్రతకవల్సొచ్చిన నరసింహయ్యగారు, వెంకట్రావుగారు, రామన్నగారి కొడుకుని మాటిమాటికి తలచుకొని పొగిడేవారు. ఆశ్రమ భవనానికి కొత్తగా నాలుగు గదుల్నిచేర్చి కట్టారు.

హాల్లో చిన్న లైబ్రరి తయారయింది. కుడివేపు వసారాలో కేరమ్స్, చెస్ ఆడటానికి అనుకూలంగా ఏర్పాట్లుచేశారు. వారపత్రికలు, మాసపత్రికలు, వార్తాపత్రికలు వచ్చే ఏర్పాటు చేశారు. లైబ్రరీ తయారవడంతో ఆశ్రమవాసులు కానివారుకూడా సాయంత్రం కొద్దిసేపు అక్కడికివచ్చి కాసేపు కాలంగడిపి వెళ్ళేవారు. ఆశ్రమం యశోద అంచనాలకు, ఊహలకు మించి పెరిగిపోయింది. కొందరు వృద్ధులు పూర్తిగా గతిలేనివారొచ్చి చేరుతామని వేడుకుంటుంటే కాదనడానికి యశోదకి చాలా కష్టంగా వుండేది. అది అనాథాశ్రమంకాదని, అంతోఇంతో డబ్బుకట్టాల్సి వుంటుందని వివరించి చెప్పి, వారుమరేదయినా ధర్మసంస్థని చేరడానికి తనే సహాయపడేది.

ఆశ్రమం ఆవరణలో నాటిన పారిజాతం మొగ్గ తొడిగింది. నిమ్మచెట్టు గుబురుగా పెరిగిందిగాని పిందెవేసే సూచనలెక్కడా కనవడ్డంలేదు. వెనుకపెరటిలో ఉన్న పొట్లపాదు, సొరపాదు నేలని తాకేలాంటి కాయల్ని కాసింది. కాకరపాదు నిండుగా కాకరకాయలే. నిమ్మకాయల్తో కాకరకాయ ముక్కల్ని కలిపి నాగమ్మగారు వేసిన ఊరగాయని అందరూ చప్పరించుకుంటూ తిన్నారు.

ఆరోజు ఆదివారం. భర్త, పిల్లలు ఇంట్లోనే వుంటారని యశోద ఆశ్రమం వేపు వెళ్ళలేదు. భోజనాలయ్యాక మధ్యాహ్నం మంచం మీద






# ఆ నొప్పికి
# స్ట్రాంగ్ చికిత్స
# అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికీ అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు.

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థాములే మరింత శక్తివంతంగా సమ్మిళితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో. విపరీతమైన నొప్పులను, బాధలను త్వరితంగా వుపశమింప జేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్.

**అమృతాంజన్ స్ట్రాంగ్**




మిక్కిలి బాధాకరమైన నొప్పులకు

అమృతాంజన్ లిమిటెడ్ 

OBM 831 TG

విశ్రాంతిగా పడుకున్నాడు జగన్నాథం. వసంతా పూర్తిచేసుకొని గదిగుమ్మం దగ్గర నుంచి "నేనలా ఆశ్రమం వేపు వెళ్ళొస్తాను" అంది.

"ఆదివారంకూడా సెలవులేదా నీకు? ఇటురా" అని జగన్నాథం అనగానే- "ఏమిటి... ఒంట్లో బాగాలేదా ఏమిటి?" అని దగ్గరకొచ్చి అతడి నుదుటిమీద చెయ్యిపెట్టి చూసింది. ఆ చేతిని పట్టుకుని-

"అంతా బాగానేవుందిగాని, ఒక నిమిషం కూర్చో, చెప్తాను" అన్నాడు. మంచం అంచున కూర్చుంది యశోద.

"ఈసారి క్రిస్మస్ సెలవుల్లో ఒక పదిరోజుల పాటు ఎటైనా వెళ్ళివద్దాం. ప్రతాప్ ప్రతి శలవుల్లోనూ అడుగుతూనే వున్నాడు" అని చెప్పాడు జగన్నాథం.

"పది రోజులే..."

"నీ ఆలోచన నాకు తెలుసు. వాటన్నింటికీ ఏర్పాటుచేసే వెళ్లాం"

కొద్దిగా తలవంచుకుని మంచం అంచున కూర్చున్న భార్య ఎదిగిన ఇద్దరు పిల్లలతల్లిలా జొత్తిగా అనిపించలేదు జగన్నాథానికి.

"మరీ పూర్తిగా ఆశ్రమానికి అంకితమైపోకు యశూ. మాక్కూడా నువ్వు కావాలి" అన్నాడతడు. ఆ మధ్యాహ్నం ఆమె ఆశ్రమానికి వెళ్ళలేదు.

★ ★ ★

జగన్నాథం ఢిల్లీకి ప్రయాణం అని అనగానే "పదిరోజుల్లో అంతదూరమా!" అని అనుమానించింది. ప్రయాణంలో ఎక్కువరోజులు వేస్టవదు. కొద్దిగంటల ప్రయాణం అంతే అని చెప్పాడతడు. అక్కడ్నుంచి హరిద్వార్, హృషీకేశ్ కూడా వెళ్లొద్దాం అన్నాడు. వెంటనే ఒప్పుకుంది.

జగన్నాథం ఢిల్లీ వెళ్లడానికి మరొకకారణం కూడా వుంది. అతని బాల్యస్నేహితుడు సదాశివరావు చాలారోజులుగా "ఓసారి సంసారంతోసహా రావోయ్" అని పిలుస్తూనే వున్నాడు. సుప్రీంకోర్టు కేసులు చూడ్డానికి ఒకటి రెండుసార్లు జగన్నాథం ఒక్కడే వెళ్లాడు. అప్పుడు అతని మిత్రుడు, భార్యకూడా ఒత్తిడి చేశారు, ఈసారయినా భార్యాపిల్లల్ని తీసుకు రండి అని.

యశోద ప్రయాణం సంగతితెలిసి ఆశ్రమంలో చిన్నఅలలేచింది. నాగమ్మగారు "వెళ్ళి రండి... హరిద్వార్, ఋషికేశ్ నేనూ చూశాను బాగుంటాయి చాలా. కాశీ పుణ్యక్షేత్రం కాబట్టి వెళ్ళాల్సిందేననుకోండి, కాని మురికికూపం. గంగని చూడాలంటే హృషికేశ్‌లోనే చూడాలి" అంటుంటే-

వెంకటరావుగారు కంగారుపడుతూ "మరి నా కంటి ఆపరేషన్..." అని అంటుండగానే రాజరావుగారు-

"పదిహేనురోజుల్లో ఏం ఫరవాలేదులెండి. అయినా మేమంతాలేమా? మేం చూసుకుంటాంలెండి. పాపం లేకలేక వూరొదిలి వెళ్తున్నారు- వెళ్ళిరానీయండి" అన్నారు.

ఆ మాటలు విన్న యశోద 'తనయినా ఆశ్రమానికి ఇంతగా అతుక్కుపోకూడదు. తనులేకపోయినా అన్నీ యథాప్రకారం జరిగిపోయేలా ఉండాలి. ముందుముందు పిల్లలెక్కడెక్కడ వుద్యోగాలు చేస్తారో. నాలుగు రోజులువెళ్ళి చూసిరావాలంటే ఆలోచించే పరిస్థితి వుండకూడదు, అనుకుంది. జగన్నాథం సలహాప్రకారం ఆ సాయంత్రం చిన్నసభనేర్పరిచి రాజారావుని పర్యవేక్షకుడిగా నియమించింది. వంటింటి పర్యవేక్షణ నాగమ్మగారిది. జగన్నాథం స్నేహితుడు, వారికి ఇరవై సంవత్సరాలనుంచి ఫ్యామిలీ డాక్టరు అయిన డాక్టరు ప్రభు రోజూ ఆశ్రమానికి ఒకసారివచ్చి చూసివెళ్ళడానికి అంగీకరించారు. ఈ ఏర్పాట్లన్నీచేశాక యశోదకి నిశ్చింతగా అనిపించింది.

ఎలా వెళ్ళడం? అని ఆలోచిస్తుండిన యశోద ఇప్పుడింక వెళ్ళేరోజు ఎప్పుడొస్తుందా అని ఎదురుచూడటం మొదలెట్టింది.

అశోక్‌కి అక్కడిదాకా వెళ్తాంకదా, కాశ్మీర్ కూడా చూసొస్తే బాగుండేదికదా అనిపించినా అసలు తల్లి, తండ్రి ఇంత మాత్రం బయల్దేరారుకదా అని సంతోషపడ్డాడు. ప్రతాప్ అప్పటికే ఏర్పాట్లన్నీ చేసుకున్నాడు. కెమేరాకి ఫిల్మ్‌వేయించుకున్నాడు. ఉలెన్ బట్టలన్నీ సిద్ధంచేసుకున్నాడు. అందరిలోను కొత్తవుత్సాహం చోటుచేసుకుంది.

విమానప్రయాణం మొదటిసారి అయినా




యశోదకి పెద్దవిశేషమేమీకనిపించలేదు. రైల్లో వెళ్ళేటప్పుడు పరుగులెట్టే చెట్లు, చేమలు, చిన్నచిన్న జిలిబిలిపక్షులు, మారే ప్రకృతిదృశ్యాలు- అదొక అందం. ఇక్కడ పూర్తిగా మబ్బుల్లో ప్రయాణం.

జగన్నాథం స్నేహితుడు ఏర్‌పోర్టుకు వచ్చి రిసీవ్‌చేసుకున్నాడు. అతడి భార్య రేణుక సంతోషంగా స్వాగతం చెప్పింది.

అంత పెద్దనగరంలో, అందమైన ఎక్స్‌టెన్షన్‌లో అన్ని సౌకర్యాలతోకూడిన స్వంత ఇల్లు. ఆ పెద్దఇంట్లో భార్య-భర్త ఇద్దరే. కూతురు పెళ్ళయి కలకత్తా వెళ్ళిపోయింది. కొడుకు పిలానీలో ఇంజనీరింగ్ చదువుతున్నాడు.

అతిథి మర్యాద చేయడంలో అమితోత్సాహం చూపిస్తున్నదావిడ. చూడవలసిన స్థలాలన్నీ క్రమపద్ధతిలో ఎలాచూడాలో కార్యక్రమం రూపొందించేది. బయట తిరిగి వచ్చేవేళకి రుచికరమైన వంటలు, ఫలహారాలు సిద్ధంచేసేది. రకరకాల పులావ్‌లు, పుల్కా,సబ్జీ, తినుబండారాలు... ఆవిడ శ్రమపడ్డంచూసి యశోదకి మొహమాట'ంగా వుండేది. పిల్లలు మాత్రం అన్నీ ఆనందంగా సుష్టుగా తినేవారు. కొత్తరుచుల్ని ఆస్వాదించేవారు.

ఒకరోజు మధ్యాహ్నం కబుర్లలో రేణుక యశోదతో-

"ఏదో వృద్ధాశ్రమం మొదలెట్టావట? చాలా పెద్దపనే పెట్టుకున్నావే? చడీచప్పుడు లేకుండా నిజమైన సమాజసేవ చేస్తున్నావన్నమాట! నిజంగా చాలా సంతోషంగావుంది" అంది.

"బాబోయ్... సమాజసేవలాంటి పెద్దపెద్ద మాటలు ఉపయోగించేస్తున్నారేమిటి? ఏదో ఇంట్లో ఒకింత సౌకర్యం, ఆప్యాయత దొరకని వృద్ధులకి కొస్త ఆశ్రయం, ఆసరా అంతే. మరొకరికింద బాధపడుతున్నామనే న్యూనతా భావన లేనిచోటొకటి వారికి చూపించాలని మొదలుపెట్టానంతే. ఇరవైమంది వరకూ వున్నారు. ఇంకా కొందరు చేరతామని వస్తున్నారుగాని, అంతమందిని చూసుకోడం కష్టమవుతుందని చేర్చుకోలేదంతే"

"మునుపు వృద్ధాశ్రమాలకి చేరడం అంటే అవమానంగా భావించేవారు, ఇప్పుడు..."

"ఇప్పుడయినా మహామార్పులేం వచ్చెయ్యాలేదుగాని, తప్పనిసరి పరిస్థితులయితే జనం తమంతటతామే వచ్చి చేరుతున్నారు"

"అయినా వయసుమళ్లిన తల్లిదండ్రుల్ని చూసుకోవడం తమ కర్తవ్యం అన్న సంగతి పిల్లలు మర్చిపోతే ఎలా? మా అత్తగారినే తీసుకో. నలుగురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు, తల్లి తమ దగ్గరే వుండాలని ప్రతివాళ్లూ గొడవే. ఎవరికీ అసంతృప్తి కాకూడదనీ అందరిళ్లకీ వెళ్ళివస్తారావిడ. చాలా మంచి మనిషి ఆమె" అంది రేణు.

"అలాగయితే సమస్యేలేదు. అందరిళ్లల్లోను అలా కుదరదు కూడా. ఆర్థికసమస్యలు, పాతసంప్రదాయాలని లక్ష్యపెట్టని పిల్లలు, వాటినే అంటిపెట్టుకుని వుండే పెద్దలు మా కాలంలో అలా చేసేవాళ్లం, ఇలా చేసేవాళ్లమని చెబుతూ, ఇప్పుడూ అలాగే పండగలు, పబ్బాలు జరిపితీరాలని పట్టుపడతారు. పిల్లలు వారికిష్టమైన బట్టలు కట్టుకున్నా ఏదోనస, ఆక్షేపణలు... ఇలా వుంటుంది కొందరి వరస"

"అదీ నిజమే, మా చెల్లెలి అత్తగారంతే కట్టెల పొయ్యిమీదే వండాలంటుంది. కూర్చున్నా తప్పే, నుంచున్నా తప్పే, ప్రాణాలు తోడేస్తుందట. అలా హింసపెట్టినా ఆవిడని ఎక్కడికని పంపిస్తారు పాపం!"

"అలా అనుకునేవాళ్లూ అరుదే. అయినా వృద్ధాప్యంలో పిల్లలకి మనం భారం కాకుండా మన మానాన మనం వుంటేనే మంచిది. మా ఆశ్రమంలో పరమశివ అయ్యార్ అని రిటైర్డ్ జడ్జి ఒకాయనున్నారు... అని మొదలెట్టింది యశోద, రేణుక కుతూహలంగా వినసాగింది.

"పరమశివ అయ్యార్‌గారికి నలుగురు మగపిల్లలు. అంతా మంచి ఉద్యోగాల్లో వున్నారు. ఆడపిల్లలిద్దర్ని బాగా కలిగిన ఇళ్లల్లోనే ఇచ్చి పెళ్లిళ్లు చేశారు. అయినా పిల్లలందరికీ తండ్రి ఆస్తిమీదే కన్ను. వాటాలు పంచెయ్యమని ఒకటే గొడవ. ఆస్తి పంచేసి నువ్వెక్కడివి మాలో ఎవరిదగ్గరున్నా గడిచిపోతుంది అన్నారట... సరే ఆస్తి భాగాలయింది. ఎవరివాటావాళ్లు తీసుకుని బయల్దేరారుగాని, తండ్రిని రమ్మన్నమాట ఒక్కరి నోటివెంటయినా రాలేదు. వాటాలు పంచే ప్రయత్నంలో ఇల్లు కూడా అమ్మేశారు. ఇంక నెలరోజుల్లో ఇల్లు ఖాళీ

చెయ్యాలంటే మరో ఇల్లు వెతుక్కుంటూ బయల్దేరిన ఆయనకి 'వానప్రస్థం' గురించి తెలిసింది. వచ్చి చూస్తే పరిచితుడయిన నరసింహయ్యే పలుకరించారు. ఆశ్రమం వివరాలన్ని తెలుసుకున్న అయ్యర్‌గారు సంతోషంగా-

"నేనూ వచ్చి ఇక్కడే చేరిపోతానయ్యా" అన్నారు. వారం రోజుల్లో చేరనూ చేరారు. ఆయనతోపాటే వచ్చిన అల్సేషియన్ బహద్దూర్‌ని చేర్చుకోడానికి కొంచం ఆలోచించాల్సి వచ్చింది. "వీడూ నాలాగే ముసలివాడు. ఎవరినీ ఏమీ చెయ్యడు. ఇంకెక్కడికయినా పంపుదామా అంటే నన్నొదిలి వుండలేడు" అని బతిమాలాడు. బహద్దూర్ని చేర్చుకోక తప్పలే



దు. మిగిలినవారికి కొంచెం చికాగ్గానే అనిపించింది. కాని అది ఒకటి రెండురోజులు మాత్రమే.

అయ్యర్ 'బహద్దూర్ని' చాలా చక్కగా ట్రెయిన్ చేశారు. అది వంటింటివేపు, దేవుడి గదివేపు వెళ్ళేదికాదు. ఆశ్రమవాసులందరితోనూ చాలా త్వరగా స్నేహం పెంచుకొంది.



మొదట్లో బహద్దూర్ని చూస్తే చాలు. మొహం చిట్లించుకునే నాగమ్మగారు కూడా భోజనానికి ముందు దానికొక ముద్దవేసి వచ్చిగాని కూర్చొనేవారుకారు. మూడు నాలుగువారాల్లో బహద్దూరు అక్కడ ఎన్నో ఏళ్లనుంచి వున్న ప్రాణిలా అలవాటు అయిపోయింది. అందరికీ బహద్దూరంటే ప్రాణం. బయటివారిని ఆశ్రమంలో అడుగుపెట్టనిచ్చేదికాదు. పొద్దున్నే అయ్యర్‌గారితో వాక్‌కి వెళ్లిపోయేది. ఆయన చుట్టువక్కలే తిరుగుతూ మధ్యాహ్నం ఆయన ఈజ్‌ఛైర్‌లో పడుకుని నిద్రపోతే తనూ ఆ కుర్చీకిందే పడుకునేది.

అయ్యర్‌గారు ఆశ్రమంలోవున్నదొక్క యేడాది అంతే, గుండెపోటుతో ఆయన మరణించినప్పుడు ఈ విషయాన్ని ఆయన పిల్లలకి రాసినా ఒక్కరూ తొంగిచూడలేదు. అయ్యర్‌గారు తన వాటా ఆస్తిని ఆశ్రమానికి రాసిన విషయం ఆ పిల్లలకి ముందే తెలుసు. ఆయన పోయినరోజున బహద్దూర్ ఆహారాన్ని ముట్టుకోలేదు. నాగమ్మ ఎంత ప్రేమగా బతిమాలినా లొంగలేదు. ఆయన పడుకుంటూ వుండిన ఈజ్‌ఛైర్ దగ్గరే ఎప్పుడూ పడుండేది. యశోద, జగన్నాథం, డాక్టరు చేసిన ప్రయత్నాలేమీ సఫలం కాలేదు. అయ్యర్‌గారు పోయిన ఎనిమిదోరోజున బహద్దూర్ కూడా ప్రాణం విడిచింది.

కన్నపిల్లలు తండ్రిపోతే చూడ్డానికయినా రాలేదు. పెంచుకున్న కుక్క ఆయనకోసం ప్రాణాలు వదిలేసింది. ఎన్నో రోజులవరకూ అందరూ బహద్దూర్‌గురించే తల్చుకుని మాట్లాడుకునే వారు'' అంటూ చెప్పింది యశోద.

"పాపం... పెంపుడుకుక్కకున్నపాటి విశ్వాసం, అభిమానం పిల్లలకి లేకపోయింది. డబ్బే ముఖ్యమయిపోతే ప్రేమాభిమానాలు చచ్చిపోతాయి. పిల్లలు పిల్లలని తపన పడతాం. వార్ధక్యంలో చూసుకునే అదృష్టం లేకపోయాక ఆ పిల్లలుండి ఏంలాభం శుద్ధ దండగ'' అంది రేణుక.

★ ★ ★

అపురూపంగా వచ్చిన అతిథులకి సదాశివరావు ముఖ్యమైన చోట్లన్నీ స్వయంగా కార్లో తీసుకెళ్ళి చూపించాడు. కుతుబ్‌మినార్, ఎర్రకోట, తీన్‌మూర్తి భవన్, రాజఘాట్, శాంతివనం, చేతివనుల ప్రదర్శనశాల అన్నింటినీ చూపించాడు.

విశాలమైన నగరం, గంభీరమైన ఆకారం, విశాలమైన వీధులు, సుందర భవనాలు! ఇంత పెద్ద నగరమైనాఇతర నగరాల్లో వుండే గజిబిజి, గందరగోళం ఇక్కడ కనిపించదు.

' ఢిల్లీ చూడటం అయ్యేటప్పటికి-యశోద హరిద్వార్, హృషీకేశ్ ప్రయాణం ఎప్పుడెప్పుడా అని ఆతృతగా ఎదురు చూడసాగింది. రేణుక సదాశివరావు ఆ చోట్లనెన్నోసార్లు చూసి వుండటంవల్ల వారు వెళ్ళకుండా జగన్నాథం, కుటుంబాన్ని మాత్రం బాగా తెలిసిన డ్రైవర్‌నిచ్చి కార్లో పంపించారు.

పొద్దుటే ఐదుగంటల వేళప్పుడు మంచి చలిలో కారు బయల్దేరింది. వెళ్తుంటే మ్యాపుల్లో మాత్రం తెలిసిన కొన్ని వూళ్ళని చూస్తూంటే విచిత్రానుభూతి కలిగింది. నాజూకైన వచ్చటి చెట్లపై వసుపు చల్లినట్టుగా పరుచుకున్న ఆవపూల అందం అపురూప దృశ్యంలా భాసించింది. మైళ్ళకొద్దీ విస్తరించిన చెరకుతోటలు, అక్కడక్కడ ఒక్కోకార్ఖానా-అన్నీ చూస్తూ వ్యాఖ్యానాలు చేసుకుంటూ వెళ్ళారు.

ప్రయాణం సుఖంగా సాగింది.

"సర్ మొదట హృషీకేష్ వెళ్లొచ్చేద్దాం..." అన్నాడు డ్రైవర్. సరేనన్నాడు జగన్నాథం.

హృషీకేష్ చేరుకున్నారు.

కారుని నీడలోకి ఆపి చెప్పాడు డ్రైవర్-"అన్నీచూసి మీరు ఆ ఒడ్డుకి రండి. అక్కణ్నుంచి నావలో దాటిస్తారు'' అక్కడక్కడ నెలకొన్న యోగాశ్రమాలు, చిన్నచిన్న దేవాలయాలు, నిర్మలంగా ప్రవహించే గంగని తృప్తిగా చూసింది యశోద. లక్ష్మణఝూలాగురించి వినడం, ఫొటోలో చూడటం ఒకరకం. దాని మీద నడిచే అద్భుతమైన అనుభవం మరో రకం.

"అమ్మా ఇటుచూడు..." అంటూ అశోక్ అటొక్క అడుగు వేసేసరికి ఒక్కసారిగా వంతెన తూగింది.

"ఊరికే, అలా ఎగరకు మెల్లగా నడు" అని మెల్లగా విసుక్కుంది. యశోద భయం

చూసి జగన్నాథం, పిల్లలు నవ్వారు.

వంతెనమధ్యకి వెళ్ళేసరికి కోతుల కుటుంబం ఒకటి వరుగెత్తుకు వచ్చింది. 'హుశ్ హుశ్' అనే జనాలవట్ల వాటికి లక్ష్యమే లేదు. తనమీదకి దూకబోయినట్టు వచ్చిన కోతిని చూసి యశోద బెదిరిపోయి జగన్నాథం నందిట చేరింది. యశోద చుట్టూ చెయ్యివేసి దగ్గరకి తీసుకుని "ఎందుకలా బెదిరిపో తావు? మేమంతా లేమా?" అని నవ్వాడు. యశోద మొహాన్ని ఎర్రగా చేసుకుని దూరంగా జరిగింది. అంతలోవల అశోక్ కెమేరాను క్లిక్ మనిపించాడు. ప్రతాప్ కోతిని తరిమేశాడు.

వంతెననిదాటి చిన్నదోవంట బయల్దేరారు. అడుగడుక్కీ దేవాలయాలు, పాలరాతి విగ్రహా లు, గడ్డాలు పెంచుకున్న సన్యాసులు అక్కడ క్కడ ఎదురవుతూనే వున్నారు. ఆ సన్యాసుల్ని చూస్తే 'ఏ సంసారాల్ని నట్టేట ముంచేసి వచ్చారో' అనిపించిందేతప్ప తపస్యులనే భక్తి గౌరవాలు ఏకోశానా కలుగలేదు యశోదకి.

నిండుగా ప్రవహించే గంగాతీరం వెంట నడిచి నావ నిలిచినచోటికి వచ్చారు. డబ్బేమీ తీసుకోకుండా యాత్రికుల్ని ఉచితంగా నది దాటించడం నిజంగా విశేషమే. దూరంగా దర్శనమిచ్చే వచ్చటికొండలు మధ్య చిన్నచిన్న గోపురాలు, ఆశ్రమాలు, అదొక అపూర్వదృశ్యం. కొన్ని నిమిషాలకి రెండవ వడ్డుకి చేరారు. అక్కడి దృశ్యాల్ని రకరకాల కోణాల్నుంచి ఫొటో లు తీసాడు ప్రతాప్.

దారిలో సవ్తర్షిధామాన్ని చూసి హరిద్వారాని కి చేరారు. ఆడ, మగ, చిన్న పెద్ద అనే తేడా లేకుండా గంగలో మునకేస్తున్న జనాన్నిచూసి యశోదకీ స్నానం చెయ్యాలనిపించింది. జగ న్నాథాన్నడిగితే "నీ ఇష్టం, చేస్తే చెయ్యి" అన్నాడు.

జనం ఎక్కువలేనిచోటు చూసుకువెళ్లింది యశోద. అక్కడ ఊరికే గంగ వంక చూస్తూ కూర్చున్నదొక స్త్రీ. తనూ వక్కనే కూర్చుంది. కొద్దిగా ఎండవున్నా చలి వణికిస్తోంది. యశోద నీళ్లల్లో చేతి నాడించింది. నీళ్ళు ఝల్లనిపించే టంత చల్లగా ఉన్నాయి. ఎప్పుడూ చన్నీళ్లతో స్నానం చేసిన అలవాటులేదు. చుట్టూ ఎంత లేదన్నా ఇరవై, ముప్పైమంది జనం ఉన్నారు. మొహమాటంగా అనిపించింది. మూడు దోసి ళ్ళ నీళ్ళు తీసుకుని నెత్తిన పోసుకుని లేచి నుంచుంది.

ఆ ఒంటరిస్త్రీ ఇంకా అలాగే కూర్చుంది. అటు జగన్నాథం 'అయిందా గంగాస్నానం?' అని అడుగుతున్నాడు. అతన్తోపాటు తనూ నవ్వుతూ, "అయింది, కావాలంటే తలముట్టు కుని చూడండి" అంది. అక్కడినుంచి వెళ్ళి రకరకాల దేవాలయాలు చూశారు.

మళ్ళీ వెనక్కొచ్చేసరికి ఆ స్త్రీ ఇంకా అక్కడే ఉంది. దూరంనుంచి మరొకామె "ఇక్కడికే రండి భాగీరథమ్మగారూ! ఒక్కరే అక్కడుండి పోయారేమిటి?" అని పిలిచింది.

ఆమె- "వస్తాను- మీరు వదండి" అంది సైగలతో.

చూస్తే తమ ప్రాంతం మనిషిలాగే ఉంది. అప్పుడప్పుడు కళ్ళు తుడుచుకుంటోంది.

"ఎందుకమ్మా ఒక్కరే కూర్చున్నారు?" అని అడిగింది యశోద. ఆమె మాట్లాడలేదు.

"ఏఊరు మీది?"

ఆమె నిట్టూర్చి "ఏదో ఒక ఊరులేమ్మా" అన్నది.

ఆవిడ ఒంటరిదని, చాలా దుఃఖంలో ఉందనీ తెలుస్తూనే ఉంది.

"మాతోపాటువస్తారా?" అనడిగింది యశోద.

అప్పుడావిడ భళ్ళున ఏడవసాగింది, యశోద ఆమె వక్కన కూర్చుంది.

"మీ దుఃఖం, కష్టం ఏమిటో నాకు తెలియ దు కాని ఒక్కమాట, ఎంత దుఃఖంలోనయినా ధైర్యం తెచ్చుకోవాలి. మనకంటే హీనమైన స్థితిలో ఉన్నవాళ్లనిచూసి రాజీవడటం అలవా టు చేసుకోవాలి. ఆ మెట్లమీద చూడలేదా? ఎంతమంది కుష్ఠురోగులున్నారు? వాళ్ళందరి కీ ఎవరున్నారని? వాళ్ళకేం ఆశవుందని అలా బతకడానికి తావత్రయవడుతున్నారు?" అని యశోద అడిగేసరికి తను గంగలో మునగాల నుకున్న విషయం ఈమెకెలా తెలిసిందా అని కంగారు వడిందావిడ.

యశోద ఆవిడకి ధైర్యాన్నిస్తున్నట్టుగా స్నే

హంగా నవ్వింది. "మీరు మా ఊరొస్తే తప్పకుండా మా ఇంటికి రండని" తన చిరునామా ఉన్న కార్డు అందించింది. తన వృద్ధాశ్రమాన్ని గురించి చెప్పినప్పుడు ఆవిడ కళ్ళల్లో వెలిగిన వెలుగు యశోద దృష్టిని దాటిపోలేదు.

"ఏమ్మా ఇక్కడ కూడా మొదలు పెట్టావా నీ సోషల్‌వర్క్?" అని అడిగాడు అశోక్ తిరిగి వచ్చిన యశోదని.

ఆరోజే ఢిల్లీకి తిరిగి వచ్చారు. సదాశివరావు గారు ఒకరోజు సెలవు పెట్టి ఆగ్రా, ఫతేపూర్ సిక్రి చూపించి తీసుకొచ్చారు.

యశోదకి తప్పనిసరిగా అవసరమైన 'మార్పు' దొరికింది. ఆ పదిరోజులు చాలా సంతోషంగా గడిచిపోయాయి. సదాశివరావు దంపతులు నిండైన ఆతిధ్యాన్నిచ్చి మరీ ఊరికి పంపించారు. గడచిన రోజులన్నీ నెమరువేసుకుంటూ విమానం ఎక్కింది యశోద.

★ ★ ★

సాయంత్రం ఊరికి వచ్చిన యశోద మర్నాడు ఉదయమే ఆశ్రమానికి బయల్దేరింది. ఆవిడ వస్తుండటాన్ని అల్లంత దూరంలో ఉండగానే గమనించిన రాజారావు ఒక్కక్షణంకూడా ఆలస్యం చేయకుండా ఆ వార్తని అందరికీ చేరవేశారు.

పేపరు చదువుతున్న నరసింహయ్యగారు దాన్నక్కడే వదేసి వచ్చారు. పూజకి పూలుకోస్తున్న నాగమ్మగారు బుట్టనక్కడే పెట్టేసి పరుగున వచ్చారు. స్నానానికి బయల్దేరుదామని టవల్ చుట్టుకున్న వెంకట్రావుగారు ఆ వేషంలోనే బయటకొచ్చేశారు. వీధి వాకిటలోనే అంతా గుంపుకట్టి నుంచోడం చూసింది యశోద. వాళ్ళ ప్రేమపూర్వక స్వాగతం ఆమె కన్నుల్లో తడిని నింపింది.

వాళ్ళకోసం తెచ్చిన పళ్ళబుట్టని రాజారావు గారి చేతికి అందించింది. "బాగున్నారా అందరూ?" అనడిగింది.

ఒకరిద్దరు తమ కష్టసుఖాలని చెప్పుకోడానికి ఉత్సాహపడుతుంటే రాజారావు ఆపేసి- "అంతా బాగున్నాం, మీ ప్రయాణం బాగా జరిగిందా? అంతా క్షేమంగా తిరిగి వచ్చారా?" అని అడిగారు.

అందరికీ సంతృప్తి కలిగేలా యశోద ఒక్కక్కరినీ విడివిడిగా పలకరించి యోగక్షేమాలు కనుక్కుంది.

ఆ గుంపులో కొత్తాయన ఒకరున్నారు. యశోదతెచ్చిన బుట్టలోంచి ఒక యాపిల్ చేతిలోకి తీసుకుని, "నామూడవకొడుకు ఢిల్లీలోనేవున్నాడు. మూడునెలలకొకసారి తప్పనిసరిగా ఒక బుట్టెడు పళ్ళు పంపిస్తూంటాడు" అన్నారు.

రాజారావ్ యశోదతో "మీరు లేనప్పుడు వీరొక్కర్నిమాత్రం చేర్చుకోక తప్పలేదు. మరో ముగ్గురొస్తే వాళ్ళనిమాత్రం మీరొచ్చాక మళ్ళీకనిపించండని పంపించేశాం" అన్నారు.

కొత్తసభ్యుడు సుబ్బారావు గారు "చూడమ్మా... నాకు పన్నెండుమంది పిల్లలు" అని మొదలెట్టారు. అయినా ఇక్కడుండాల్సిన పరిస్థితి వచ్చిందా అని బాధపడింది యశోద.

"పెద్దవాడు మిలిటరీ ఆఫీసర్, కెప్టెన్ మహేష్. రెండవది మాలతి. ఐ.ఎ.ఎస్ ఆఫీసర్‌ని పెళ్ళాడింది. మూడవ వాడు అదే ఢిల్లీ నుంచి పళ్లబుట్ట పంపిస్తుంటాడే వాడు, పెద్ద కంపెనీలో ఒకదానికి డైరెక్టర్..." ఇలా పన్నెండుమంది పిల్లల వివరాలన్నీ చెప్పాడాయన. "అందరూ నా దగ్గర వుండు, అంటే నాదగ్గరకొచ్చి వుండు అని ఒకటే గొడవ చేస్తారు. కాని, నేనే 'ఎవరిజోలీ నాకొద్దు బాబూ' అని ఇక్కడికొచ్చేశాను" అన్నారు.

'చిత్రంగావుందే' అనుకుని "పోన్లెండి... మీ పన్నెండుమందీ పిల్లల్తోబాటు నేను పదమూడో దాన్ననుకుని ఇక్కడే వుండిపోండి" అంది యశోద.

రాజారావుగారు లోపల ఆఫీసుగదిలోకి తీసుకెళ్ళి రిజిస్టర్ని చూపించి- "అమ్మా ఆయనకి పిల్లలే లేరట. ఆయన తమ్ముడొచ్చి ఇక్కడ చేర్పించి వెళ్ళాడు" అని చెప్పారు.

ఆశ్చర్యపోయింది యశోద. "ఎంత వివరంగా ఒక్కొక్కరిపేరు, ఉద్యోగం అన్నీ చెప్పారు?! ఎలా వుండాలని కోరికగావుంటుందో అలాంటి వూహల్లో, నమ్మకాల్లో జీవిస్తున్నారన్నమాట..."

"మిగతా అంతా నార్మల్‌గానేవుంది" అన్నారాయన.

మోహనరావుగారు విశేషాలన్నీ అడిగితెలుసుకొని 'శకుంతల, కాళిదాసు నాటకాలని ఢిల్లీలోకూడా ఒకసారి ఆడితే బాగుండేది' అన్నారు.





ఆమె లేనప్పుడు జరిగిన విశేషాలన్నీ అందరూ చెప్పారు.

ఇంటికి వచ్చి జగన్నాథంతో-

"ఒక తల్లిదండ్రులకెందరో పిల్లలుండవచ్చుగాని ఒక్క కూతురుకి ఇంతమంది తల్లి దండ్రులుండటం నిజంగా నావిషయంలో జరిగిన చిత్రం కదూ!" అంది.

"అంతమంది తల్లిదండ్రులమధ్య ఈ పేద భర్తని మర్చిపోకునుమా" అన్నాడు జగన్నాథం.

యశోద నవ్వింది.

★ ★ ★

అశోక్ ఢిల్లీ ట్రిప్ ఫొటోలు తీసుకొచ్చాడు. "ప్రతాప్ తీసిన ఫొటోలేవీ సరిగ్గా రాలేదమ్మా" అంటూ ఐదారు ఫొటోలని చూపించాడు. కొన్నింటిల్లో మనుమలు నలుసుల్లా వున్నారు. కొన్నింటిలో మరీ దగ్గరగా అతుక్కుపోయినట్టున్నాయి. అశోక్ తీసినవన్నీ బాగా వచ్చాయి. ఫొటోలుచూస్తూ మళ్ళీ ప్రయాణంలోని అనుభూతులన్నింటినీ నెమరువేసుకున్నారు.

చివరికి ఒక ఫొటో తీసి "ఇది ఈ ఫొటోలన్నింటిలోను చాలాబాగుందనిపించి ఎన్‌లార్జ్ చేయించా"నన్నాడు. చూస్తే అది లక్ష్మణ్ ఝూలా మీద కోతి తరుముకొచ్చినప్పటి చిత్రం.

"ఓ... లవ్లీ!" అని అందుకున్నాడు జగన్నాథం.

యశోద ముఖం ఎర్రగా అయింది.

"పెద్దవాడయినా తుంటరితనం వదల్లేదు. చిన్నప్పుడు ఒకరకం, ఇప్పుడొకరకం!" అని తల్లి అంటుంటే అశోక్ గట్టిగా నవ్వేసి అక్కణ్నించి బయటికివెళ్ళిపోయాడు.

"అల్లరి పిల్లాడు. ఒక్కోసారి ఈ పిల్లలు పిల్లలుగానే వుండిపోతే ఎంతబాగుండునని పిస్తుంది. ఇప్పుడు వాడు చిన్నపిల్లాడయి వుంటే దగ్గరకి లాక్కుని ముద్దులతో నింపేసివుండేదాన్ని"

"ఎందుకు... అంత చక్కటి ఫొటో తీసినందుకా?"

యశోద ఆమాటని వినిపించుకోనట్టుగా- "పెద్దవాళ్లుఎలాగూ అవుతారు. చివరివరకూ ఇలాగే ప్రేమగావుంటే చాలు బాబూ అనిపిస్తుంది" అంది.

"మనం కూడా మరీ పొసెసివ్‌గా వుండకూడదు. వాళ్ళ ప్రేమాభిమానాలు నిలువుకోవాలంటే మనం ఎలావుంటామనేది ముఖ్యం. అయినా నీకు నేను చెప్పాలా ఏమిటి?"

"ఎన్నో సంసారాల్లో తల్లిదండ్రులు సవ్యంగావున్నా పిల్లలు వక్రమార్గం పడతారు. పక్కింటి శ్రీదేవి బంధువుని చూశారుగా..."

"ఎవరు మృత్యుంజయ శాస్త్రిగారా?"

"అవును... ఆయన కథవింటేనే ఎంతోబాధగావుంటుంది..." అంది యశోద.



పిల్లవాడికి పెద్దవాళ్ళు పెట్టినపేరు మృత్యుంజయశాస్త్రి. ఆ తరువాత నాలుగురోజులకల్లా ఆ కుర్రవాడి తల్లే మృత్యువుపాలౌతుందని ఎవరూ అనుకోలేదు. 'బాలెంతవాతం' అన్నారు. తల్లిని పోగొట్టుకున్న పిల్లవాడు బామ్మ చేతుల్లో పెరగాల్సివచ్చింది. మాటలొచ్చాక బామ్మనే అమ్మ అని పిలిచాడా కుర్రవాడు. తప్పటడుగులువేస్తూ ఇల్లంతా తిరుగుతుంటే పిల్లవాణ్ణి పట్టుకోవడం కష్టమయ్యేదావిడకి. వయసుకి సహజమైన బలహీనత, బంగారంలాంటి కోడలు పిల్లవాణ్ణి దిక్కులేని వాడిగా చేసి పోయిందే అన్న చింత, రెండూ కలసి ఆవిణ్ణి శక్తిహీనురాలిగా చేశాయి. ఒక రోజు కొడుకు తమ్మయ్యకి పెరుగు వడ్డిస్తూ-

"నాయనా నాకూ వయసుపైనబడుతోంది. పిల్లవాడు పెద్దవాడవుతున్నాడు. ముసల్దాన్ని ఎన్నాళ్ళు బతుకుతాను చెప్పు..." అంటూ మొదలు పెట్టింది.

ఈ మాటలెపట్నుంచో చెప్తున్నవే అయినా ఇవాళ ఇంకొంచెం పొడిగింపబడ్డాయి. "నరనయ్యగారు తన కూతుర్ని చేసుకోమని నాలుగు సార్లు అడిగివెళ్ళారు. నువ్వు 'ఊఁ' అంటే రేపే కన్యాదానం చేస్తారు. ఇంటికొక ఆడదిక్కు వుండాలినాయనా. అమావాస్య వెళ్ళాకవస్తానన్నారు. ఈసారి ఆయనొచ్చినప్పుడు నువ్వే ఇంట్లోవుండి నీ అభిప్రాయం చెప్తే బాగుంటుంది" అంది.

కొడుకు మౌనంగా వుండిపోయాడు. అంటే ముసలమ్మకి సగం అంగీకారం దొరికినట్టే. చిన్నవయసు, 'భార్యపోయి మూడేళ్ళుగడిచింది. ఇంకా ఇలాగే వుండిపోడానికి అతడేమన్నా సన్యాసా?' అనుకుంది తల్లి.

ఎనిమిదిమంది ఆడపిల్లలతండ్రి అయిన నరనయ్యగారి మూడవకూతురు గిరిజ తమ్మయ్య రెండవ భార్యగా, ఆ ఇంటికి వచ్చింది. అప్పటికి ఆమెకి పదిహేడేళ్ళవయసు.

నరనయ్యగారు, "ఇంటిపనంతా బాగా వచ్చు, పిల్లాడిని బాగా చూసుకోవాలని చెప్పాను. ఒప్పుకుంది" అన్నారు.

ఆ పిల్ల ఇంటిపనులు అంతోఇంతో చేస్తున్నదిగాని, పిల్లవాడి విషయంలో మాత్రం నిరాసక్తిగా వుండిపోయింది. పిల్లవాడు ఎప్పటిలాగే బామ్మవెంటే తిరిగేవాడు. వాడేమన్నా తినడానికి అడిగితే "పిన్నినడుగు ఇస్తుంది" అనేదావిడ. ఇలాగైనా పిల్లవాణ్ణి పిన తల్లికి అలవాటు చేద్దామని ఆవిడ ఉద్దేశం.

వాడేమో, "ఊఁ... నువ్వే ఇయ్యి" అని గారంపోయేవాడు.

"ఇలాగయితే ఎలారాబుజ్జీ" అని నడుంపట్టుకుని తనే కష్టపడి లేచి వెళ్ళేదావిడ.

'గిరిజయినా కాస్త పిల్లాణ్ణి దగ్గరకి తీయకూడదా? చుట్టుపక్కలవాళ్ళంతా వాణ్ణెత్తుకుని ఆడిస్తారు. గిరిజకి ఎత్తుకోవాలని అనిపించదా?' అనుకునేది బామ్మగారు. కొడుక్కి రెండోపెళ్ళి చేద్దామని అనుకున్నప్పుడు కొడుక్కి భార్యే కాకుండా, బుజ్జిగాడికి తల్లికూడా దొరుకుతుందని నమ్ముకుందావిడ. కొడుకు ఆనందంగానే వున్నాడుగాని బుజ్జిగాడుమాత్రం తన వెంటన్నా వుంటాడు, లేదా ఇరుగు పొరుగు ఇళ్ళల్లో కాలక్షేపంచేస్తాడు. ఒకరోజు బామ్మగారు అనారోగ్యంతో పడుకున్నారు. కుర్రవాడు తనపక్కనే దిగులుగా కూర్చోడంచూసి, గిరిజని పిలిచి,





"నేనిలా వున్నానని బెంగెట్టుకున్నట్టున్నాడు. కొంచెం వాణ్ణి అటుపిల్చుకోమ్మా" అన్నారు ఆమె పెద్ద గొంతుతో

అత్తయ్యకి ఒంట్లో బాగోకపోతే ఎందుకురా పీడిస్తావు? లేచి ఇవతలకి రా'' అని ఆజ్ఞాపించింది.

బామ్మగారు నిస్సహాయంగా పక్కకితిరిగి కళ్ళుఒత్తుకున్నారు.

గిరిజ తొలి కాన్పుకి వెళ్ళొచ్చిన రెండునెలలకల్లా బామ్మగారు కన్నుమూశారు.

ఇప్పుడు ఇంటిపని, పిల్లాణ్ణి చూసుకోవడం, రెండు పనులూ ఆమెమీద పడటంతో చిన్నచిన్న పనులు కొన్ని బుజ్జిగాడికి నిర్మొహమాటంగా పురమాయించేది. బామ్మగారి ముద్దుల మనవడిగా పెరిగిన బుజ్జి ఇప్పుడు పూర్తిగా సవత్తల్లి చేతుల్లో ఇరుక్కున్నాడు. తండ్రిదగ్గర పిల్లాడికెప్పుడూ మాలిమిలేదు. బొద్దుగా నలుగురి కళ్ళూ పడేటంత ముద్దుగావుండే పిల్లాడు, నలుగురు అయ్యోపాపం అని జాలికురిపించేలా అయిపోయాడు. రోజూ భోజనం వడ్డించేటప్పుడు, 'అదేం తిండి తినడం అలవాటుచేసిపోయిందో ముసల్ది' అని గొణుక్కుంటూనే వడ్డిస్తుంది.

మొదటి బిడ్డకి ఏణ్ణర్థం వచ్చేటప్పటికి రెండవ బిడ్డకూడా పుట్టింది. ఇద్దరూ ఆడపిల్లలు. సంసారం పెరిగేకొద్దీ గిరిజలో అసహనమూ పెరగసాగింది. చికాకూ ఎక్కువయింది. బుజ్జిని చూస్తే పడేదికాదు.

భర్త ఎదురుగా ఉన్నంతసేపూ ఎలా అవుకునేదో అతనటు వెళ్ళగానే ఏదో ఒక నెపాన, చిన్నచిన్న కారణాలకూడా బుజ్జిగాడిబుగ్గలు పిండటం, కొట్టడం, మొట్టికాయలలో, సొంటిపిక్కల్లో...ఏదో విధంగా హింసించేది. తన పిల్లలు పేచీలు పెడితే ఆ కుర్రాడిమీద ఎగిరిపడూతూ "నా పిల్లలు చాలక వీడొకడు నా ప్రాణానికి.ఆ మహాతల్లి చచ్చేటప్పుడు వీణ్ణీ తీసుకుపోయినా పీడ విరగడయ్యేది'' అని తిట్టిపోసేది.

బుజ్జి ఇరుగుపొరుగు ఇళ్ళల్లోనే గడిపేవాడు. వాళ్ళు తల్లిలేని పిల్లాడనే జాలికొద్దీ తినడానికి ఒక జంతికో, చేగోడీయో ఇస్తే, గిరిజకి అదీ నచ్చేది కాదు. వీళ్ళ కొంపల్లో, వాళ్ళ కొంపల్లో చేరి తినిరావడం మరిగావా అని తిట్టి, కొట్టి వేధించేది.

ఓ రోజు అలా తన్నులు తిని ఇంట్లోంచి బయటకెళ్ళి వూరిబయట గుడి దగ్గర కూర్చుండిపోయాడు. స్తంభం చాటున కూర్చున్న కుర్రాడిని ఎవరూ పెద్దగా గమనించలేదు. చీకటిపడి చాలాసేపయినా అక్కడే కూర్చుని బాగా ఆకలెయ్యడంతో లేచి ఇంటివేపు నడిచాడు. గిరిజ అప్పటికి పిల్లలకి అన్నం పెట్టి, తనూ తిని వూర్నుంచి రావల్సిన భర్తకోసం కాస్త మూతపెట్టి వుంచింది. చీకట్లో ఇంటికొచ్చిన బుజ్జిని చూసి కోపంగా-

"ఎక్కడికి తగలడ్డావింతసేపూ? సాయంత్రంనుంచి పిల్ల ఒకటే ఏడుపు. కాసేపు చూసుకొనేదిక్కులేదు. వుయ్యాల వూపివూపి చేతులు పడిపోయాయి'' అని అరిచింది.

"గుడి దగ్గర కెళ్ళాను''

"నీమొహానికి గుడి ఒకటి. ఇక్కడ అక్కడ తిరిగి ఎప్పుడంటే అప్పుడు ఇల్లు చేరడానికిదేమన్నా సత్రమా? నీకు బుద్ధొచ్చేలా చేస్తానుండు! ఈపూట అన్నం గిన్నం ఏమి లేదు నీకు. వెళ్ళిపడుకో ఫో- అంది''

ఆకలి మండిపోతున్న బుజ్జి "పిన్నీ చాలా ఆకలేస్తోంది. అన్నం పెట్టవూ?'' అన్నాడు.

"అన్నమట అన్నం! వెళ్ళి నోర్మూసుకొని పడుకుంటావా? రెండు తగల్నిమ్మంటావా?'' అని చెయ్యెత్తింది. బుజ్జిగాడు బెదిరి వెళ్ళిపడుకున్నాడు. చిన్న పిల్లలిద్దరూ నిద్రపోయారు. స్తంభాన్ని ఆనుక్కూర్చున్న గిరిజకి అక్కడే నిద్దరొచ్చేసింది.

ఆకలికి ఆగలేని బుజ్జి లేచి లోపలికి వెళ్ళాడు. పొయ్యిమీద అన్నం వెచ్చగా వుంది. గిన్నెలో పులుసు వుంది. అన్నం గిన్నెలోకి పులుసుని వంపుకుని అన్నం మొహం ఎరుగని వాడిలా ఆత్రంగా తినసాగాడు. అలా ఆత్రంగా కుక్కుకుని తినడంతో గొంతులో పట్టుకుని ముద్దదిగడం కష్టమయింది. బలవంతాన మింగడంతో గుండెల్లో ఒత్తిడి ఎక్కువయింది. నీళ్లకోసం చుట్టూ చూశాడు. రాత్రివేళ మసక వెలుతుర్లో ఏమీ సరిగ్గా కనపడలేదు. తడుముకుంటూ వెతుక్కోవటంతో ఇత్తడి బిందెకాస్తా 'డాం'మని చప్పుడు చేసుకుంటూ

కిందపడింది. వణికిపోతూ గుమ్మంవేపు చూశాడు.

గిరిజ చప్పున లేచి లాంతరు తీసుకొచ్చింది "దరిద్రుడా! దొంగతనంగా తింటున్నావా? ఉండు, నీ పని చెప్తాను" అని రెక్కపుచ్చుకొని లాగింది. కంగారులో మాట కూడా రాకుండా బిత్తరపోయాడు బుజ్జి.

"నీకు దెబ్బల్తో బుద్ధిరాదు" అంటూ మూల నున్న ఇనుపకాడని నిప్పులమీదపెట్టి ఎగదోసింది. బుజ్జి కంగారు పడిపోయి వణికిపోతూ-

"ఒద్దు పిన్నీ వాత పెట్టద్దు పిన్నీ! ఇంకెప్పుడూ ఇలా చెయ్యను. చాలా ఆకలేసిందని తిన్నాను పిన్ని ఇంకెప్పుడూ తినను పిన్ని" అని ఏడవసాగాడు.

"నోర్ముయ్" అని వాణ్ణి కసిరి, లాక్కొచ్చి స్తంభానికి కట్టేసింది. పొద్దుట్నుంచీ తిండి లేకుండా ఇప్పుడలా ఆత్రంగా తినడమే కడుపులో గాభరాగావుంది. దానికితోడు ఈ భయం, గుబులు, బాధ తోడయ్యాయి. గిరిజ ఎర్రగా కాలినకాడని ఒక వేపు గుడ్డతో పట్టుకునొస్తుంది. ఆమె రూపం భయానకంగా, వికారంగావుంది. నిద్రమత్తులో ఎర్రబడ్డ కళ్ళు, పిచ్చికోపం, రేగినజుట్టు, చేతిలో కాలిన ఇనుపకాడ... లాంతరు వెలుగులో గోడమీద పెద్దగా కనిపిస్తున్న ఆవిడ నీడ... చూసి బెదిరిపోయి కెవ్వున అరిచాడు బుజ్జి.

తెరిచే వున్న వీధివాకిలి కిర్రుమంది. భర్తేమోననుకుని అటు చూసింది గిరిజ. కాని కాదు... లోపల కాలుపెట్టింది ఒక ముసలాయన.

"నేనమ్మా శంకరయ్యని బుజ్జిగాడి తాతయ్యనమ్మా. పిల్లాడెందుకమ్మా అలా ఏడుస్తున్నాడు?" అని అడిగాడాయన.

గిరిజ చటుక్కున చేతిలో వున్న ఇనుపకాడని గొడవార పారేసి- " రండి లోపలికి. ఏదో తప్పుడు పని చేసాడని రెండు దెబ్బలేసానంతే, ఏడుపు మొదలు పెట్టాడు." అంటూ వాడిని కట్టిన తాడు విప్పేసింది. బయట వీధి కుక్కలొకటే మొరుగుడు.

"ఏరా బుజ్జీ... బాగున్నావా?" అని అడిగారు తాతగారు. బుజ్జి తాతగార్ని ఒకటి రెండు సార్లు చూసాడంతే. అయినా ఈమాట అడగ్గానే ఆయన్ని వాటేసుకొని భోరుమన్నాడు వాడు.

శంకరయ్యగారు లోపలికొస్తున్నప్పుడే గిరిజ చేతిలో వున్న కాలిన ఇనుపకాడని గమనించారు. పోన్లే, పిల్లాడీ రోజుకి తప్పించుకున్నాడు కదా అని అనుకుంటూ పిల్లాడి వీపు నిమురుతూ అలాగే పక్కమీద వాలారు.

"పక్కవూరికి పనిమీద వచ్చాను. అలాగే పిల్లాణ్ణీ చూసి పోదామని వచ్చాను. పొద్దున్నే మళ్ళీ వెళ్ళిపోవాలి తమ్మయ్య ఏడీ?" అనడిగాడు.

"ఆయనూళ్ళో లేరు" అంది గిరిజ ముక్తసరిగా, వచ్చినాయన్ని భోంచేస్తారా అనికూడా అడగలేదు.

ఆయనే- "నాకివాళ సోమవారం, ఒంటిపొద్దు" అని చెప్పారు. మరీ మంచిదనుకుంది గిరిజ . అందరూ ఎవరిదారినవాళ్ళు పడుకున్నారు. బుజ్జిగాడు రాత్రంతా ఉలికులికి పడుతూనే వున్నాడు.

తెల్లవారుఝామున వచ్చాడు తమ్మయ్య. మావగార్ని చూసి ఆశ్చర్యపోయి, "ఎప్పుడొచ్చారు మావయ్యా" అని అడిగాడు.

"రాత్రొచ్చానుబాబూ... బుజ్జిగాడిని నాలుగు రోజులు నాతో తీసికెళ్దామని...."

జవాబు గిరిజ దగ్గర్నుంచొచ్చింది. "మహరాజుగా తీసుకెళ్ళండి" అని.

ఎండెక్కకుండానే బయల్దేరారు. తాతయ్య చెయ్యి పట్టుకుని బయటికి నడిచాడు బుజ్జి.

ఎనిమిదిమైళ్ళు నడవాలంటే శంకరయ్యగారికి లెక్కలేదు. కాని మనవణ్ణి అంతదూరం నడిపించడమా! కావాలంటే కొంతదూరం ఎత్తుకెళ్ళొచ్చుగాని ... ఆలోచిస్తూ మనవడివేపు చూశారు. సరియైన పోషణ లేక పీలగా వున్నాడు. మెరిసే కళ్లవల్ల ముఖమొక్కటే కళగా వుంది. నడుస్తూనడుస్తూ ఊరిచివరికొచ్చారు. గవర్నమెంటు ప్రైమరీ స్కూలు దగ్గర వాచ్ మన్ ఈ కరియప్ప వీళ్లని చూసి ఆగాడు.

"ఏంబుజ్జిబాబు! తాతయ్యగారితో ఎల్తన్నావా?" అని అడిగి శంకరయ్యగారితో- "తీసుకెల్లి మీకాడే ఉంచుకోండి బాబయ్యా అయమ్మ పశువుని బాదినట్టు బాత్తాది. బామ్మగోరు వున్నన్నాళ్లేం సుకపడ్డాడో అంతే. పండులా




గుండేవాడు ఎండువుల్లలా అయిపోయాడు'' అని చెప్పాడు కరియప్ప.

శంకరయ్య ''అలాగే నాయనా ఇంకిక్కడికి పంపన్లే'' అన్నాడు.

చెరువుగట్టు దగ్గరి హనుమంతుడి గుడిదాకా ఎలాగోనడిచేశాడు బుజ్జి. అక్కణ్నుంచి ఆకలి, కాలునొప్పి ఎక్కువై నడక నీరసపడింది. తాతగారు అతన్నక్కడే కూర్చోపెట్టి గుడిదగ్గర కొనుక్కొచ్చిన అరటిపళ్లు తినడానికిచ్చారు. తాతగారి వూరికెళ్లాలన్న ఉత్సాహంతో బుజ్జి కాలునొప్పిని మరచి ''వెళ్దామా తాతయ్యా?'' అనడిగాడు.

ఊరికే నడవాలంటే నిరుత్సాహంగా వుంటుందని శంకరయ్యగారు,''కథ చెప్పనా బుజ్జీ?'' అనడిగాడు.

కథ అనగానే బుజ్జి ఉత్సాహంగా ''చెప్పు తాతయ్యా'' అన్నాడు. శంకరయ్యగారు చెప్పింది రామాయణకథ. రాముడు శివధనుస్సును విరిచి సీతను చేపట్టేవేళకి నేరేడు చెట్టుదగ్గర కొచ్చారువాళ్ళు. చుట్టూ ఎత్తైన చెట్లు. నలుగురు తిరిగే చోటుకానందువల్ల, కిందపడ్డ పళ్ళెన్నో అక్కడేవున్నాయి. తాతగారు ఆపళ్ళల్లోకొన్ని మంచివాటినివేరి శుభ్రంగాతుడిచి బుజ్జికిచ్చారు. తరువాత రావణుడు సీతనెత్తుకెళ్ళే వేళకి ఒక కొలనుదగ్గరకొచ్చారు. కథ వింటూ వింటూ ఎనిమిదిమైళ్లు నడిచేశాడు బుజ్జి. ఇంటికెళ్లేటప్పటికి మధ్యాహ్నం రెండున్నరయింది. వేడినీళ్లు తెచ్చి వాడి కాళ్లని శుభ్రంగా కడిగారు అమ్మమ్మగారు. పచ్చటి విస్తరాకువేసి వేడిగా భోజనం పెట్టారు. పప్పు, మజ్జిగ పులుసుతో తృప్తిగా భోంచేశాడు బుజ్జి. గదిలో చాప, తలగడవేసి పడుకోపెట్టి నడిచి నడిచి అలసిన వాడి కాళ్లు ఒత్తసాగారు అమ్మమ్మగారు. అలసిపోయిన ఒళ్లు ఆదమరచి నిద్రపోయింది. నిద్రలో తాతయ్య చెప్పిన కథంతా కళ్లముందు కదలాడింది. అక్కడకాసేపు కూచుని మరో రెండేసి అరటిపళ్లు తిన్నారు. లంకాదహనం సమయానికి ఒక పల్లె పొలిమేరల్లో వున్నారు. అక్కడ పెద్దకొబ్బరితోట. ఆపనివాళ్లు తాతయ్యతో చాలా గౌరవంగా మాట్లాడి కొబ్బరి బొండాలు కొట్టిచ్చారు. కొబ్బరినీళ్లుతాగి చల్లటినీడలో కాసేపు విశ్రాంతి తీసుకున్నారు. ఇల్లుచేరేవేళకి శ్రీరామపట్టాభిషేకం అయింది. అయోధ్యని, లంకని ఊహించుకోడం బుజ్జికి కొస్త కష్టమయిందిగాని, దండకారణ్యాన్ని మనసులోనే స్పష్టంగా చిత్రించుకున్నాడు. అతడు మర్నాడు కూడా తాతయ్య నీకథే చెప్పమనాలని నిర్ణయించుకున్నాడు.

మనవడు రావడం అమ్మమ్మకెంతో ఆనందంగా వుంది. ఎనిమిదిమైళ్ల అవతల వుండటంతో ఆ వూరికి వెళ్లివచ్చేవారి ద్వారా మనవడి కబుర్లు తెలుస్తూనే ఉండేవి. వాడి పిన్ని ఎలా చెయ్యిచేసుకుంటుందో, తిండిపెట్టకుండా ఎలా మాడుస్తుందో అన్నీ తెలిశాయి. ఇటీవల పరిస్థితి మరీ అధ్వానం అయిందని తెలియడంతో పిల్లాణ్ణిక్కడికి తీసికొచ్చెయ్యాలని నిర్ణయించుకున్నారు. బుజ్జి బామ్మ బతికున్నప్పుడే తీసుకురావాలనుకుంటే ఆవిడ పడనివ్వలేదు. ఉగ్గుపట్టినాటినుంచీ నేనే పెంచుకొచ్చాను. అలాంటిపిల్లాణ్ణి దూరంగా పంపి నేనుండలేనంది. పైగా 'పిల్లాడు తండ్రి దగ్గర పెరగడమే సరియైన పద్ధతి. మీరేమీ అనుకోకండి. చూడాలనిపించినప్పుడల్లా మీరే వచ్చి చూసుకెళ్లండి' అని ఖచ్చితంగా చెప్పేసిందావిడ. ఇప్పుడింక ఆవిడగాని, ఆవిడ ప్రేమపూర్వకమైన అంక్షలుగాని లేవు.

బుజ్జికి అప్పటిదాకా అక్షరాభ్యాసం కాలేదు. స్కూల్లో వెయ్యలేదు. తాతయ్యగారు మంచి రోజు చూసి, పిల్లాడికి తలంటుపోయించి కొత్త బట్టలు కట్టించి అక్షరాభ్యాసం చేశారు. ఆరోజు ఇంట్లో పాయసం వండారు. కుర్రాడు చురుకైన వాడు. తాతగారేం నేర్పినా త్వరత్వరగా నేర్చుకొనేవాడు. కాని ఒకటే షరతు. రోజూ పాఠమయ్యాక రామాయణకథని కొంచెమైనా చెప్పాలి. శంకరయ్యగారు ఎలాగూ రామాయణ పారాయణాన్ని రోజూ శ్రద్ధగా చేస్తారు. తనంత తాను చదువుకోడం కాకుండా ఇప్పుడు బుజ్జికి కూడా అర్థం వివరిస్తూ చదవసాగారు. ఇంట్లో తను సంస్కృతపాఠం చెప్పినా కుర్రవానికి స్కూలు చదువులేకపోతే జీవనం కష్టమవుతుందని భావించి స్కూల్లో చేర్చారు. నాలుగు రోజులుంచుకుంటామని తీసుకొచ్చి దగ్గరుంచేసుకున్నా తమ్ముయ్య ఏమీ మాట్లాడలేదు. శంకరయ్యగారు తన పెద్దరికపు బాధ్యతగా, తమ్ముయ్య ఊరివేపు వెళ్తున్నవారి ద్వారా ఉత్తరాన్ని





రాసిపంపించాడు. దానికి జవాబేమీ రాలేదు.

శంకరయ్యగారింట్లో బుజ్జి ఒక్కడే మనవడు కాడు. ఇంకా కొడుకులు, కోడళ్లు, మనవలూ వున్నారు. వాళ్లెవరూ బుజ్జిని అతిప్రేమగాగాని, ద్వేషంతోగాని, జాలితోగాని చూసేవారు కారు. అందరితోపాటు వాడూ ఒకడన్నట్టుగా వుండే వారు. కుర్రాడు చురుకైన వాడని, బుద్ధి మంతుడనీ అమ్మమ్మ, తాతగారు అనుకునేవారు. తల్లిలేని పిల్లాడనేలోటు లేకుండా ప్రేమగా చూసుకునేవారు.

బుజ్జికి మిడిల్‌స్కూల్ చదువు పూర్తయ్యేవరకూ శంకరయ్యగారే సంస్కృతాన్ని బోధించేవారు. తరువాత తన పరిచయస్థులొకరికి ఉత్తరం రాసిచ్చి పిల్లాడిని మైసూరు పంపించారు.

సంస్కృత పాఠశాలలో బుజ్జి చదువు ముందుకిసాగింది. అతనితోటి విద్యార్థులు ఎనమండుగురు వున్నారు. అందరూ తెల్లవారుఝామునే లేచి పాఠాలని చదువుకోవడం, తరువాత స్నానం, సంధ్యచేసి బట్టలుతుక్కుని రావడం, తరువాత పాఠశాలలో పాఠాలు, ప్రవచనాలు. సాయంత్రం మళ్లీ చెరువులో స్నానం, సంధ్యావందనం తరువాత శ్లోకపఠనం, చర్చలు ... ఈ దినచర్యకి చక్కగా అలవాటుపడ్డాడతడు. వీటన్నింటితోబాటు తాతగారిలా తనూ రామాయణ పారాయణాన్ని ప్రారంభించాడు.

శంకరయ్యగారు ఎప్పుడైనా మైసూరుకి వచ్చి చూసివెళ్లేవారు. ఈమధ్య ఆయన క్కూడా సత్తువ తగ్గింది. అంతకుముందు సంవత్సరమే అతని భార్య మరణించింది. ఒకసారి ఆయన "ఎలాగో నీపెళ్లి చేసేస్తే నాక్కాస్త మనశ్శాంతి" అని అన్నారు.

బుజ్జికి ఆశ్చర్యం కలిగింది. తనకి పెళ్లా? ఇంత త్వరగానా! 'వివాహో విద్యానాశాయ ...' అని తాతగారికి తెలియనిది కాదు కదా! అయినా చెప్పడానికి ప్రయత్నించాడు.

"నీకు పెళ్లిచెయ్యగానే సంసారబంధం తగిలించను. అయినా కష్టానికి, సుఖానికి నీమనిషి అనే తోడొకరు వుండాలి బుజ్జీ" అన్నారు తాతగారు.

"నేనొక పిల్లను చూశాను. పేద ఇంటిబిడ్డ. లక్షణంగా వుంటుంది. బంగారంలాంటి గుణం. నీకు తగ్గపిల్ల. పేరు సీత"

వివరాలన్నీ చెప్పిన తాతయ్య మనసును నొప్పించలేక ఒప్పుకున్నాడతను. ఆ మాఘ మాసంలోనే పెళ్లికూడా అయింది. పెళ్లయ్యాక అతను మళ్లీ మైసూరుకి వెళ్లి చదువుకొనసాగించాడు. సీత పుట్టిల్లువదిలి వచ్చి తాతగారి దగ్గరే వుంది.

అతను ఒకటి రెండుసార్లు ఇంటికి వచ్చివెళ్లాడు. భార్య మంచిపిల్ల. ఎక్కువ మాట్లాడకుండా తాతగారికి సేవచేస్తుంటుంది. ఈ విషయం గమనించి అతడానందించాడు. పెళ్లాయ్యాక శంకరయ్యగారు బుజ్జిని చూడ్డానికి మైసూర్ వెళ్లడం మానేశారు. అప్పుడప్పుడు క్షేమసమాచారాలతో ఉత్తరాలు రాసేవారు. అలాగే రెండేళ్ళు గడిచాయి. ఒకసారి నెలరోజులయినా ఉత్తరం రాలేదు. ఎందుకా అని వ్యాకుల పడుతుండగా అతని మేనమామ దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. తాతగారు చనిపోయిన విషయం తెలియబరుస్తూ, వెంటనే వచ్చి నీభార్యని తీసుకెళ్లమని రాశారు. బుజ్జికి దుఃఖం, దిగ్భ్రమ చుట్టుముట్టి ఏంచేయాలో తోచలేదు. ఏమయినాగాని వెంటనే బయల్దేరక తప్పదు.

ఊరికి వెళ్లి మేనమామల్ని "ముందుగా నాకెందుకు తెలుపలేదని?" అని అడిగాడు. ఎవరూ సరిగ్గా జవాబివ్వలేదు.

కాపురం పెట్టే ఆలోచనని కొద్దిరోజులు వాయిదా వేయదల్చి భార్యనడిగాడు "కొద్దిరోజులు పుట్టింట్లో వుండగలవా?" అని.

ఆ అమ్మాయి కళ్లనీళ్లు నింపుకుంది. తల వంచుకుని మౌనంగా నించుంది. ఈమధ్యన ఆ అమ్మాయి తండ్రి మరణించడంతో ఇంట్లో తిండికే కష్టంగా వుందని తరువాత తెలిసింది బుజ్జికి. మైసూర్లో ఒక ఇల్లు చూసిపెట్టమని స్నేహితుడు సుబ్రహ్మణ్యానికి ఉత్తరం రాశాడు.

సీతని తీసుకుని మైసూర్ బయల్దేరే ముందు

"ఎనిమిది మైళ్లు నడవగలవా?" అనడిగాడు.

"ఊఁ" అంది సీత.

చిన్నప్పుడు తను నడిచి వచ్చిన ఆ దారిలోనే మళ్లీ నడిచి మధ్యాహ్నాం పన్నెండుగంటలకి తండ్రి ఇంటికి చేరాడు బుజ్జి. అరుగు మీద ఆరు, ఎనిమిది ఏళ్ల వయసులున్న ఆడపిల్లలిద్దరు స్తంభంచుట్టూ తిరుగుతూ ఆడుకుంటున్నారు.

లోపల్నుంచి మధ్యవయస్సు స్త్రీలా మారిపోయిన గిరిజ వచ్చి "ఎవరూ?" అని మొహం చిట్లించుకుని అడిగింది.

"నేను పిన్నీ... బుజ్జిని" అన్నాడతను.

గిరిజ మొహం ఇంకా ముడుచుకుపోయింది. కొంపలోంచి పోయినవాడు మళ్లీ ఎందుకు దాపురించాడు? ఆస్తిలో వాటాకోసం వచ్చాడేమో అనిపించింది.

"ఈ ఇల్లు వదిలి మీ తాతతో ఏరోజయితే వెళ్లావో ఆ రోజునుంచి నీకు, ఈ ఇంటికీ రుణం తీరిపోయింది. ఇప్పుడు మళ్లీ ఎందుకొచ్చినట్టు?" అంది.

పిన్ని భయం ఏమయ్యుంటుందో అతనికర్థమయింది. ఆవిడెంత గయ్యాళి మనిషి అయినా ఇలా వీధిలో నిలబెట్టి పరుషంగా మాట్లాడుతుందనుకోలేదు.

"మీ నాన్న ఊళ్లో లేరు. ఇంకా నాలుగు రోజులగ్గాని రారు" అంది.

వాకిట్లో ఆటలాడుతున్న పిల్లలు ఆటనాపేసి వీళ్లకేసే చూస్తున్నారు. లోపల్నుంచి మరొక పదేళ్ల పాప కూడా వచ్చి నించుంది. దాన్తో "ఎందుకే వచ్చారు? ఇక్కడేమన్నా కోతులాడుతున్నాయా? పొండి లోపలికి" అని కసిరింది.

బుజ్జి ఇంతటి తిరస్కారాన్ని వూహించలేదు. 'తన కోసం కాకపోయినా, ఈ ఇంటికోడలు... మొదటిసారి వచ్చింది... లోపలికి పిల్చి, ఒకపూట భోజనం పెట్టి తాంబూలం ఇచ్చి పంపకూడదా' అనుకున్నాడు. మధ్యాహ్నవేళ అపరిచితులొచ్చినా భోజనానికి లేవండని మర్యాదచేసే రోజులవి.

"వెళ్లొస్తాం పిన్నీ" అన్నాడు బుజ్జి.

ఆవిడ 'ఊ' అని కూడా అనలేదు.

ఇంకెక్కడికీ వెళ్లడం ఇష్టంలేక, "పదపోదాం" అని భార్యతో అని బయల్దేరాడు. రెండుమైళ్లు తూర్పుదిక్కుగా నడిస్తే రైల్వేస్టేషనొస్తుంది. సీతని ఇంకా రెండుమైళ్లు నడిపించాలే అని బాధపడుతూ అడుగులేశాడు.

ప్రైమరీ స్కూలు దగ్గర పడగానే, ఆరోజు.. తాతయ్యతో వెళ్తుండగా కరియప్పని చూసిన జ్ఞాపకం వచ్చింది. కరియప్ప ఇప్పుడూ అక్కడే వున్నాడు. ఒక చెట్టు నీడన కూర్చున్నాడు. గడ్డమంతా నెరిసిపోయింది. ఎండకి కాపుగా చెయ్యి కళ్లకడ్డం పెట్టుకుని చూస్తూ "బుజ్జిబాబుగారుకదా" అన్నాడు.

"ఏం కరియప్పా బాగున్నావా? ఇన్నేళ్లయినా బాగానే గుర్తుపట్టావే!" అన్నాడు.

"అయ్! పెద్దయితే మాత్తరం మొకం మారిపోద్దేంటి? పెళ్లయిందెప్పుడు? ఏంకత? తాతగారు పోయినారంటగా? ఇంటికెళ్లొచ్చారా? ఏటి సంగతులు?" అంటూ వివరాలన్నీ అడిగాడు.జరిగినదంతాసంక్షిప్తంగా చెప్పాడు బుజ్జి.

"అయ్యా... రైలు నాలుగ్గంటలకి కదా? మావోళ్ళబండి అటే పోద్ది. కూసేపుండి పొండని స్కూలు వెనకున్న తమ ఇంటికి తీసుకెళ్ళాడు. పళ్ళు, పాలతో ఉపచారాలు చేశాడు. కరియప్ప భార్య కొబ్బరికాయ తాంబూలంలో పెట్టిచ్చి, ఒక జాకెట్టు గుడ్డ కూడా ఇచ్చింది. బండెక్కి నాలుగ్గంటలకి ముందే స్టేషన్ చేరారు.

బుజ్జి స్నేహితునికి ఉత్తరంలో ఇల్లు చూసి పెట్టమనడమే కాక తాము ఏరోజు వస్తున్నారో ఆ సంగతి కూడా తెలియబరచాడు. సుబ్రహ్మణ్యం స్టేషన్ కొచ్చి వీళ్ళని దింపుకొని 'పాత అగ్రహారం'లో తను ఇల్లు చూసిన సంగతి చెప్పి, ఆ ఇంటి చిరునామా, తాళంచెవి ఇచ్చాడు.

ఇంటిని శుభ్రంగా తుడిపించి కడిగించినట్టుంది. మధ్యాహ్నం పళ్ళు, పాలు కాక ఇంకేమీ తీసుకోకపోడంవల్ల ఆకలిగా వుంది ఇద్దరికీ.

వీధి చివర వున్న అంగడిలో ఒక సేరు బియ్యం, ఒక పావు సేరు పప్పు కొని పట్టుకొచ్చాడు. సీత పెట్లోంచి పుట్టింటివాళ్ళు ఇచ్చిన సేరు గిన్నెని తీసి, ముందు చారు పెట్టింది. సుబ్రహ్మణ్యం నీళ్ళగదిలో గుండిగ నింపి కొద్దిగా కట్టెలు తెచ్చి వెలిగించాడు. అతను

స్నానం పూర్తిచేసేవేళకి చారు కాగింది గాని, అన్నం వండటానికింకో గిన్నెలేదు. ఇరుగుపొరుగువాళ్ళంతా అప్పటికే దీపాలార్పి పడుకున్నారు. ఎవర్నడగడం? సీత అవస్థ చూసి, 'పిన్ని రెండు గిన్నెలయినా ఇవ్వాల్సింది' అనుకున్నాడు. అయినా గడపదాటి లోపలికి అడుగు పెట్టనివ్వని మనిషి నుంచి ఇవన్నీ ఏంఆశిస్తాం? వంటింట్లో వున్న రోటిని శుభ్రంగా కడిగి తుడిచేసి, దాంట్లో చారు వంపి ఆ గిన్నెలోనే మళ్ళీ అన్నం వండింది. ఉట్టి చారు అన్నం అయినా రుచిగా, తృప్తిగా, మృష్టాన్నభోజనంలా తిన్నారు.

ఎంతలేదనుకున్నా రెండు గిన్నెలయినా కొనవల్సిందే. బుజ్జి చేతిలో ఒక బంగారపు ఉంగరం వుంది. దాన్ని అమ్మేసి ముఖ్యంగా కావల్సిన గిన్నెల్ని కొద్దిగా సామాను కొన్నాడు.

అదృష్టవశాత్తు ఆ సంవత్సరం అతని చదువు ఒక ఘట్టానికి చేరడంతో ఆ స్కూల్లోనే ఉద్యోగం కూడా దొరికింది. పని దొరికిందని బుజ్జి, తన వ్యాసంగాన్ని ఆపలేదు. ఇప్పుడతను బుజ్జికాదు. మృత్యుంజయ శాస్త్రిగారు.

మృత్యుంజయశాస్త్రి తన నిరంతర అధ్యయనాన్ని సాగిస్తూ పాండిత్యాన్ని వృద్ధి చేసుకుంటున్నాడు. రామాయణంలో అతనికి సాటి మరెవరూ లేరు. రామాయణంలో ఏ సందేహమొచ్చినా, ఉపన్యాసం ఇవ్వాలన్నా వ్యాసాలు రాయించాలన్నా అతడి దగ్గరికి రావల్సిందే. వెళ్ళినచోటల్లా తగిన సంభావన కూడా దొరికేది. ఇలా వచ్చిన మొత్తాన్ని అతను సంసారానికి వాడేవాడుకాదు. డబ్బు చేతికి రాగానే ఒక్కొక్క బంగారు కాసు కొని దాచేవాడు. సీత చేతులకి గాజులు, మెడలో రెండుపేటల గొలుసు అమరాయి. తరువాత కూడా అదే అలవాటు ఉంచుకున్నాడు. నెలజీతంలో సంసారం సుఖంగా గడచిపోయేది. బంగారం ధర బాగా పెరిగాక దాచివుంచిన కాసులన్నీ సొమ్ముగా మార్చి ఒక స్థలం కొని ఇల్లు కట్టాడు. చేతనైనంతమందికి సహాయపడేవాడు. మృత్యుంజయ శాస్త్రి అంటే పాండిత్యానికి, ఘనతకి, దానగుణానికి పేరు అనిపించుకున్నాడు.

పిల్లల విషయంలో మాత్రం అతను అదృష్టానికి నోచుకోలేదు. హైస్కూలు చదువుకూడా పూర్తి చేయకుండా పెద్దకొడుకు వ్యాపారం అంటూ బొంబాయి వెళ్ళి నిలదొక్కుకోలేక తండ్రికి అప్పుడప్పుడు డబ్బేమన్నా పంపమని రాస్తుంటాడు. రెండవకొడుకు ఎం.ఎ.చదువుకొని కాలేజీ లెక్చరరై తన స్టూడెంటయిన ఒక పిల్లని పెళ్ళాడాడు. అతడికో కొడుకు. వాళ్ళు మృత్యుంజయశాస్త్రి ఇంట్లో వుండటానికి ఒకటే కారణం - అది ఆ 'ఇల్లు'. అతని ఇంటిమీద, ఆస్తిమీద కన్ను వేశారు వాళ్ళు. ఆయనతో లేనిపోని తగువులు పెట్టుకుంటూ జీవితాన్ని దుర్భరం చేశారు బయట అడుగుపెడితే 'మహాపండితుడ'న్న గౌరవం ఆయనకి. ఇంట్లో మాత్రం 'చాదస్తపు ముసలాడు'.

సీతమ్మ పోయి కొన్నేళ్ళయింది. అప్పట్నుంచి శాస్త్రిగారు కొన్నివిషయాల్ని తీవ్రంగా ఆలోచించి వీలునామా రాశారు. ఇల్లు, భూమిలాంటి స్థిరాస్తుల్ని పిల్లలకి పంచి మిగిలిన సొమ్ముని తనకుతోచినవిధంగా కొన్ని విద్యాసంస్థలకి దానం చేశారు. ఆ విషయం తెలుసుకున్న కొడుకు కోపంతో గంతులేశాడు. మీ ఇష్టంవచ్చినట్టు దానధర్మాలు చేసుకోడానికి మీకేం పిల్లలు, మనవలు లేరనుకున్నారా?" అని గొడవ పెట్టుకున్నారు.

"మీకు నేను తక్కువేమీ చేయలేదు కదానాయనా. ఏదో నలుగురుపేద విద్యార్థులకి చదువుకునే అవకాశం దొరుకుతుంది కదా అని..."

"కనిపించిన దరిద్రుల్నీ అడుక్కునే వాళ్ళనీ ఉద్ధరించు, కన్నపిల్లలచేతికి చిప్ప అందివ్వు..." అన్నారు కోడళ్ళు.

శాస్త్రిగారింకా గట్టిగా మాట్లాడచ్చు. "నా కష్టార్జితం, నాఆస్తి, నా ఇష్టమెచ్చినట్టు దానం చేసుకుంటాను, నీకేమీ సంబంధంలేదు అనొచ్చు, కాని ఎందుకో మాట్లాడటం ఇష్టంలేకపోయింది. విల్లుని ఆయనేమీ మార్చుదల్చుకోలేదు.

కోడలు విసుక్కుంటూ వడ్డిస్తుంటే ఆయన ప్రాణానికి అది విషంలా వుండేది. ఒకసారి ఆయనకి వినపడేలాగే "ఈ ముసలాయనెప్పుడు హరీమంటాడోగాని పడలేకపోతున్నాం" అంది. మనవడసలు ఆయన దగ్గరకే చేరకుండా జాగ్రత్తపడుతోంది. తాతగారి గ్రంథాల్లో

పేజీలని చింపడం, చేతికర్రని దాచేయ్యడం అనేవి సహజక్రీడల్లా కొడుక్కి అలవాటుచేసింది. ఈతీరుచూసి శాస్త్రిగారు ఆశ్చర్యపోయేవారు.

ఒకరోజు ఉదయమే ఆయన పరిచయస్థులయిన వినాయకరావుగారు వచ్చారు. తాను తులసీ రామాయణాన్ని క్షుణ్ణంగా పరిశీలనాత్మకంగా చదివిన విషయాన్నిచెప్పి, మూల రామాయణానికీ, తులసీరామాయణానికీ వున్న విభిన్నత చర్చించారు. రెండుగంటలసేపు ఆ చర్చ నడిచింది. ఆయన వెళ్ళాక శాస్త్రిగారు తోటలోకి వెళ్ళి మల్లెపూలు, నందివర్ధనం పూలు కోసుకొచ్చి ఆ పూలబుట్టని దేవుడి మందిరం ముందు పెట్టి,స్నానానికి వెళ్ళారు. స్నానం చేసివచ్చి పూజకి దేవుడి గదిలోకొచ్చేసరికి అక్కడ కనిపించిన దృశ్యాన్ని నమ్మలేకపోయారు.

ఎనిమిదేళ్ళ మనవడు, చేతిలో దానిమ్మకాయ పట్టుకుని గింజలు తీసి నోట్లో వేసుకుని రసాన్నిపీల్చి నోట్లోంచి తీసిన గింజల పిప్పిని గురిచూసి మందిరంవేపు విసురుతున్నాడు. కోపంతో, దుఃఖంతో ఆయనకి ఒళ్ళు వుడికిపోయింది. ఎందుకో ఆక్షణంలో ఎర్రటి ఇనపకాడతో వాతపెట్టడానికి సిద్ధంగా నుంచున్న తన సవతితల్లి గుర్తొచ్చింది. చటుక్కున వెళ్ళి కుర్రాడి జబ్బుపట్టుకున్న మనిషి తమాయించుకుని 'శ్రీరామా శ్రీరామా' అనుకుని శాంతరూపులయ్యారు.

తాతగారు జబ్బుపట్టుకోగానే పిల్లాడు ఇల్లు అదరగొట్టేలా అరుపులు, ఏడుపు మొదలెట్టాడు. కొడుకు, కోడలు ఇద్దరూ పరిగెత్తుకువచ్చేశారు. తన కొడుకేం చేస్తున్నాడో తెలిసికూడా తెలీనట్టు మొహం పెట్టుకుంది కోడలు.

"ఎందుకు పిల్లాడి జబ్బనలా పట్టుకుని లాగడం? చంటివెధవ వాడికేం తెలుసని? మెల్లగా చెప్పొచ్చు కదా? ఇటు రారా బాబూ" అని పిల్లాడి భుజం చుట్టూచెయ్యివేసి తీసుకెళ్ళిపోయింది.

వెనుకగా వచ్చిన కొడుకు "ఇదేంగొడవనాన్నా? మీ కాలం ఎలా జరిగిందో జరిగింది. ఈ కాలంలో కూడా అలాగే జరగాలంటే ఎలా? మా





పిల్లాడికి ఉన్నారోలేరో తెలియని దేవుళ్ళ గురించి, దెయ్యాల్ని గురించి నూరిపోసి మనసుని పాడు చెయ్యదల్చుకోలేదు. పెద్దవాడయ్యాక మతం-ధర్మం ఇలాటివేం తెలుసుకున్నా వాడే ఆలోచించి నిర్ణయించుకుంటాడని స్వేచ్ఛగా పెంచుతున్నాం. ఎవరెవరి నమ్మకాలు వారివి," అన్నాడు.

శాస్త్రిగారు మనసుని అధీనంలోకి తెచ్చుకుంటూ "నేనెప్పుడు నానమ్మకాలనెవరి నెత్తినా రుద్దలేదు నాయనా అయినా నేను పూజ చేసుకునే దేవుడిమీద ఎంగిలి గింజల్ని...ఇలా..."

"ఏం మునిగిపోయిందిప్పుడు? అవన్నీతీసి అవతల పారేసి మంత్రాల్ని చెప్పుకుని ఇన్నినీళ్ళు చల్లుకో అంతా పవిత్రమవుతుంది" అన్నాడు వెక్కిరింపుగా.

కొడుకు వ్యంగ్యం వారి మనసును గుచ్చింది. మనసులో ఇన్నాళ్ళూ రూపుదిద్దుకుంటున్న ఆలోచనలు ఒక రూపానికి రావడానికిన్నాళ్ళు పట్టింది. గృహస్థాశ్రమ కర్తవ్యాలన్నీ పూర్తయిపోయాయి. ఇక సంసారంలో వుండీ లేనట్టే. ఒక చిన్న పెట్లో రామాయణ గ్రంథాల్ని పెట్టుకుని, నాలుగు బట్టలు సర్దుకుని ఇల్లువదిలి బయల్దేరారు. ముందరి కార్యక్రమం అంత స్పష్టంగా అనుకోలేదు.

మొదట్నుంచీ తనని అభిమానంగా చూసే శ్రీదేవి ఇంటికొచ్చారు. ప్రస్తుతానికిక్కడున్నారుగాని, ఇక్కడయినా ఎక్కువరోజులుంటారనే నమ్మకం లేదు."

"అటువంటి తండ్రిని దక్కించుకునే అర్హత ఆ పిల్లలకి లేదంతే, ఆయనతో కాసేపు గడిపివస్తే మనకే ఎంతో సంతోషంగా వుంటుంది" అన్నాడు జగన్నాథం.

★ ★ ★

ఎం.ఎస్‌సి పూర్తయ్యాక పి.హెచ్‌డి కోసం చాలా విదేశ విశ్వవిద్యాలయాలకి అప్లై చేశాడు అశోక్. మూడుచోట్లనుంచి అనుకూలాభిప్రాయంతో ఉత్తరాలొచ్చాయి. ఆ మూడు తల్లిదండ్రుల ముందుపెట్టి "ఎక్కడికి వెళ్లడం మంచిది?" అని అడుగుతుండగా—

"అమ్మా" అనే అపరిచిత కంఠం వినిపించింది.

యశోద లేచి బయటికొచ్చింది. ఎక్కడో

చూసినట్టువున్న ముఖం. 'ఎక్కడా' అని గుర్తు రావడంలేదు. ఆమె తగ్గుస్వరంతో "హృషీకేశ్ దగ్గర గంగలో దూకుదామని కూర్చున్న నా దగ్గరకొచ్చి మాట్లాడించిన సంగతి మర్చిపోయావేమిటమ్మా"?అంది

నిండు ప్రవాహం పక్కనే...దిగులుగా ఒంటరిగా కూర్చున్న ఆమె ... అవును, ఆవిడే! యశోద ఆదరంగా-

"ఆ ... ఇప్పుడుమీరు చెప్పగానే గుర్తొచ్చింది" కూర్చోండని కుర్చీ చూపించింది.

ఫరవాలేదులే, ఇక్కడే చల్లగా వుందంటూ కిందే కూర్చుంది. యశోద లోపలికెళ్ళి చల్లటి నిమ్మరసం, ఒక విసనకర్ర తెచ్చి అందించింది. ఆవిడ నిమ్మరసం తాగి, "అమ్మా ... ముసలివాళ్ళకోసం ఆశ్రమం ఏదో నడుపుతున్నా నన్నావుకదా, నేనుకూడా... అక్కడ..." అంటుండగానే ఆవిడ గొంతులో దుఃఖప్రవాహం ఉబికి వచ్చింది.

యశోదకి ఇలాంటి పరిస్థితి కొత్తేమీ కాదు. కొందరు సంతోషంగానే ఎవరి దాక్షిణ్యం అక్కర లేకుండా హాయిగా బతకచ్చని వస్తే, మరికొందరు నాకిలాంటి పరిస్థితి వచ్చిపడింది కదా అని దిగులుపడుతూ వస్తారు. నాలుగురోజులు ఆశ్రమంలో గడిపిన తర్వాత అక్కడి స్నేహపూర్వక వాతావరణానికి మెల్లగా ఇమిడిపోతారు. ఈమధ్య ప్రతిరోజు సాయంత్రం ఒకగంట సేపు గ్రంథపఠనం. టేపరికార్డర్‌లో మంచి సంగీతమో, భజనలో వినడం ఇలాగే ఏదో ఒక కార్యక్రమం వుంటూంటుంది. ఆవిడకూడా మెల్లగా ఆ వాతావరణంతో ఇమిడిపోతుందన్న విషయం యశోదకి తెలుసు.

"ఎటువంటి ఇంట్లో పుట్టాను, ఎలాంటి ఇంటిని మెట్టాను! చివరకి ఇలాంటి గతి పట్టింది. లలాట లిఖితం! ఎవరు చెరపగలరు!..." బాధతో కంఠం పూడిపోయింది. "కొంచెం సంభాళించుకోండమ్మా. ఇకమీదట ఇదే మీ ఇల్లనుకొని వుండిపోండి. ఇక్కడి నుంచి మిమ్మల్ని పొమ్మనెవరూ అనరు. అవునూ, మిమ్మల్నేమని పిలవమంటారు.

నాపేరు "భాగీరథి"

భాగీరథమ్మ చిన్న పెట్టెలోంచి ఐదుపేటల గొలుసు ఒకటి బయటకి తీసింది. "ఇదొక్కటే నాదగ్గరున్నది. స్నేహితురాలి ఇంట్లో కుట్టి పెట్టి వుంచాను. కాని దాన్ని బయటికి తియ్యటం మిగిలుంది. కుట్టువచ్చునాకు. ఎటొచ్చి పాతకాలపు పద్ధతి"

"అలాగే ... ఆశ్రమానికి వెళ్దాం పదండి" అని యశోద ఆవిడని 'వానప్రస్థానికి' తీసుకెళ్ళింది. పచ్చదనం నిండిన తోటలో నెలకొన్న ఆశ్రమాన్ని చూసి మొదటిచూపులోనే తృప్తి కలిగింది భాగీరథమ్మకి. యశోదతోపాటు కొత్తవాళ్ళెవరో రావడం చూసి రిజిస్టర్ తేబోయారు రాజారావుగారు. అప్పుడే వద్దన్నట్టుగా సైగ చేసింది యశోద. ఆశ్రమం అంతా తిప్పి గదులన్నీ చూపించింది. నాగమ్మని, వేదమ్మనీ పరిచయం చేసింది. తమకంటే చిన్న వయసులో వుండి, ముఖానికి కుంకుమతో లక్షణంగా వున్న ఆమెని కుతూహలంగా చూశారు.

సుబ్బారావుగారు "చూడమ్మా, నా నాలుగో కొడుకు ఉత్తరం రాశాడు. వాడి కొడుకు పుట్టిన రోజట. తప్పకుండా రావాలంటాడు. అంత దూరం ఎలావెళ్ళడం చెప్పు! " అన్నారు.

యశోద, "ఇక్కడే మిఠాయి పంచుకుందాం లెండి" అంది. సుబ్బారావుగారు తృప్తిపడ్డట్టే కనిపించింది. పిల్లలేలేని మానవుడు మనవల కలల్నికూడా కంటున్నాడు. "ఎంతమంది పిల్లలు వీరికి?" అని భాగీరథమ్మ అడిగిన ప్రశ్నవారి చెవినపడనే పడింది. ఆయనిక ఉత్సాహంగా,

"చూడండి నాకు సరిగ్గా పన్నెండుమంది పిల్లలు..." అని మొదలెట్టారు. భాగీరథమ్మని అక్కడ వదిలి యశోద ఇంటికి వెళ్ళేటప్పటికి ఎనిమిది గంటలయింది.యశోదకి ఒకరకంగా తృప్తిగా వుంది.

"గంగలో దూకబోయిన... అన్న ఆవిడమాటల్ని తల్చుకుంటే... అప్పటి తన వూహ నిజమే నన్నమాట. ఆ పరిస్థితి వచ్చిందంటే ఎన్నిబాధలు పడివుంటుందో ఆవిడ. పాపం! ఇంకస్థిమితంగా బతకొచ్చు" అనుకొని తృప్తిగా నిట్టూర్చింది.

★ ★ ★

సాయంత్రం సంధ్యవేళ దేవుడిముందు దీపం వెలిగించి నాగమ్మగారు భక్తిగీతాలను పాడుకుంటున్నారు.

ఆమెను చూస్తూ భాగీరథమ్మ ఆలోచనలో మునిగిపోయింది.

ఇదివరకు తన ఇంట్లో తన అత్తగారు కూడా ఇలాగే దీపంపెట్టి స్తోత్రాలనీ, కీర్తనల్నీ పాడుకునేవారు. ఇంకా ముందురోజుల్లో పెళ్ళికాకముందు తన తల్లి కూడా ఇలాగే దీపం వెలిగించడానికి నూనె, ఒత్తి సిద్ధం చేసుకుంటూ "బాగీ... కాళ్ళు చేతులు కడుక్కొచ్చి దేవుడికి దండంపెట్టుకో. పిల్లలందర్నీ పిలు" అనేవారు. దేవుడికి దండంపెట్టుకుని "శుక్లాంబరధరం"తో మొదలుపెట్టి నాలుగైదు స్తోత్రాలు చెప్పుకుని, తరువాత భోజనం ఏర్పాట్లు! అంతా తనదే పని.

వద్దన్నా వదలని జ్ఞాపకాలు.

"భాగమ్మగారూ... భోజనానికి వస్తారా?" అని పిలిచారు వేదమ్మగారు. తలెత్తిచూసి భోజనానికి లేచింది భాగీరథమ్మ. తనువు, మనను అలసిపోయివున్నా,నాగవ్వ వడ్డించిన వేడి వేడి చారు, వంకాయకూర రుచిగా వుండటంతో సుఖంగా భోంచేసింది. ఆ రాత్రి నిద్ర కూడా బాగానే పట్టింది.

తెల్లవారి ఆవిడ నిద్రలేచేవేళకి మోహనరావుగారు తప్ప అందరూ నిద్రలేచి వారివారి

కార్యక్రమాల్లో మునిగిపోయారు. ఆవిడకి చాలా సిగ్గుగా, మొహమాటంగా అనిపించింది. లేచి నీళ్లగదిలోకి వెళ్ళారు. పొయ్యిమండుతోంది. అప్పటికే నాగప్పగారు గుండిగెడు నీళ్ళుకాచి వుంచారు. చన్నీటిస్నానం అలవాటున్న నాగమ్మగారు అప్పటికే స్నానం పూర్తిచేసి పూలబుట్ట పుచ్చుకుని తోటలోకి వెళ్ళారు.

ఆరోజు యశోద ఆశ్రమానికి రాగానే వాకిట్లోనే నుంచున్న భాగీరథమ్మ "నా స్నేహితురాలి ఇంట్లో మిషన్ వుంచానని చెప్పానుకదా! ఇప్పుడు వెళ్ళి తెచ్చుకోవచ్చా?" అని అడిగింది.

"తొందరేముంది... మెల్లగా తెచ్చుకోవచ్చు కదా" అంది యశోద.

"తీసుకొచ్చేస్తానులేమ్మా. నిలదొక్కుకొందుకొక చోటంటూ దొరికింది కదా"

ఆమె గొంతులో వున్న ఆదుర్దాని గుర్తించిన యశోద "మంచిది... వెళ్ళిరండి" అంది.

రాజారావు రిజిస్టర్‌తెచ్చి పొద్దున రాసుకున్న భాగీరథమ్మగారి వివరాలని చూపించారు. భర్త బతికేవున్నాడు. ఇద్దరు పిల్లలు వున్నారు. ఈ సంగతులు తెలిసి ఆశ్చర్యపోయింది యశోద.

పోస్టు చూస్తే రామన్నగారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందని తెలిసింది. ఆ ఉత్తరంచూసి ఆనందంగా అనిపించింది. అందరి యోగక్షేమాలు విచారించారు. తను కొడుకుదగ్గర సుఖంగావున్న విషయం తెలియబరిచారు. విశేషాలన్నీరాసి, మిమ్మల్నందర్నీ చూడాలని వుందని రాశారు.

నరసింహయ్యగారొక్కరే కిటికీ దగ్గర నుంచుని వున్నారు. యశోద ఆయన చేతికి ఉత్తరం అందిస్తూ, "చూడండి రామన్నగారు ఉత్తరం రాశారు" అంది.

ఆయన దాన్నందుకుని ఒకసారి దానివేపు చూసి ఇచ్చేశారు.

ఆయనంత చురుకుగా లేకపోవడంచూసి, "ఏమయింది మీకు... ఒంట్లో బాగోలేదా?" అని అడిగింది.

డా॥ ప్రభు వారానికోసారి వచ్చి అందర్నీ శ్రద్ధగా పరీక్షిస్తారు. ఆయనకి కొద్దిగా రక్తపోటు తప్ప మరే సమస్యాలేదు. అయినా...

"కులాసాగానేవున్నానమ్మా. ఈరోజు నా భార్యపోయినరోజు" ఆయనకి మగపిల్లలున్న సంగతి యశోదకి తెలును.

"పిల్లలు అబ్దీకంపెడతారు కదా?"

"బతికున్న తండ్రిని ఉన్నావా చచ్చావా అని అడగని పిల్లలు చచ్చిపోయిన తల్లికి తద్దినం పెడతారటమ్మా? ఏమిటో నీ పిచ్చి"

ఆయన స్వరంలో ఉద్రేకాన్ని గమనించింది యశోద. "పోన్లెండి, ఇప్పుడేం చేద్దామో చెప్పండి" అంది.

"నాకేమీ తోచడంలేదు. నువ్వెలాచెప్తే అలా" అన్నారు.

"నాకు తెలిసిన అనాథాశ్రమం ఒకటి వుంది. మీకు చేతనైనదెంతో కొంత డబ్బిస్తే అక్కడివారికందిద్దాం. ఒకపూట పిల్లలకి తీపివంటేదయినా చేసిపెడతారు"

"మీ ఆలోచన బాగుంది. ఇప్పుడే వెళ్దామా"

యశోద ఆయనకి రాజారావుని తోడిచ్చి పంపించింది.

లోపలి హాలులో మిగిలినవారంతా చేరినట్లున్నారు. వేదమ్మ కంఠం స్పష్టంగా వినిపిస్తోంది.

"అసలు వానప్రస్థాశ్రమానికి స్పష్టమైన అర్థం, పరమార్థం ఏమిటి?"

"అంటే..." అని వెంకట్రావుగారు ప్రారంభించేసరికి, "అయ్యో... మిమ్మల్నికాదు- శాస్త్రిగారినడిగాను" అని కంగారుపడ్డారావిడ.

"హిందూధర్మం ప్రకారం మనిషికి నాలుగు ఘట్టాలు దాటాల్సివుంది. ఒక్కొక్క ఘట్టానికి ఒక్కొక్క ఆశ్రమమని పేరుపెట్టారు. విద్యార్థి దశలో బ్రహ్మచర్యాశ్రమం. అప్పుడు కట్టుబాట్లకి, నీతినియమాలకి లోబడి విజ్ఞానముపార్జనే ధ్యేయంగా గడుపవలసినకాలం. వివాహమయ్యాక మొదలయ్యేది గృహస్థాశ్రమం. సంసారబాధ్యతలను సక్రమంగా నెరవేరుస్తూ, దేవతాకార్యాలను, పితృకార్యాలను శాస్త్రోక్తంగా నిర్వర్తించాలి. పెద్దలకు, గురువులకు సేవచేస్తూ, దానధర్మాలని నిష్ఠగా చెయ్యాలి. అతిథి సత్కారంలోను, వ్రతనియమాల్లోను శ్రద్ధాసక్తులను చూపాలి. తరువాత ప్రారంభమయ్యేది వానప్రస్థాశ్రమం. గృహస్థాశ్రమంలోని కర్తవ్యాలను





నవ్యంగా పూర్తిగావించి సంసార నిర్వహణని పిల్లలకి వదిలి ధ్యానాభ్యాసాన్ని స్వీకరించడమే వానప్రస్థఆశ్రమం... ఇక చివరికి సర్వం త్యజించి వైరాగ్యాన్ని అవలంబించడం సన్యాసాశ్రమం...''

వారి మాటల్ని వింటున్న యశోద, ఈయన ఈ ఆశ్రమానికివచ్చి చేరడం మంచిదయింది. మంచిచర్చలు, సందేహనివారణలు జరుగుతున్నాయన్నమాట! అనుకుంది.

భాగీరథి జట్కాలో తన పాతకుట్టుమిషన్ని తీసుకొచ్చింది. బాగా వెలుగువడేచోట కిటికీ పక్కగా పెట్టింది. పాతగుడ్డతో శుభ్రంగా తుడిచి, చమురుపోసిపెట్టింది. అదంతా గమనిస్తున్న వేదమ్మ

"ఈ మిషనంటే మీకు చాలా ఇష్టంలాగుంది!'' అంది.

"అవునమ్మా... కన్నపిల్లలకంటే ఎక్కువ ఇది. ఇన్నాళ్ళూ నన్నుపోషించి పిడికెడు అన్నంపెట్టిన దయామయి '' అనిచెప్పి యశోదతో-

"ఏమన్నా బట్టలుంటే పంపించమ్మా కుట్టిస్తాను'' అంది.

ఎన్నాళ్ళనుంచో నిశ్శబ్దానికి అలవాటువడ్డ మధ్యాహ్నాలిప్పుడు మిషన్ టకటకలకి అలవాటువడ్డాయి. కుట్టువనిముందుకు సాగుతుంటే భాగీరథి ఆలోచనలు వెనక్కి దొర్లసాగాయి.



విశాలంగా విస్తరించిన రావిచెట్టు. అక్కడికి కొద్దిదూరంలో బావి. బావిగట్టువక్కన మూడు రాళ్ళ పొయ్యి. పొయ్యిమీద నీళ్ళతో గుండిగ. భాగీరథికి ఆమె మేనత్త ఒక స్నానాల రాతిమీద కూర్చోబెట్టి తలంటేవారు. ఒక చిన్న తుండుని చుట్టుకుని కూర్చున్న భాగీరథి తలకి సీకాయిపొడి రుద్దుతూ ఆమె "తల్లిలేని పిల్ల ఎలాంటి ఇంట్లో వడుతుందో అని బెంగెట్టుకున్నాను. ఆరోజు చూడ్డానికొచ్చారే సుందరమ్మగారు. ఆవిడకొడుక్కి నిన్నుచేసుకుంటుందట. ఇంత అదృష్టం నీ నుదుటరాసివుందని నాకు తెలీదే పిల్లా'' అన్నారు.

నోరు విప్పితే సీకాయినీళ్ళు నోట్లోకివెళ్తాయి. అయినా నోరువిప్పి చెప్పాల్సినదేముందిగనుక!

ఏనాడో వదిలేసిన దూరపుబంధువులువాళ్ళు. సుందరమ్మ కొడుకు పురుషోత్తం ఎఫ్.ఎ. చదివి, పైచదువులకోసం మద్రాసుకి బయల్దేరాడు. కొడుకు చదువుకి వెళ్ళేలోగా అతడి పెళ్ళి చేసెయ్యాలని నిర్ణయించింది తల్లి. భాగీరథి లక్షణమైనపిల్ల. "తల్లిలేని పిల్లయితేనేం పిల్లాడికి సరిజోడైన పిల్ల!'' అన్న సుందరమ్మ మాటని కాదనడానికి వీల్లేదు. పురుషోత్తానికి పిల్లనిద్దామని ఉబలాటవడి ఆశాభంగం పొందిన వాళ్ళుకూడా ఈ మాటనొప్పుకున్నారు.

పెళ్ళయిన ఏడాది తరువాత అత్తగారి ఇంటికి వచ్చింది భాగీరథి. ఆడపిల్లల్లేని అత్తగారికి కోడలంటే ఎంతో ఆపేక్ష. ఆ పిల్లకి మల్లెమొగ్గల జడవెయ్యడం, మంగళగౌరి, మౌనగౌరి అంటూ రకరకాల వ్రతాల్ని చేయించడం, నోముల్నివట్టించడం, పండుగలొస్తే చక్కగా జడ అల్లి జడకుచ్చులు, నాగరం, నగలు అన్నీ అలంకరించడం ఆవిడసరదాలు. పురుషోత్తం శలవుల్లోవచ్చి వెళ్తూండేవాడు. అతనటు వెళ్ళగానే ఇటు బెంగపెట్టుకునేటంత ఎదుగుదల రాలేదా పిల్లలో. అత్తగారు, కోడలు బెంగపెట్టుకుంటుందేమోనని తనతో వచ్చీను, వామనగుంటలు, అష్ట-చెమ్మ... ఇలాంటి ఆటలన్నీ ఆడేది. అత్తగారింట్లో భాగీరథికి చాలా సౌఖ్యంగా గడిచిపోయేది.

పురుషోత్తం బి.ఎ. పూర్తి చేసేటప్పటికి భాగీరథి ఒక బిడ్డ తల్లయింది. భర్త చదువయిపోయింది. అతడింక ఇక్కడే వుంటాడన్న ఆమె వూహ మాత్రం తప్పయింది. అతను బి.ఎల్. చదవడానికి మళ్ళీ మెడ్రాస్ బయల్దేరాడు. 'పోన్లే, ఇప్పుడు కొన్నాళ్ళు దూరంగా వుంటేనేం. తరువాతెలాగూ కలిసే వుంటాం కదా' అని

అతనే ఓదార్చాడు. అనారోగ్యంతో మంచంపట్టిన మామగారిసేవ, ఇంటిపని, బిడ్డ సంరక్షణ వీటితో భాగీరథికి తీరికే వుండేది కాదు. బి.ఎల్. పూర్తి చేసి పురుషోత్తం ఇంటికి వచ్చే టప్పటికి ఒక రకమయిన ప్రశాంతత నెలకొన్నది. అప్పటికి భాగీరథి రెండవ బిడ్డకి ఆరు నెలలు.

పురుషోత్తం లా పరీక్ష ప్రథమ శ్రేణిలో పాస య్యాడు. అతడు తెలివయినవాడు. తన సబ్జెక్టులోనే కాకుండా మిగతా సబ్జెక్ట్సులోనూ ఎంతో ఆసక్తి వుందతనికి. ఫిలాసఫీ, సాహిత్యం- వీటిల్లోనూ మంచి ప్రవేశం ఉంది. ఈ మధ్యకాలంలో భాగీరథి మాత్రం నాలుగ్గోడలమధ్య ఉండిపోయింది. ఇద్దరు పిల్లల తల్లి అయింది. అత్తగారి దగ్గర రకరకాల వంటలు, పిండివంటలు నేర్చుకుంది. బొబ్బట్లు, కజ్జికాయలు మొదలైన పిండివంటలు చేసి అత్తగారిచేత శభాష్ అనిపించుకొనేది. భర్త అలాలావాటి పుస్తకాల మధ్య లీనమైపోడం ఆమెకి సహజంగానే అనిపించేది. ఆ పుస్తకాల్లో ఏముంటుందో పురుషోత్తం చెప్పడానికి ప్రయత్నించలేదు. భాగీరథి తెలుసుకొనేందుకు ప్రయత్నం అంతకంటే చెయ్యలేదు.

ఒక సంవత్సరం గడిచింది. పురుషోత్తం తనకి విదేశాలకి వెళ్లడానికి స్కాలర్‌షిప్ దొరికిందని చెప్పినప్పుడు తండ్రి వ్యతిరేకించాడు. "ఇప్పుడు నువ్వు విదేశాలకి వెళ్లి ఒరగబెట్టవల్సిందేముంది. వున్నవాడివొక్కడివి. నాకూ వయసు మీద పడింది. ఎప్పుడేమౌతానో. అంతో ఇంతో ఆస్తి వుంది.ఇంకా ఏంకావాలని పరుగులెడతావు నాయనా?" అన్నాడాయన.

తండ్రికి జవాబివ్వలేదు పురుషోత్తం. కాస్తో, కూస్తో సంపాదించి ఒకచోట పడుండాలని లేద తనికి. అతని ఉద్దేశాలే వేరు. తన మానాన తను ప్రయాణపు ఏర్పాట్లు చేసుకోసాగాడు. భాగీరథికిఏమీ మాట్లాడలేని పరిస్థితి.

అతను విదేశాలకు వెళ్లాక రెండు ఉత్తరాలు వచ్చాయి. మూడవ ఉత్తరం వచ్చేటప్పటికి తండ్రి పరలోకానికి వెళ్లిపోయాడు. సంగతి తెలిసిన పురుషోత్తం తల్లిని ఓదారుస్తూ వుత్తరం రాశాడు. తను కేవలం రెండేళ్లు మాత్రం అక్కడుండి వచ్చేస్తానని, తరువాత ఇంకెక్కడికీ వెళ్లననీ తెలియబరచాడు.

రోజులలాగే గడుస్తున్నాయి. అరుదుగానయినా ఉత్తరాలు రాసే పురుషోత్తం ఇప్పుడు పూర్తిగా మౌనం వహించాడు. భాగీరథి మునుపటిలా ముగ్ధబాలిక కాదు. అతి తక్కువ కాలంలో ఎన్నో అనుభవాలని సంపాదించి జీవితంలోని కష్టసుఖాలని సంపూర్తిగా గ్రహించుకుంది. ఇప్పుడామెకన్నీ అర్థమవుతున్నాయి. భర్తదగ్గరనుండి ఉత్తరాలు ఆగిపోయిందెందుకు అని ఆలోచిస్తే భయం కలిగేదామెకు. దుఃఖం పొంగి వచ్చేది. అత్తగారు చాలాసార్లు "ఈమధ్య మన పురుషోత్తం ఉత్తరాలే రాయడం మానేశాడుకదూ? ఎక్కడో దూర దేశం, ఆరోగ్యంగా వుంటే అంతేచాలు...." అనేది. ఒక్కోసారి కోడల్ని దగ్గర కూర్చోబెట్టుకుని తల నిమురుతూ... "మనసు గుబులుగా వుంటే రామాయణం తీసుకొని చదువుకో తల్లీ" అనేవారు. రామాయణం తల్చుకుంటే సీత వనవాసమే కళ్లముందు కదుల్తుంది. శ్రీరాముడిలాంటి ఉత్తముడిని కట్టుకున్న సీతకే కష్టాలు తప్పలేదు. సుఖం నుదుట రాసి వుండాలి. ఇంత చదువుకున్న భర్త దొరికినా సుఖం తన నుదుట రాసిలేదు.

సంపాదించి తెచ్చేవాళ్లు లేకుండానే బతుకు నడపాల్సిన పరిస్థితి వచ్చింది. ఉన్న ఇల్లుతప్ప పెద్దగా ఇంకే ఆస్తీ లేదు. వార్ధక్యం వచ్చేటప్పటికి కొడుకు చూసుకుంటాడనే నమ్మకం వుండటంతో కొడుకు చదువుకి, అభివృద్ధికి ముందువెనుకా చూడకుండా ధారాళంగా ఖర్చు పెట్టారు. భాగీరథి అత్తగారితో "మనం ఇద్దరమే కదా వున్నది. ఇంత పెద్ద ఇల్లు మనకెందుకు? ముందువేపు గదుల్ని ఒక భాగంగా చేసి అద్దెకిచ్చేద్దాం" అంది. సంసారం గడవడానికి అంతకంటే మరోదారి లేకపోయింది.

భాగీరథి భర్తకి రాసిన ఉత్తరాలు కొన్ని తిరిగొచ్చాయి. ఈమధ్య విదేశాలకి వెళ్లేవాళ్లు కొందరు అక్కడి ఆడవాళ్లనే వివాహమాడటంలాంటి వార్తలు విన్నది భాగీరథి. పురుషోత్తం అలాంటిపనేమన్నా చేసుంటాడేమోనన్న అనుమానం ఆమెని వేధించసాగింది. ఎలాగైనా అతడిగురించి తెలుసుకోవాలని ప్రయత్నించి ఓడిపోయింది. పిల్లలు మీనాక్షి, కామా




క్కి స్కూల్లో చేరారు.

ఒకరోజు సాయంత్రం మనక చీకటివేళ ఇంటిముందు పెద్ద కారొకటి ఆగింది. పిల్లల్ని లోపలికి పిలవడానికి గుమ్మంలోకొవచ్చిన భాగీరథి ఆ కార్లోంచి. దిగుతున్న వ్యక్తిని భర్తగా గుర్తించడానికి కొంత సమయంపట్టింది. అతను ముదర నీలంరంగు సూటు, కళ్ళజోడు ధరించివున్నాడు. వల్చటి మనిషి కొంచెం ఒళ్ళుచేశాడు. ఒత్తైన క్రాఫ్. దుఃఖం, సంతోషం ఉబికివచ్చిన భాగీరథికి ఏంమాట్లాడాలో తోచలేదు. వరుగున లోపలకివెళ్ళి అత్తగారికి కొడుకువచ్చిన వార్త చేరవేసింది. "ఏమన్నావు?" అని అత్తగారు ఆశ్చర్యపోతూ అడుగుతుండగానే కొడుకు లోపలికొచ్చి ఆమె ముందు నుంచున్నాడు.

"ఏం నాయనా? ఇలా చేశావేమిటి? పోన్లే, మొత్తానికి ఇంటికొచ్చావు కదా!" అన్నారు. ఆవిడ గొంతు దుఃఖంతో పూడుకుపోయి మాటలుతడబడ్డాయి. పురుషోత్తం దారి తప్పి ఎక్కడికో వచ్చినవాడిలా నుంచున్నాడు.

"ఇదేమిటి నాయనా? సామానేది?"

"సామానేమీ లేదు. నేను ఊళ్ళోకివచ్చి మూడునాలుగు నెలలయింది."

"ఆఁ! ఇంటికెందుకు రాలేదు? ఎక్కడున్నావిన్నాళ్ళూ?"

అక్కడ ఇంకెక్కువసేపు వుండడానికి ఇష్టపడనట్లుగా"అమ్మా... నేను మరో పెళ్ళి చేసుకున్నాను. ఈ ఊళ్ళోనే కంటోన్మెంట్‌లో ఇల్లు చూసుకున్నాను. నెలకి 'ఇంత' అని డబ్బు పంపిస్తాను. నా అడ్రస్ ఇదిగో. నేను వెళ్ళొస్తాను" అని తన అడ్రస్‌వున్న కార్డొకటి అక్కడ పెట్టేసి గబ గబ బయటికి వెళ్ళిపోయాడు.

కొడుకు మాటలర్థం కావడానికి ఆ ముసలి తల్లికి కొంత సమయంపట్టింది. గది తలుపుకానుకుని నుంచున్న భాగీరథి పిల్లల్ని దగ్గరకితీసుకుని వెక్కుతుంటే పరిస్థితి అర్థమయింది పెద్దావిడకి. "అయ్యో! పాపిష్టివాడు! సీతలాంటి భార్యనింట్లో పెట్టుకుని ఇదేం వెధవ పని. పైగా సిగ్గులేకుండా ఇంకోపెళ్ళి చేసుకున్నానని చెప్పుకుంటున్నాడు! ఇంక మనకి, పిల్లలకి దిక్కెవరే భాగీ? వీడికిలాంటి దుర్బుద్ధి ఎందుకుపుట్టిందే తల్లీ?" అని మొత్తుకుంది ఆవిడ.

ఆరోజంతా ఇంట్లో ఎవరో చచ్చిపోయినట్లుంది. వాతావరణం. చివరికి భాగీరథే," ఇలాగవ్వాలని మన మొహాన రాసుంటే ఎవరు తప్పించగలరత్తయ్యా. అనుభవించాల్సిందేగా" అని కళ్ళు తుడుచుకుని బెంగగా కూర్చున్న పిల్లల్ని లేపి అన్నంపెట్టింది.

అప్పుడు మంచం పట్టిన అత్తగారు మళ్ళీ లేవలేదు. నాలుగునెలలు మంచానపడి ఒకరోజు కన్నుమూసిందావిడ. చుట్టుపక్కల మగదిక్కులేదు. పక్కవాళ్ళని ఇంట్లో కాసేపు వుండమని బతిమాలి, కామాక్షిని తోడుతీసుకుని పురుషోత్తం ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళింది భాగీరథి. అతను వదిలిపోయిన అడ్రస్‌కార్డు ఆవిధంగా ఉపయోగపడింది.

ఎత్తైన గేటు, లోపల తోడేళ్ళలాంటి కుక్కలు రెండు. తోటలో పనిచేస్తున్న తోటమాలి వచ్చి

"ఎవరు మీరు?" అని అడిగాడు.

తనెవరో చెప్పకుండానే పురుషోత్తం తల్లి మరణించిన వార్త చెప్పి, 'అతనున్నాడా' అని అడిగింది. తోటమాలి ఇంట్లోకి వెళ్ళొచ్చాడు. పురుషోత్తం ఇంట్లో లేడేమో, లోపల్నుంచి ఒక స్త్రీ బయటకొచ్చింది. ఎర్రటి జుట్టు, పొట్టిగా వుంది. వెంట్రుకలన్నీ వెనక్కి చేర్చి కట్టుకుంది. పురుషోత్తం కంటే ఇంకాస్త పొడుగుండచ్చు. ఖరీదైన కాటన్‌చీర ఫ్యాషన్‌గా కట్టుకుంది. లోపలకి వెళ్ళడమా వద్దా అని ఆలోచిస్తుండగానే వెనుకనుంచి 'రయ్యి'ని కారు లోపలకొచ్చింది. కార్లో వున్న పురుషోత్తం మొహం చిట్లించి "ఇక్కడకెందుకొచ్చావు? డబ్బుకోసమా?" అనడిగాడు మొరటుగా. భాగీరథికి అసహ్యమేసింది. జవాబు చెప్పకుండా గిర్రున వెనక్కితిరిగి ఇంటికొచ్చేసింది. చుట్టుపక్కల వాళ్ళ సహాయంతో అంత్యక్రియలు, కర్మలు జరిపించింది. అత్తగారి బంధువొకతను ఇంటికెప్పుడయినా వచ్చిపోతుండేవాడు. పండుగ, పబ్బం ఉంటే అతన్ని భోజనానికి పిల్చేవారు. అతనికి కబురుచేసి శవసంస్కారం అతనిచేతే చేయించింది.

అత్తగారు పడుకున్న స్థలంలో దీపం వెలిగించి పెట్టింది. పక్కింట్లో వున్నవాళ్ళు తెచ్చి





చ్చిన అన్నం, పులును పిల్లలకి తినిపించింది. తనుమాత్రం పచ్చిమంచినీళ్ళయినా తాగ కుండా చెదరిన మనసుతో గోడకి ఒరిగికూ ర్చుంది. తలస్నానం చేసి వదిలిన తడివెంట్రు కలు నీళ్ళు కారుతున్నాయి. ఆమె కంటివెంట కూడా! గుమ్మందగ్గర అలికిడయితే ఉలిక్కిప డింది. పురుషోత్తం వచ్చి నుంచున్నాడక్కడ. లేచి నుంచోవాలని కూడా అనిపించలేదామెకి. ఊరికే చూస్తూ కూర్చుంది. ఒళ్ళంతా అలస టతో, నీరసంతో నలిగిపోయివుంది.

మూలనున్న దీపాన్ని చూసి అతను "అంతా పూర్తయిపోయిందా?" అని అడిగా డు. భాగీరథి జవాబివ్వలేదు.

"కొడుకుని, నేనీవూళ్ళో వుండగానే కొరివి పెట్టిందెవరు?" గట్టిగా అడిగాడతడు.

"మీ అమ్మే చెప్పారు, ఆవిడపోయాక ఆవిడ శవాన్నికూడా మీరు తాకడానికి వీల్లే దని" జవాబుచెప్పింది భాగీరథి.

"అయితే నాఇంటికెందుకొచ్చినట్టు?"

"విషయం తెలియబరచాలి కదాఅని"

"డబ్బేమయినా..."

"అక్కర్లేదు"

భాగీరథికి ఒళ్ళు మండిపోతోంది. అతను ఇంకొక్క మాటకూడా అనకుండా వెళ్ళిపోయా డు.

తరువాత పిల్లలిద్దర్ని పెంచి, చదివించి, పెళ్ళిచేసి... అన్ని బాధ్యతల్నీ తను ఒంటరి గానే నిర్వహించింది. మొదట్నుంచి చివరివ. రకు తోడైనిలచింది కుట్టుమిషనొక్కటే. పెద్దకూ తిరింటికి వెళ్తే "అమ్మా ఎప్పుడు నీప్ర యాణం?" అనిఅడిగేది. చిన్నకూతురైతే రమ్మ నికూడా అనదు. పుట్టింటితో వాళ్ళకి అవస రంలేదు.

రానురాను కళ్ళు మసకలుకమ్ముతున్నాయి. కుడుతుంటే వీపు, నడుమూ నొప్పెడుతు న్నాయి. తన కుట్లన్నీ పాతకాలం తరహా అని బేరాలుకూడా ఎక్కువరావడం మానేశాయి. ఆమెకి పనిలేకుండాపోయింది.

★ ★ ★

భాగీరథిగురించి తెలిసిన విశేషాలన్నీ జగ న్నాధానికి చెప్పింది యశోద.

"ఎలాంటి మనిషో అతను! లక్షణమైన భార్యని ఇంట్లోవుంచుకుని మరో పెళ్ళిఎలా చేసుకుంటారో అసలు. ఇలాంటివాటికి ఏచట్ట మూ అడ్డుపడదా అసలు?" అనడిగింది.

మొదటిభార్య బతికివుండగా ఇంకోపెళ్ళి చేసుకోడం చట్టవ్యతిరేకం. అయినా కొంత మంది మొదటి భార్యని బెదిరించో, ఒప్పించో, ఒత్తిడిచేసో అనుమతి పత్రం తీసు కుని మళ్ళీపెళ్ళి చేసుకుంటూంటారు. దేనికి సంబంధించిన వ్యవహారం దానిదే" అన్నాడు జగన్నాధం.

అయినా అతడలా చేయడం అన్యాయం. చిన్న వయసులో పెళ్ళయింది. అప్పుడు అత డికి తగిన భార్య గనుక ఇద్దరు పిల్లల్ని కన్నాడు. తరువాత పెద్దపెద్ద చదువులు చది వినంత మాత్రాన ఇన్నాళ్ళు నచ్చిన భార్య నచ్చకుండా పోవడమా? తనవిద్యకి, హెూదాకి తగనంత మాత్రాన కష్టసుఖాల్లో పాలు పంచుకో డానికి సిద్ధపడి వచ్చిన భార్యనిలా అవమా నించవచ్చా? అతడి తల్లిదండ్రుల్ని తన స్వంత తల్లిదండ్రుల్లా, అతడికంటే ఎక్కువ బాధ్యతగా చూసుకుంది. అలాంటి స్త్రీకి జరగ వలసిన న్యాయమేనా ఇది? ఆఖరికి పిల్లలవ ల్లకూడా ఆవిడకి సుఖం దక్కలేదే!

ఏకాలంలోనైనా... కట్నం చాలలేదనో, పిల్ల లు కలుగలేదనో, హెూదా, చదువు సరితూగలే దనో..ఏదోఒక కారణానికి మరోపెళ్ళి చేసుకోవ డమో, మరో ఆడదాన్ని వుంచుకోవడమోచేసే మగవాళ్ళవల్ల అన్యాయం ఎప్పుడూ స్త్రీలకే జరుగుతోంది. అటువంటి పరిస్థితుల్లో ఆత్మహ త్యలు చేసుకుంటున్నారంటే ఆశ్చర్యం ఏముంది.

ఈకాలంలో చాలా కుటుంబాల్లో పిల్లల మనోభావాలు మారిపోతున్నాయి. చదువు పూర్తయి నిలదొక్కుకునే వరకూ తల్లిదండ్రులు కావాలి. తరువాత వాళ్ళే అడ్డుగా అనిపిస్తారు. ఉమ్మడికుటుంబం అనే వ్యవస్థ ఉన్నంత కాలం ఈ సమస్య తల ఎత్తేదికాదు. పిల్లలు తల్లిదండ్రుల్నేకాక, తలచెడిన మేనత్తలుంటే వారిని, పిల్లల్లేని పెద్దనాన్నల్లో, చిన్నాన్నల్లో వుంటే వారినికూడా కనిపెట్టుకునేవారు. వారు

చనిపోతే వారి కర్మాదికాలు కూడా చేసేవారు. వ్యక్తికంటే కుటుంబం మహత్తరమైనదనే నమ్మకం వారిది. అలాగని ఉమ్మడికుటుంబం అన్నివిధాల అనుకూలమైనదికాకపోవచ్చు. అందులో వుండే సమస్యలందులోనూ వుంటాయి.

తన ఆలోచనల్లో కొట్టుకుపోతున్న యశోద- "మనం ముసలాళ్ళయ్యాక పిల్లలమీద అధారపడి బతక్కూడదు. వాళ్ళకిష్టమొచ్చినట్టుగా వాళ్ళుండి, ఎప్పుడైనా చూడాలనిపించినపుడు వచ్చి పోతుంటే చాలు" అంది అప్రయత్నంగా.

"అదేమిటి అలా మారిపోయింది నీ అభిప్రాయం? ఇన్నాళ్ళూ, వార్థక్యంలో ఒంటరితనం భరించటం కష్టం. ఇంటినిండా పిల్లలు, మనవలు వుంటేనే నిండుగా వుంటుందని అనేదానివి?" అని హాస్యం చేసాడు జగన్నాథం.

"నాకేం ఒంటరితనం? జతగా మీరుంటారుగా"

"పోన్లే... ఆర్థికంగా ఆధారపడకుండా వుంటే సరి. అశోక్, ప్రతాప్ ఇద్దరూ మంచి అమ్మాయిల్ని పెళ్ళాడితే వాళ్ళ బుజ్జిబుజ్జిపిల్లలు ఇంట్లో తప్పటడుగులు వేస్తూ తిరుగుతుంటే ఎంత బాగుంటుందోకదా! ఆ ఆనందం వద్దంటావా?" అని అడిగాడు జగన్నాథం.

'బిక్కుమనే ఇంట్లో అలాంటి అందమైన దృశ్యాన్ని ఎవరొద్దంటారు? జగన్నాథం రిటైరై తను బాధ్యతల్నుంచి విముక్తురాలై ఇద్దరూ పిల్లల్తో...ఎంత అందమైన ఊహ!'

★ ★ ★

ఆశ్రమం ప్రారంభమై పది సంవత్సరాలైంది. వార్షికోత్సవం జరపాలన్నది వారి కోరిక. రాజారావుగారు ఉత్సాహంగా ఒక కార్యక్రమాల జాబితాని తయారుచేసారు. యశోదకి అంతగా ఇష్టంలేదు. స్కూళ్ళల్లో జరిపినట్టుగా ఉత్సవాలు జరపడం, జనం చేరడం...ఎందుకు లేనిపోని ప్రచారం?-ఒద్దులెమ్మంది యశోద. రాజారావు నిరుత్సాహపడలేదు,

"ఎక్కువ హడావుడేమీ వద్దులెండి. ఉదయం ఆశ్రమంలో విందుభోజనం, సాయంత్రం ఆశ్రమ వాసులచేత ఒక వినోద కార్యక్రమం- అంతే" అని యశోదని ఒప్పించారు.

"ఏరోజో ముందుగా చెప్పండి. మా అమ్మాయిని, అల్లుణ్ణి రమ్మని రాస్తాను" అన్నారు సుబ్బారావుగారు.

లోపల మోహనరావుగారు "నీరజ గంధీ నీ ముఖనీరజమును చూపవేలనే" అని రాగం తీస్తున్నారు. అప్పుడే ఏర్పాట్లు జరుగుతున్నాయన్నమాట! అనుకుంది యశోద.

ఈమధ్య ఆశ్రమానికి బయట జనాలు చాలామందే వస్తున్నారు. వృద్ధులంతా ఒకచోట చేరి తమ భావాలు పరస్పరం తెలుపుకోవడానికి అనుకూలమైన స్థలంగా తయారైంది 'వానప్రస్థం'. పాతరోజుల్ని తల్చుకోవడం, ఆశ్రమానికి వచ్చే పత్రికల్ని చదవడం, కార్డ్సు ఆడటం, వారానికోసారి అక్కడ జరిగే ఉపన్యాసాలు, సంగీత కార్యక్రమాలు, చలనచిత్రప్రదర్శనలు విని, చూసి ఆనందించడం...ఎంతో చైతన్యవంతంగా తయారైంది ఆశ్రమ వాతావరణం. నలుగురైదుగురు కేవలం భోజనం, నిద్రకి తప్ప మిగిలిన సమయాన్నంతా అక్కడే గడిపేవారు.

"చూశావామ్మా మన రాజారావుగారి ప్లాను?" అంటూ ఉత్సాహంగా చెప్పారు వెంకట్రావుగారు.

"నాఫిడేలు బయటకి తీసి దోవలో పెట్టాలి" అన్నారు మితభాషి అయిన శేషయ్యగారు. వారందరి ఉత్సాహం చూసి, వార్షికోత్సవమనేది ఈ వృద్ధుల్లో ఇంత ఉత్సాహాన్ని రేకెత్తించేదయితే ప్రతిసంవత్సరం చేయొచ్చును అనిపించింది యశోదకి. వంటింటివేపు వెళ్ళి ఈ సందర్భంగా ఏమేంసామాన్లెక్కువగా కావాలో ఒక జాబితా రాసుకుంది యశోద.

★ ★ ★

ప్రతాప్, జగన్నాథం చెస్ ఆడుతూ కూర్చున్నారు.

"ఆశ్రమంవాళ్ళంతా కలిసి వార్షికోత్సవం జరుపుతారట" అని ఎనౌన్స్‌చేసింది యశోద.

"అలాగా... కావాలంటే నేనొచ్చి ఫొటోలు తీస్తాను" అన్నాడు ప్రతాప్.

"నువ్వా... ఒద్దులే నాయనా. ఢిల్లీ ఫొటోలు




ఎంత బాగా వచ్చాయో చూశానుగా''

''అబ్బెబ్బే... ఈసారి ఇంకో కెమేరా, మంచిది తెస్తాను. బాగా వస్తాయి ఫొటోలు'' అన్నాడు ప్రతాప్.

''పాపం... ముసలాళ్ళంతా ఫొటోలు చూసుకుందామని ఆశగా ఎదురుచూస్తారు. నువ్వేమో తలో, కాళ్ళో ఏదో ఒక భాగంలేకుండానో, నల్లగానో, మసకమసగ్గానో ఫొటోలు తీస్తే వాళ్ళుగతేమిటిచెప్పు?'' అని ఉడికించాడు జగన్నాథం.

''అహహ... అన్నీ లక్ష్మణ్‌రుఖ్ః ఫొటోల్లాగే రావాలంటే ఎలా?'' తుంటరిగా అడిగాడు ప్రతాప్.

''అది అశోక్ కదా తీసింది''

''నేనూ తీస్తాలే అంతకంటే అద్భుతంగా''

★ ★ ★

రాజారావ్ పర్యవేక్షణలో వార్షికోత్సవం సంభ్రమంగానే ప్రారంభమయింది. పొద్దున్నే ఆటలపోటీలు సూది-దారం, జ్ఞాపకశక్తిపరీక్ష, స్లోవాక్...సభ్యులంతా అన్నింటిల్లోను చాలా ఉత్సాహంగా పాల్గొన్నారు.

సాయంకాలం కార్యక్రమానికి అనుకున్నదానికంటే చాలా ఎక్కువమంది జనమే వచ్చారు. పందిరి నిండిపోయింది. సాయంకాలాలు కాలక్షేపానికి వచ్చేవాళ్ళంతా వాళ్ళకుటుంబ సభ్యుల్ని కూడా తీసుకొచ్చారు.

మోహనరావుగారు కీచకుడిపాత్రని, హరిశ్చంద్రుడిపాత్రనీ అభినయించారు. ప్రేక్షకుల నుంచి బ్రహ్మాండమైన హర్షధ్వానాలు వినవచ్చాయి. ఆరోజు ముఖ్యఅతిథిగావచ్చిన రాఘవేంద్రరావుగారు పూర్తిగా మోహనరావుగారితోనే వుండిపోయారు. ప్రేక్షకుల మెప్పువల్ల కలిగిన మత్తులోంచి, తన్మయత్వంలోంచి మోహనరావుగారు ఎంతోసేపటికిగాని తేరుకోలేదు.

తరువాత ఆటల్లో గెలిచినవారికి బహుమతులు పంచారు. ప్రేక్షక సమూహంలో కూర్చున్న సుబ్బరాయశెట్టిగారు లేచివచ్చి తాను మోహనరావుగారిఅభిమానినని చెప్పుకుని గజానన కంపెనీలో వారు నటించిన అద్భుతమైన నటనను మరోసారి ప్రదర్శించినందుకు తమ హర్షాన్ని వ్యక్తంచేసి, 'చంద్రునికో నూలుపోగు' అంటూ తమ చేతినున్న బరువైన కెంపుఉంగరాన్ని మోహనరావుగారి చేతినందుకుని వారి వేలికి తొడిగారు.

జనగణమనతో పూర్తయిన ఆనాటి కార్యక్రమం అందరికీ తృప్తినిచ్చింది.

పొద్దుటే వూరినుంచి వచ్చిన రామయ్యగారు తను తీసుకొచ్చిన పప్పులు, ధాన్యాలు, కూరగాయలు, అన్నీ ఆశ్రమపువంటగదికి చేర్పించారు. కార్యక్రమాలు చూసి ఊరికెళ్ళిపోయారు.

ఇంటికి బయల్దేరిన యశోద దగ్గరకి వార్షికోత్సవానికొచ్చిన మధ్యవయసు గృహస్థు ఒకాయన వచ్చాడు. ''మీతో కొంత మాట్లాడవలసివుంది... రేపు రావచ్చా?'' అనడిగాడాయన.

''రండి'' అని చెప్పి ముందునడుస్తున్న జగన్నాథం వాళ్ళని కలుసుకుంది.

''రేపు వచ్చి ఏదో మాట్లాడాలట''

''ఇంకేముంటుంది తల్లినో, తండ్రినో తీసుకొచ్చి చేర్చుకోమ్మంటాడేమో'' అన్నాడు ప్రతాప్.

''నాకు అదే అనుమానం'' అన్నాడు జగన్నాథం.

''వీళ్ళకి ఎంత ఉత్సాహమో చూడమ్మా! మాకాలేజ్‌డే జరిపినంత జోరుగా జరిపారు ఫంక్షన్'' అన్నాడు ప్రతాప్.

మాట్లాడుతూ బయట కొచ్చేసరికి గేటుదగ్గర మాసికలు వేసిన పంచె, చిరిగిన బనీను ధరించిన ఒక ముసలాయన చేతులు జోడించి-

''అమ్మా... ఇక్కడ దిక్కులేని ముసలోళ్ళందర్నీ వుంచుకుని అన్నం పెట్టి పోషిస్తారట?'' అని అడిగాడాయన.

''లేదుబాబూ...'' కాస్త తడబడింది యశోద ఆమాట అనడానికి.

''అలాగని ఎవరో చెప్పారేనాకు...అయితే ఉట్టిదేనా?'' ముసలతని గొంతులో నీరసం, నిరాశ ధ్వనించాయి.

''నాకెవరూ దిక్కులేరు. కొడుకు బతికుంటే గొప్పోడైయేవోడు. నాకింకెవరూ దిక్కులేరు. మీరు ఒక్కపూట గుప్పెడు మెతుకులు పెట్టినా




సంతోషమే'' అని వేడుకున్నాడు దీనంగా.

యశోద ఆశ్రమం లోపలికివెళ్ళి ఒక విస్తరి నిండా పులిహోరా, రెండు బొబ్బట్లు పెట్టించుకుని వచ్చి ఆ ముసలివాడి చేతిలో పెట్టింది. అతడు మళ్ళీ తనని అడిగితే ఏంచెయ్యాలి? ఏ అనాథాశ్రమానికయినా పంపడానికి ప్రయత్నిస్తే...అని ఆలోచిస్తుంటే జగన్నాథం ''ఇక వెళ్దామా?'' అని అడిగాడు. ముసలతను అటు ఇటు చూడకుండా కూర్చుని ఆత్రంగా అన్నం తింటున్నాడు.

★ ★ ★

రాత్రి నిశ్శబ్దంలోకూడా ఆ వృద్ధుడి దైన్యం నిండిన కంఠమే వినిపించసాగింది యశోదకి. చీకటిలో అతడిముఖమే వెంటాడుతున్నది. ఇటువంటి సంఘటన జరగడం ఇది మొదటి సారేమీకాదు. ఉట్టిచేతుల్తోవచ్చి ఆశ్రయాన్ని కోరితే కాదనడం కష్టమేగాని తప్పనిసరి అయ్యేది.

ముసలితనం నూటికి తొంభైతొమ్మిదిమందికి శాపమే. శరీర భాగాలకు శక్తితగ్గిపోతుంది. దృష్టి మందగిస్తుంది. చెవుడు వస్తుంది. పళ్ళు వూడిపోతాయి. కూర్చున్నా నుంచున్నా కీళ్ళు పట్టేస్తాయి. ఇవన్నీ వయోధర్మం వల్ల వచ్చినా, ఇవికాక మరికొన్ని వ్యాధులు తోడైతే మరీకష్టం. రక్తపుపోటు, డయాబిటిస్, పక్షవాతం... బతికున్నంతకాలం కాళ్ళుచేతులు గట్టిగావుంటే ఫరవాలేదు. అలాకాకుండా జబ్బులపాలై, మరొకరి మీద ఆధారపడి బతకడం అంతదుర్భరం మరొకటుండదు. వయసు మళ్ళేటప్పటికి మారిన కాలంతో తాము మారలేక, పరిస్థితుల తగ్గట్టుగా సర్దుకుని ఇమడలేక ఈ కాలాన్ని ఈ కాలం మనుమల్ని తిట్టుకుంటూ తమ కష్టాలన్నిటికీ కారణం తమ చుట్టూవున్నవాళ్లే అని వూహించుకుంటూ బతకడం వారి మానసిక దౌర్బల్యం.

దైహిక అశక్తతతోబాటు, మనిషికి తను చేసే తప్పులవల్ల కలిగే నష్టాలు కొన్ని చేతిలో కాస్త డబ్బు, పెత్తనం వున్న రోజుల్లో ముందుచూపుతో నాలుగుడబ్బులు వెనకేసుకుంటే ముసలితనపు రోజులకి ఉపయోగపడతాయనే జ్ఞానం లేకుండా, ఆర్భాటాలు, ఖర్చులు విచ్చలవిడిగా చేస్తే చివరికి పిల్లల మీద ఆధారపడటమో, పిల్లలు సరిగ్గా చూడటంలేదని బాధపడటమో తప్పనిసరి అవుతుంది. తమమాటే జరగాలని పెద్దలు మొండిపట్టుదల పట్టడం, పిల్లలు ఎదురుతిరగడం, చిన్న చిన్న కారణాలకి తగువులు...ఇవన్నీ సంసారాల్లో ఎంతో అప్రియమైన సంగతులు. పెద్దలు కాస్త సర్దుబాటు చూపించినా, పిల్లలు వారికివ్వవలసిన గౌరవాన్నిచ్చి వారి మాటలని కాస్త ఓరిమితో విన్నా ఎంతశాంతి సౌజన్యాలు నెలకొంటాయి! రెండవబాల్యంలో ప్రవేశించినవారికి పిల్లలకి చూపినట్లుగానే కొద్దిపాటి ప్రేమాభిమానాలు చూపిస్తే ప్రతిగా వారు చూపే ఆప్యాయతవల్ల ప్రపంచం స్వర్గమయం అవదా!

అశోక్ అమెరికాలో ఓల్డ్ఏజ్ హోమ్కి వెళ్ళాడట. అక్కడవంటరితనంతో బాధపడే ముసలివాళ్ళు తమమాటలు ఓపిగ్గా వినే మనుమల కోసం ఎదురుచూస్తూ వుంటారట. ఆకారణంగా ఎవరైనా ఆసక్తివున్నవాళ్ళు వెళ్ళిగాని, టెలిఫోన్లోగాని మాట్లాడ్డానికి అవకాశం కల్పిస్తారట. అంటే వాళ్లని ఒంటరితనం ఎంత బాధిస్తుందో అర్థమవుతుంది.

యశోద తలనిండా రకరకాల ఆలోచనలు అల్లరిపెట్టి సన్నగా తలనొప్పి మొదలయింది

''నిద్రపోలేదా యశూ? ఇంకా ఆ ముసలతని గురించే ఆలోచిస్తున్నావా?'' అని అడిగాడు జగన్నాథం.

''ఎందుకో చాలా తలనొప్పిగా వుంది''

''ఇవాళ ఒంటిని మరీ హైరానాపెట్టేశావు. అందుకే ఈ అలసట... తలనొప్పి'' అంటూ లేచి లైటువేసి రెండు ఆస్ప్రోమాత్రలు, ఒక గ్లాసుడు నీళ్ళు ఇచ్చాడు.

జగన్నాథం చెతిమీద తలపెట్టుకుని పడుకుంది. అతను మృదువుగా తల ఒత్తుతుంటే ఎంతో హాయిగా వుంది. అప్పుడు తృప్తిగా అనుకుంది. ప్రేమగా చూసుకునే భర్త సాంగత్యం కంటే అదృష్టం ఏముంటుంది. కృష్ణుడు అర్జునుణ్ణి నీకు సైన్యమంతాకావాలా? నేనొక్కణ్ణే కావాలా అని అడిగినప్పుడు, అర్జునుడు సైన్యాన్ని వదులుకుని శ్రీకృష్ణుడొక్కణ్ణే కోరుకున్నాడు. అలా తననెవరైనా సుఖాలన్నీ ఒకవైపు, భర్త నొకవేపు వుంచి 'ఏం కావాలో కోరుకో' అనడిగితే

ప్రేమించే తన భర్తనే కోరుతుంది.

★ ★ ★

సంపెంగ చెట్టుకింద బెంచీలమీద కూర్చు న్న జనాలు ఐదారుమంది మంచి చర్చలో వున్నారు. క్రితంరోజు జరిగిన కార్యక్రమం గురించి చర్చ జరుగుతోంది.

"ఎంత గొప్పకళాకారుడు మన మోహనరావుగారు! ఆయన్ని పోషించలేకపోయారు మన ప్రజలు!"

"ప్రజలేంచేస్తారు? కన్నపిల్లలే తల్లిదండ్రుల్ని పోషించుకోలేని ఈ రోజుల్లో" వెంకట్రావు గారి మాటతో మళ్ళీ మామూలు సమస్యవేపే మళ్ళింది సంభాషణ.

ఆశ్రమానికి రోజూ వస్తుండే కేశవాచార్యులు గారు, "మీరంతా ఇక్కడెంతో ప్రశాంతంగా సుఖంగా వున్నారు. మా ఇంట్లో పొద్దున్న నేను పూజకి కూర్చుంటే చాలు, మా మనుమడొచ్చి, 'తాతయ్యా! మా ఫ్రెండ్సొచ్చారు. నువ్వింక మంత్రాలు మనసులో చెప్పుకో. గట్టిగా అరవ మాకు, నిమిషానికోసారి ఆ గంట వాయించకు' అని ఆజ్ఞాపిస్తాడు. వాళ్ళమ్మగాని, నాన్నగాని పిల్లవాడు ఇలా మాట్లాడుతుంటే సరిదిద్దరు. ఇక మాకోడలు అన్నంపెట్టిందంటే ఆ అన్నం అక్షింతల్లా వుంటుంది. చారు, పులుసు కారంమయం. నీళ్ళుపోసుకుని తింటాను. మన లాడు చాడీలు చెప్తున్నాడనుకోకండి, జరుగుతున్నది చెప్తున్నాను" అంటూ తన గోడు వెళ్ళబోసుకున్నారు.

ఇలాంటి మనుమలుకూడా వుంటారా అనుకుంది యశోద. తను మామగారికి మెత్తటిఅన్నం, కమ్మటి పప్పుకూరలు వండిపెడితే తృప్తిగా భోంచేసే వారు. 'మృష్టాన్నభోజనంలా పొగిడేవారు. గృహిణి అనబడే మనిషి ఇంట్లో పెద్దవాళ్ళకోసం ఆమాత్రం చెయ్యడం కష్టమా?

నాగమ్మగారి స్నేహితురాలు శంకరమ్మగారు చెప్పుకుంటూండిన సంగతి గుర్తొచ్చింది. ఇంట్లో ఇద్దరు కొడుకులు, కోడళ్ళు, ఆరుగురు మనవలు. ఇంతమందికీ చడీచప్పుడులేకుండా డ్యూటీగా కాఫీ చేస్తుందావిడ. ఆవిడకి ఫలహారాలు తినడమూ అలవాటులేదు, చేసే అవసరమూ లేదు. టిఫెన్లపని కోడళ్ళదే. మధ్యాహ్నం కాఫీ కలిపి కుంపటిమీద రెండు బొగ్గులుంటే దానిమీదే కాఫీ వెచ్చగా వుండటంకోసం మూతపెట్టి పెట్టుకుని పురాణానికి వెళ్ళొస్తుందావిడ. వెళ్ళొచ్చాక కాఫీ తాగడం ఆవిడ అలవాటు. అది తాగి మర్నాడు మధ్యాహ్నం వరకూ వుండాలి. ఒక్కోనాడు దానికీ మోసమే. పిల్లలు తాగేశారనో, ఎవరో వచ్చారు, ఇవ్వాల్సొచ్చి ఇచ్చేశామనో అంటారట. తమ భర్తల్ని కన్నతల్లి. ఆమెని కూర్చోబెట్టి సేవచెయ్యడం మాట అలావుంచి అరగ్లానుడు కాఫీకి కూడా కక్కుర్తేనా? సంకుచితత్వానికిపరిమితి వుండద్దా? రేపు వాళ్ళూ పెద్దవాళ్ళవుతారు, వాళ్ళకీ కోడళ్ళు, మనవలు వస్తారుకదా! అప్పుడు?

ఆలోచిస్తూ లోపలికి నడిచింది యశోద.

"ఎందుకమ్మా మొహం పీక్కుపోయినట్టుంది? ఒంట్లో బాగోలేదా?" అని నాగమ్మగారు కొంచెం ఆతృతతో అడిగారు.

"రాత్రి బాగా తలనొప్పి వచ్చింది. అంతే. ఇప్పుడేంలేదు. బాగానే వున్నాను"

"నిన్న తిరగడం ఎక్కువయిపోయింది, అందువల్లే అయ్యుంటుంది" అన్నారు వేదమ్మగారు.

"ఒక నిమిషం లోపలికి రావమ్మా" అని పిలిచి దిష్టితియ్యడానికి పిడికెట్లో ఉప్పుపట్టుకొచ్చారు నాగమ్మగారు. యశోద నవ్వేస్తూ-

"ఏమిటమ్మా మీ చాదస్తం. నాకు దిష్టి తగలడమేమిటి?" అంది.

"నిన్న నువ్వంత లక్షణమైన చీరకట్టుకుని ముచ్చటగా తిరుగుతుంటే నా చూపే ఎక్కడ తగులుతుందో అని అనుకున్నాను. అంత మంది జనాలొచ్చారుకదా ఎందరి చూపు పడుంటుందో" అని, ఏదేదో గొణుకుతూ ఉప్పు దిగదుడిచి తీసుకెళ్ళి నూతిలో పడేసి వచ్చారు.

ఆవిడ ఆప్యాయత చూస్తే యశోద గొంతులో ఏదో అడ్డుపడ్డట్టయింది. మనసు నిండిపోయింది.

"అమ్మా! నిన్ను చూడ్డానికెవరో వచ్చారు" అంటూ లోపలకొచ్చారు వెంకట్రావుగారు.

క్రితంరాత్రి వచ్చిన గృహస్థు ఆయన. ఖరీదయిన సూటు ధరించి వున్నారు. గేటుబయట అంబాసిడర్‌వుంది. యశోదని చూడగానే లేచి




# ఏరిన ముత్యాలు

★ మూర్ఖునితో సంభాషణ ఎప్పుడూ పెట్టుకోవద్దు. మూర్ఖునితో సంభాషణ సంభాషణే కాదు. అది నీకూ ఆనందాన్నియ్యదు, అతనికీ ఆనందాన్నివ్వదు.

— ఎర్ల్.ఆఫ్. ఛెస్టర్‌ఫీల్డ్

★ స్త్రీని స్త్రీగా గౌరవించడంకంటే స్త్రీ ఎక్కువగా ఏమీ కోరదు.

— బోవీ

★ ఏది తప్పో, ఏది ఒప్పో అంతరాత్మ చెబుతూనే ఉంటుంది. తెలియదనటం ఉత్త వంచన.

— చలం

★ హడావిడిగా, అర్థంచేసుకోకుండా వది గ్రంథాలు చదవటం కంటే అర్థంచేసుకుంటూ ఒక పేజీ చదవడం మంచిది.

— మెకాలే

★ ఇతరులపై పెత్తనం చెలాయించడానికి అధికారం సంపాదించిన వ్యక్తి మొదట తనపై తనకు గల ఆధిపత్యాన్ని కోల్పోతాడు.

— బేకన్

★ ఇతరుల గురించి చెప్పవలసివస్తే ప్రతివ్యక్తి గురించి అంతో ఇంతో తెలిసినంత వరకూ మంచిగూర్చి చెప్పడమే ధర్మం. మనలో ఒక్క లోపం ఉన్నా ఇతరుల లోపాలను ఎత్తిచూపే అర్హత మనకులేదు

—ఎల్బర్ట్ హబ్బర్డ్

★ నీ ప్రవర్తన విషయంలో నువ్వు శ్రద్ధ వహించు. గౌరవమర్యాదలు అవే నిన్ను వెతుక్కుంటూ వస్తాయి.

— డి.యల్. మూడే

★ చిన్న కన్నీటితో కూడిన చిరునవ్వు అత్యంత రమణీయంగానూ, కమనీయంగానూ వుంటుంది. హిమరహితమైన అరుణోదయం శోభాయమానంగా వుంటుందా? చిన్న కన్నీటితో కూడిన చిరునవ్వు మామూలు చిరునవ్వుకంటె అమూల్యమైనది.

--లాండర్

★ తన స్వంత ఆలోచన అభిప్రాయం లేకుండా ఇతరుల ఆలోచనపై ఆధారపడి, ఇతరుల అభిరుచులకు అనుగుణంగా వర్తించే వ్యక్తి బానిస.

-- క్లాప్‌స్టాక్

★ పని చేస్తానని మాటిచ్చేవ్యక్తి బాగా ఆలోచించి ప్రమాణం చేస్తే, అతడాపని నిర్వహిస్తాడనే అనుకోవాలి. అడిగీ అడగకముందే చేతిలో చేయివేసి ప్రమాణం చేసేవ్యక్తి వల్ల ఆ పని కాదనే అర్థంచేసుకోవచ్చు.

-- రూసో

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

నుంచుని "నమస్కారమమ్మా" అని పలుకరించారు. యశోదని చూశాక చిన్నబోయిన అతని ముఖంలో కొంచెం ధైర్యం వచ్చినట్లయింది.

అతని పేరు మనోహర్ మెహతా. కలకత్తాలో వుంటాడు. పెద్ద కంపెనీ ఒకదానికి మేనేజింగ్ డైరెక్టర్. డబ్బు, హోదా వుందనే గర్వంలేదు. వినయంతో కూడిన గాంభీర్యంవున్న మనిషి.

"మా అక్క ఇక్కడే కంటోన్మెంట్‌లోవుంది. ఒక్కతే వుంటుంది. మాతోనే కలకత్తాలో వుండచ్చు. చెబితే వినదు. తనలా ఒంటరిగా వుండటం నాకు పెద్దబెంగ అయికూర్చుంది. ఇక్కడకి తీసుకొచ్చి చేర్పించాలని..."

"అలాగే... ఎప్పుడు కావాలంటే అప్పుడు తీసుకురండి"

"తను అంత సులువుగా వచ్చే మనిషికాదు. ఈ కారణంగా మీకు కొంతశ్రమ కలిగిస్తున్నాను. ఈరోజు సాయంత్రం నేను కారు తీసుకునొస్తాను. మీరు, మీవారు వచ్చి ఆవిడకి నచ్చజెప్పాలి. నేనే తీసుకెళ్ళి పరిచయం చేస్తాను. మీరు శ్రమతీసుకుని ఈ ఉపకారం..."

"అలాగే వస్తా"

అతను సంతోషంగా లేచినుంచుని "సాయంత్రం ఐదున్నరకి వచ్చి తీసుకెళ్తాను" అనిచెప్పి వెళ్ళిపోయాడు.

అతనెప్పుడు వెళ్తాడా అని ఎదురుచూస్తున్న రాజారావు ఒక పుస్తకాన్ని తీసుకొచ్చి యశోదముందు కూర్చున్నారు. పెద్దపెద్ద కాగితాలు కొన్ని విప్పి ఆమెముందు పరిచారు. "ఇవి - కొత్తగా నాలుగు గదులు, రెండు గదుల కాటేజీలు రెండు,కట్టించడానికి వేసినప్లాను తాలూకు నకలు కాగితాలు" అని వివరిస్తూ చూపించారు.

యశోద కంగారుగా "ఈ ఆశ్రమాన్ని అంతంత భారీగా విస్తరింపచేయాలనే వుద్దేశం పెట్టుకోలేదు రాజారావుగారూ" అని చెప్పేసింది.

"మొత్తం ఇరవైఐదుమందిని చూసుకోగలిగితే చాలు. అక్కడికి ఆపేద్దాం. రోజూ ఎవరో ఒకరొచ్చి అడిగిపోతూనే వుంటారు. మొన్న





రామన్నగారు వుత్తరం రాశారు కదా!"

"అవును... ఆయన కొడుకు స్నేహితుడి తల్లిదండ్రులు అమెరికా రావడానికి ఇష్టపడటంలేదనీ, ఇద్దరూ వుండటానికి ఒక ప్రత్యేకమయిన కాటేజి ఏర్పాటుచేస్తే నెలకి రెండు వందల డాలర్లు పంపిస్తాడనీ...అయినా

ఆయన్నొకసారి అడిగి ఆలోచిద్దాం"

"నేను జగన్నాథరావుగారిని అడిగాను. లాభనష్టాల పేచీలు పెట్టకుండా ఇల్లుకట్టించి ఇచ్చే కంట్రాక్టర్ ఒకాయన తెలుసు. కనుక్కుని చెప్తానన్నారు"

యశోద ఆశ్చర్యంగా "అలాగా! ఆయన ఒప్పుకుంటే ఇంక ఆలోచనేముంది? అలాగే కానీండి" అంది.

సాయంత్రం కరెక్ట్‌గా తను చెప్పిన సమయానికి వచ్చేశారు మెహతా.

నాలుగున్నర మైళ్ళ దూరం. వెళ్తున్నంతసేపూ దారిపొడవునా సన్నగా జల్లుపడుతూనే వుంది. దారిలో ఆయన "మీరు మా అక్కని చూసేముందు ఆవిడగురించి తెలుసుకుంటే మంచిది" అనిఅన్నారు.

జగన్నాథం, "ఏ విషయమైనా స్పష్టంగా, ధైర్యంగా చెప్పండి. అది మాకెంతో సహాయపడుతుంది" అని చెప్పాక అతను కొంచెం మొహమాటంగానే మొదలుపెట్టాడు.

"సులోచన ఎనిమిదిమంది తోబుట్టువుల్లో అత్యంత సుందరరూపి. మంచిపొడవైన విగ్రహం, తామరరేకులవంటి నేత్రాలు, సూదైన ముక్కు, ముచ్చటైన చిన్న నోరు, అందమైన శరీరసౌష్ఠవం, అపురూపసౌందర్యవతి అనే పేరు తెచ్చుకుంది. ఆశ్చర్యకరమైన సంగతి ఏమిటంటే, ఎనిమిదిమందిలోనూ ఆమెకున్నలాంటి సౌందర్యం ఎవరికీలేదు. మిగిలిన అందరూ సాధారణ రూపంగలవారే. సహజసౌందర్యానికి వన్నెతెచ్చేలా అలంకరించుకునేది సులోచన గంటలకొద్దీ అద్దంముందే గడిపేది. ఆమె అందాన్ని ఆరాధించే రసికుడు భర్తగా లభించడం ఆమె అదృష్టం. సైన్యాధికారి కశ్యప్‌తో ఆమెకి ప్రేమ వివాహం జరిగింది. సైన్యంనుంచి రిటైర్ కాగానే . చిన్న ఇండస్ట్రీనొకదాన్ని ప్రారంభించారు. సులోచనకి సంసారంపట్ల పెద్ద

ఆసక్తి శ్రద్ధలేవు. పార్టీలకి వెళ్ళడం, తన ఇంట్లో పార్టీలు ఏర్పాటుచెయ్యడం క్లబ్బులు, ఇంకే వేవో సంస్థల కమిటీ మీటింగులంటూ వెళ్ళ డం, ఇవీ ఆమెకి ఆసక్తిగల విషయాలు. ప్రతిచోట ఆమె చేసేది తన రూప ప్రదర్శన మాత్రమే. ఎక్కడికి వెళ్ళినా అందరి దృష్టి తనమీదే వుంటుందన్న విషయం ఆమెకి తెలుసు. ఈ మనస్తత్వంగల ఆమెకి, తన తలలో మొదటి తెల్లవెంట్రుక చూడగానే వెర్రె క్కిపోయింది. మొదట దాన్ని పీకిపారేసి ఇంకె క్కడన్నా తెల్లవెంట్రుకలొస్తున్నాయేమో చూసు కుందుకి తలంతా గాలించేసింది. కళ్ళకింది మొదటిసారి నీడలురాగానే రకరకాల క్రీము లుతెచ్చి రాసుకుంది. హార్మోను ఇంజక్షన్లు, యోగాసనాలు, బ్యూటీపార్లర్లకి తిరగడం ఎక్కు వయిపోయింది. ఆమె తోటివాళ్ళు, ఆ వయసు వాళ్ళు ఎప్పుడూ, ఎవరూ ఆలోచించని తీరులో ఆలోచించడం మొదలుపెట్టింది. సౌందర్యసా ధనాలు అతిగా వాడటంవల్ల చర్మం ఇంకా త్వరగా, ఎక్కువగా ముడతలుపడింది. జుట్టు కి రంగులేసుకోడం మొదలుపెట్టింది. సత్యా న్ని స్వీకరించే ధైర్యం ఆమెకిలేదు. తనకి ఇప్పుడు అద్దం అంటే అసహ్యం. ఆమె గాయంమీద కారంచల్లినట్టుగా. భర్త కశ్యప్‌కి ఎంత వయసుమీరినా కుర్రతనపు ఛాయలు పోలేదు. నుదుటిమీద ఆటాడుకునే ముంగు రులు కొద్దిగా రాలాయిగాని, జుట్టుమాత్రం నెరవలేదు. భార్యపక్కన తమ్ముడేమో అని పించేలా వుండేవాడు. పిల్లలతో ఆవిడ సఖ్యత అంతంతమాత్రమే. తనకి మనుమలున్నారన్న విషయమే ఆవిడకి రుచించేదికాదు.

కశ్యప్ వున్నట్టుండి ఓనాడు గుండెపోటుతో మరణించాడు. అతని మరణానంతరం కొన్ని చేదునిజాలు బయటకి వచ్చాయి. అతను బతికి వున్నంతకాలం వ్యాపారం ఎంత నష్టంలో వుందో ఏనాడూ ఎవరికీ చెప్పలేదు. పిల్లలదారిన పిల్లలు సుఖంగా వున్నారు. వ్యా పారంలో అంతా నష్టమేనన్న విషయం స్పష్ట మయ్యాక ఆవిడ ఇంకా దెబ్బతిన్నది''

కారునొక ఇంటిముందు ఆపి ''ఇదే ఇల్లు'' అనిచెప్పారు మెహతా. కంటోన్మెంట్‌లో పూర్వకా లపు ఇల్లు. కాంపౌండునిండా స్వేచ్ఛగా పెరి గిన చెట్లు, లతలు, పొదలు. వరండాలో నాలు గు పాతకాలపు పేము కుర్చీలు. తలుపు తెరచే వుంది. మెహతా లోపలకి వెళ్ళొచ్చారు.

''వస్తోంది... కూర్చోండి'' అన్నారు.

అతను చెప్పిన వివరాలన్నీ సరిగ్గానే వున్నాయి. ఆవిడ కట్టుకున్నచీర పాతదే అయినా చాలా ఖరీదయినది. ఆవిడ వృద్ధాశ్ర మంలో చేరడానికి ఒప్పుకునే మనిషిలా అని పించలేదు. నువ్వు వృద్ధురాలివని వేలెత్తిచూ పించినట్టవుతోంది. అందుకే మెహతా యశో దతో ముందే ఒప్పందం చేసుకుని, ''ఈవిడే మాచెల్లెలు సులోచన. మీ వృద్ధాశ్రమంలో మీకు సహాయకురాలుగా పనిచేయాలనుకుంటున్నా రు'' అని పరిచయం చేశారు.

అంతవరకు తమతో తన అక్కగారని చె ప్పిన మనిషి చెల్లెలని పరిచయం చేస్తుంటే విస్తుపోయింది యశోద. బహుశా తనకి అంత వయసున్న తమ్ముడున్నాడన్న విషయం అందరికీ తెలియడం ఆవిడకి ఇష్టం వుండి వుండదు. అనుకుని మౌనంగా చేతులు జోడించి నవ్వింది యశోద.

''నేను జీతం తీసుకుని పనిచేసే బాపతుకా దు. సోషల్‌వర్క్‌గా చేస్తానంతే'' అంది.

''చాలా సంతోషం. మాకు కావలసిందీ అలాంటివారే'' అంది యశోద.

''కాఫీ, టీ, బాదంఖీర్... ఏంతీసుకుంటారు? ఇవాళేమో మా వంటవాడు, నౌకరు ఎవరూ రాలేదు. నేనే కలిపివ్వాలి'' అంది ఆవిడ.

''ఇప్పుడే కాఫీతాగి బయల్దేరాం. ఇప్పు డేంవద్దులెండి. థాంక్స్'' అంది యశోద. ఆమె ముఖంలో టెన్షన్ తగ్గి ప్రశాంతత నిండినట్ట యింది. మెహతా సులోచనని లోపలకి తీసుకె ళ్ళి కాసేపు మాట్లాడి వచ్చారు. యశోదకి ఈ కృత్రిమ వాతావరణంచూస్తే చికాగ్గా వుంది. ఈవిడగార్ని వానప్రస్థానికి తీసుకెళ్తే అక్కడ ఇమడగలదా, అక్కడ మిగతావాళ్ళని సు ఖంగా వుండనివ్వగలదా అనిపించిందామెకి. జగన్నాథం వైపు చూసింది. జగన్నాథం ధై ర్యం చెబుతున్నట్టుగా కనుసైగ చేశాడు.

తిరిగి వెళ్ళేటప్పుడు మెహతా ''సులోచనకి చెప్పాను. రావడానికి ఒప్పుకున్నట్టే. రేపు తీసు కొస్తాను. తనకి ప్రత్యేకంగా ఒక గది ఇచ్చేస్తే

వరి. తనకేదయినా నికరంగా ఇంత అని పని అప్పజెప్పండి. తోటపని, బట్టల మెయిన్‌టెయినెన్స్ వగైరా... ఇప్పుడావిడ ఉంటున్న ఇంటికి ఇంక అద్దె ఇవ్వనవసరం లేదుగనుక, అదీ దానిపైన మరో రెండుమూడువందలు కలిపి ప్రతినెల మీకు అందేలాచూస్తాను. నేను, ఆవిడ కొడుకు ఎలాగో మేనేజ్ చేస్తాం. కాని ఆ విషయం మాత్రం ఆమెకి తెలియకూడదు"

"కొడుకు అంటున్నారు, కొడుకుతో వుండచ్చుగదా!"

"ఇందాకనే చెప్పానుకదా! అదో విచిత్ర స్వభావం. అంత పెద్దకొడుకు తనకున్నాడన్న భావనే నచ్చదావిడకి. అదీగాక కోడలు చాలా అందంగా వుంటుంది. ఆమె రూపం, యవ్వనం చూస్తే ఈమెకి అసహనం"

"విచిత్రం!" అనుకుంది యశోద. ఎవరైనా సెల్ఫ్ సెంటర్డ్ అయ్యుండచ్చు. తను, తన రూపం అనే అహంకారం వుండొచ్చు. కాని తన స్వంత కుటుంబంలో మిగిలిన సభ్యులవట్ల అసహనం చూపిస్తే ఎలా? మొదట్నుంచి వేరే విషయాల్లో, వ్యాపకాల్లో ఆసక్తి పెంపొందించు



కుంటే ఇలా జరిగేదికాదు. వయసు పెరిగేకొద్దీ రూపం, శక్తీ తరగడం సహజం. అందుకని ఇలా పిచ్చిపిచ్చిగా తయారయితే ఎలా?

ప్రకృతి కూడా వృద్ధులపట్ల చాలాక్రూరంగా వ్యవహరిస్తుంది. వయసు మళ్ళినంతమాత్రాన చర్మం ముడతలు పడటం, పళ్ళు వూడిపో వడం, కంఠం వణకడం, ఆరోగ్యాలు చెడి పోడం ఇవన్నీ ఎందుకు జరగాలి? బతికు న్నంతకాలం దృఢంగా వుంటే వృద్ధాప్యంలో మరొకరిమీద ఆధారపడి బతికే దురవస్థ తప్పుతుంది కదా! మునలితనంలో వచ్చే ఇబ్బందుల్ని తప్పించుకుందుకు వైజ్ఞానికులె వరూ ఏమీ కనిపెట్టలేదా? పురాణాదుల్లో ఎవ రూ నమ్మలేనటువంటి విషయాలున్నాయి మరి. యయాతి తన వార్థక్యాన్ని పురూరవుడికి చ్చి తను యవ్వనాన్ని పొందుతాడు. సుకన్య పాతివ్రత్య మహిమవల్ల వృద్ధుడైన చ్యవనమ హర్షి యువకుడౌతాడు. ఆకాలంలో అవన్నీ సాధ్యమైతే ఈ కాలంలో మాత్రం ఎందుకు సాధ్యంకావు?

తన అనుమానాలన్నీ కొడుకుముందు వెళ్ల బోసుకుని "మీ సైన్స్ ఈ విషయంలో ఏమంటుంది ప్రతాప్?" అనడిగింది.

"నా సబ్జెక్టు అదికాదుగాని, ఆశ్రమంలో మునలి వాళ్లందర్నీ చూస్తే నాకూ ఆ విష యంలో ఆసక్తి పెరిగి నేనూ ఈ విషయంలో కొంత స్టడీ చేశాను. నాకు తెలిసినంతవరకూ చెప్తాను. వృద్ధాప్యానికి సైన్సు ప్రకారం ఎన్నో కారణాలున్నాయి. దేహంలో అన్ని అంగాల్లోనూ కణాలు, కణసముదాయాలు క్రమేణా నశించడం వల్ల వచ్చేదే వృద్ధాప్యం. ఇది శరీరం బయట , లోపల జరిగే ఒత్తిడు లవల్ల కలిగే మార్పు. మానసికమైన జంజాటా లవల్ల శరీరం కొంత నలగడంతోబాటు, అనారో గ్యాలవల్ల కొంత కృశిస్తుంది. అవయవాలను విరామం లేకుండా వాడటంవల్ల కణజాలం అరిగిపోయి నాశనమవటంవల్ల సాధారణంగా వృద్ధాప్యం వచ్చేసరికి దైహికమైన చైతన్యం, మానసికమైన చైతన్యం కూడా తగ్గుముఖం పడతాయి. పరిశోధకుల అభిప్రాయం ఎంజై మ్స్, హార్మోన్స్ శరీరంలో తగ్గిపోతే శక్తి సామర్థ్యా లు కూడా తగ్గి వృద్ధాప్యం వస్తుందని వృద్ధాప్యం గురించి 'జెరంటాలజీ' అనే సబ్జెక్ట్ ఉంది. వార్థక్యపు అసౌకర్యాలని రూపుమాపడానికి కావల్సిన ఔషధాల్ని కనిపె ట్టాలని శాస్త్రజ్ఞులు ప్రయత్నిస్తూనే ఉన్నారు."

"ఫరవాలేదే...పెద్ద ఉపన్యాసమే ఇచ్చావు!" అని నవ్వింది.

సులోచన గురించి ఆలోచిస్తూ నిద్రపో యింది యశోద. రాత్రి ఒక పొద్దులో మెలకువ వచ్చింది. తరువాత ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. కిటికీలోంచి నక్షత్రాలతో నిండిన ఆకాశం కనిపిస్తోంది. తెల్లటి మబ్బు తునకలు అందంగా దూదిపింజెల్లా అలవో కగా గాలికి కదిలి జరిగిపోతున్నట్లున్నాయి. పక్కనే పడుకుని ఉన్న జగన్నాథం గాఢని ద్రలో ఉన్నాడు. ఒకపక్కనుంచి చూస్తే అచ్చు ప్రతాప్‌లాగే ఉన్నాడు. తమ పెళ్ళయినవుడు అతడికి అశోక్ అంత వయసుండి ఉంటుంది. మొదటిసారి దీపావళికి తమ ఇంటికి వచ్చిన పుడు అచ్చు ప్రతాప్‌లాగే ఉండేవాడు. తన కింకా అప్పటికి పదిహేనో, పదహారో! జగ న్నాథం తనకి చెయ్యిచూడ్డం వచ్చని చెప్పి తన చేతిని అతడి చేతిలోకి తీసుకుని ఒక్కొక్క గీతకి ఒక్కొక్క ఫలితం చెప్పాడు. తను అదంతా నిజమేననుకుంది. ఆ సంగతే అన్న య్యకి చెబితే అన్నయ్యగట్టిగా నవ్వేశాడు. ఆ సంగతి తెలిసిన జగన్నాథం ఇటువంటి విష యాలన్నీ ఇంకోళ్ళకి చెప్పకూడదని మంద లించాడు. ఇవాళెందుకో ఇవన్నీ గుర్తొస్తు న్నాయి. ఏమీ ఎరుగని ముగ్ధని ఏ మాత్రం బలవంతం చెయ్యకుండా మెల్లమెల్లగా ప్రేమ తోటే తన వశంచేసుకున్నాడు. అవన్నీ తలు చుకుంటూంటే అతడివల్ల ఎక్కడలేని ప్రేమ ఉబికివచ్చింది. మెల్లగా కళ్ళుమూసుకుని నిద్రపోవడానికి ప్రయత్నించింది. దూరంగా ఎక్కడో పిల్లులు దెబ్బలాడుకుంటున్న శబ్దం. యశోదకి ఎందుకో వాంతి వచ్చినట్లయిలేచి నీళ్ళగదిలోకి వెళ్ళింది.

★ ★ ★

యశోద అనుకున్నట్లుగా సులోచన 'వానప్ర స్థంలో' సమస్యకాలేదు. మిగిలిన ఆడవాళ్ళతో అంతగా కలిసేది కాదు అంతే! యశోద సలహాప్రకారం రాజారావుగారు సులోచనకి కొ న్ని పనులప్పజెప్పారు. ఆవరణలో విడి కాటే

జెన్ కట్టిస్తుండటంవల్ల కావలసినంత వనుంది. వాటిపై పర్యవేక్షణ, పత్రికలు అవీ చదవడం, నరసింహయ్యలాంటివాళ్ళతో బ్రిడ్జ్ ఆడటం వగైరా పనులు చేసేది. ఉన్నట్టుండి ఒంటరిగా కూర్చోడం లేదా అద్దంముందు గంటలకొద్దీ కూర్చుని అలంకరించుకోవడం చేసేది. దీనివల్ల ఎవరికీ ఏమీ ఇబ్బంది ఉండేది కాదు.

ఓరోజు యశోద ఆశ్రమానికి వెళ్లేసరికి సులోచన పనివాళ్ళతోబాటే వుంది... ఇంకా పునాదులవనే జరుగుతోంది. యశోదని చూసి, "ఇవి పూర్తయ్యాక నాకూ ఒక ఇండిపెండెంట్ కాటేజ్ కట్టించి ఇచ్చెయ్యండి. వెనుకవైపు కూడా చాలా చోటుంది కదా! ఇలాంటివి ఐదారు కట్టించి ఇవ్వచ్చు" అంది.

"బాగుంది ఐడియా, అలాగే చేద్దాంలెండి" అని యశోద పునాదులకోసం తవ్విన భాగాన్ని చూసింది. చిన్న వరండా, హాలు, పడగ్గది, వంటిల్లు, నీళ్ళగది- అన్ని సౌకర్యాలతో చిన్న ఇల్లు. ఈ రెండిళ్ళలో ఒకటి పిల్లల్లేని వృద్ధ దంపతులకు, మరొకటి కొడుకు దూరదేశాల్లో ఉండటంతో ఇక్కడే స్థిరంగా ఉండదల్చుకున్న నాయుడు దంపతులకు కేటాయించారు వాళ్ళు. నంసారం తాలూకు బాదరబందీలు లేకుండా, ప్రశాంతంగా, నిశ్చింతగా బతకదల్చుకుని చేసుకున్న ఏర్పాటది. తెల్లవారితే పాలవాళ్ళు, పనివాళ్ళు అని మొదలై ఇంటికి సామాన్లు, చాకిరీ అన్నీ చేసుకోవల్సిందేగా. ఇంక ఇల్లు అన్నాక బంధువులు, స్నేహితులు-వారి రాకపోకలు. ఆపనులన్నీ నిభాయించలేక ఈదారి చూసుకున్నారు. ప్రస్తుతం హోటెల్లో ఉన్నారు. ఇల్లు పూర్తవగానే గృహప్రవేశం చేస్తారు.

...ఉన్నట్టుండి యశోదకి కళ్ళు చీకట్లు కమ్మినట్టయింది. అక్కడే ఉన్న ఒక నాపరాయిమీద కూర్చుండిపోయింది. అరనిమిషంలో సర్దుకుంది. కొద్ది దూరంలోవున్న సులోచన ఇదేమీ గమనించలేదు. ఒక నిమిషం అక్కడే కూర్చుని తేరుకున్నాక ఇంటికొచ్చి పడుకుంది శరీరస్థితిలో ఏదో మార్పుందని అర్థమయింది. యశోద. డాక్టర్‌ని చూడ్డం మంచిదనుకుంది.

యశోదని పరీక్షించిన డాక్టర్ ప్రభు స్వతహాగా ఎప్పుడూ నవ్వుమొహంతో ఉంటాడు. ఆ రోజు ఆయన మొహం ఎందుకో గంభీరంగా ఉంది. "అన్నీ వివరంగా పరీక్షలు చేయించుకోవాలి. నేను జగన్నాథరావుగారితో మాట్లాడతానుగాని ప్రస్తుతం ఈ మాత్రలు తీసుకుంటూండండి" అని రెండురకాల మాత్రలని రాసిచ్చారు. జగన్నాథాన్ని లోపలకి పిల్చి తన కొచ్చిన అనుమానాన్ని చెప్పి, వెంటనే డాక్టర్ శివానందంగారిని చూడమని సలహా ఇచ్చాడు.

జగన్నాథం ఇంటికొచ్చి "ఎన్నాళ్ళ నుంచి ఇలా వుంది? నాకేమీ చెప్పలేదెందుకని?" అని అడిగాడు.

'ఎందుకింత కంగారీయనకి' అనుకొంటూ యశోద, "ఒకటి రెండు రోజుల్నుంచి అంతే! ఇప్పుడేమయింది?" అంది. మెరిసే ఆమె కళ్ళనే చూస్తున్న జగన్నాథం కొద్దిగా సమాధానపడి "ఏమీ అవలేదనుకో, అయినా ఒంట్లో బాగాలేకపోతే నాకు చెప్పద్దా"అని అన్నాడు.

మొదటిపరీక్షల రిపోర్టులు చూసి డా॥ ప్రభు తనే డా॥ శివానందంగారికి ఫోన్‌చేసి అప్పాయింట్‌మెంట్ తీసుకొన్నాడు.

రాత్రంతా జగన్నాథం నిద్రపట్టక అటు ఇటు పొర్లడం యశోదకి తెలుస్తూనేవుంది. 'ఈయన ఇంత తలకాయ పాడుచేసుకోవల్సినంత సమస్య ఏమొచ్చిందని? తను ఆరోగ్యంగానే ఉందికదా! ఇప్పుడేదో కాస్త తేడా చేసిందనుకో, అయినా ఈకాలంలో ఏ అనారోగ్యమయినా నయం చేసేందుకు మందులొచ్చాయి. డాక్టర్లు ఎంతో తెలివయినవాళ్ళు. ఈయన ఇంత బెంగపెట్టుకోడం అనవసరం. అనలు తనకేమొచ్చినా ఈయనింతే...' అనుకుంది.

పొద్దున్నే అందరూ కలిసి కూర్చుని కాఫీలు తాగుతున్నారు. యశోద మెల్లగా...చాలా మెల్లగా తాగుతోంది. తనెందుకు ఇన్నాళ్ళూ గమనించకుండా వుండిపోయాడు అనుకుంటూ ఆమెనే చూస్తున్నాడు జగన్నాథం.

డా॥ శివానందంగారు యశోదను పరీక్షించి, ఇంటికి వెళ్ళనివ్వకుండా నర్సింగ్‌హోంలోనే వుండిపొమ్మని వెంటనే రక్తహీనతకి చికిత్స మొదలుపెట్టారు.

మధ్యాహ్నం వళ్లరసం తీసుకుని ప్రతాప్ వచ్చాడు. అతడిని చూసి ఆమె ముఖం వికసించింది.

"వచ్చావా ప్రతాప్! కాలేజీకి వెళ్ళలేదా?"

"వెళ్ళొచ్చానమ్మా పొద్దున్న రెండు అవర్స్ జరిగాయి"

"చూడూ ప్రతాప్, నాకేం మహా జబ్బుని నర్సింగ్‌హోంలో వుండాలిచెప్పు. మీ నాన్నగారు ఏదీ సరిగ్గా మాట్లాడరు. అన్నింటికీ కంగారే"

ప్రతాప్‌కంతా తెలిసింది. బేరియం ఎక్స్‌రేలో అన్ననాళంలో కేన్సరన్న సంగతి తెలిసిందట. అదే సంగతి జగన్నాథం కొడుక్కి చెప్పాడు. తెలిసి నిర్ఘాంతపోయాడు ప్రతాప్. "ఓహ్ నో! ఇది అబద్ధం!' అనుకున్నాడు. అబద్ధమవ్వాలని ఆశించాడు జగన్నాథం కొడుకు తలనిమురుతూ,

"ఇది అబద్ధమైతే ఎంత బాగుండును" అన్నాడు. కూర్చుని ఏడ్చాడు. ఇప్పుడుమాత్రం నవ్వడానికి ప్రయత్నిస్తూ, "బెడ్‌రెస్ట్ కావాలంటే ఇక్కడే కదమ్మా దొరికేది! ఇంటికొస్తే నువ్వొక్కనిమిషమైనా కూర్చుంటావా?" అన్నాడు.

వళ్ళరసాన్ని గ్లానులోకి వంచి మంచంమీద తననానుకుని కూర్చున్న ప్రతాప్‌ని ముద్దుగా చూసింది యశోద. తనకంటే పొడుగైపోయాడు. అయినా ముఖంలో పసితనం పోలేదు ఒక్కోసారి దగ్గరకు తీసుకుని ముద్దాడాలనిపిస్తుంది.

"ఇక్కడింకా ఎన్నాళ్ళుండాలట?"

"ఎనిమిదిరోజులన్నారు"

ఆమె గాఢంగా నిట్టూర్చింది.

రాత్రికి జగన్నాథం వచ్చాడు.

అప్పుడతనితో అంది! "ఎనిమిదిరోజులు ఇక్కడుండాలంటే విసుగునాకు. కావాలంటే ఇంట్లో ఇరవైనాలుగ్గంటలూ పడుకునే వుంటాను. రేపు తీసుకెళ్ళిపొండి" అంది.

జగన్నాథం ఆమె చేతిని తన చెంపకానించుకొని లాభంలేదన్నట్టు తల అడ్డంగా ఆడించాడు.

"ఏం... నాకేమయిందని?" అని అడిగింది

వెంటనే జవాబివ్వలేదతడు. నిదానంగా

"నీకు ఈ నీరసం, అన్నం సహించకపోవడం, ఇవన్నీ ఎన్నిరోజుల్నుంచి? సరిగ్గా చెప్పు"

"మూడు నాలుగు నెలలనుంచి"

"నాకెందుకు చెప్పలేదు?"

యశోద అతని చూపుల్ని తప్పించుకుంది.

చిన్న చిన్న విషయాలన్నీ పెద్దవిగాచేసి అతడికి చెప్పే అలవాటు ఆమెకేనాడూ లేదు. అలాచెప్తే ఆయన, ప్రతాప్ వూరికే దిగులుపడతారని చెప్పలేదు. యశోద ఆమాట తప్పించి "అశోక్‌నుంచి ఈ పాటికి ఉత్తరం రావల్సింది ఏమయినా వచ్చిందా?" అనడిగింది.

"లేదు రేపటెల్లుండిల్లో రావచ్చునేమో"

నీరసంగా వున్న అతడిగొంతు, దిగులు నిండిన కళ్ళు... అతడు చెప్పలేకపోతున్న సంగతి దేన్నో చెప్తున్నట్టు ఆమెకనిపించింది. ఒకరకమైన నిస్సహాయత ఆమెనావరించింది. ఇప్పుడు తనకి ఆసరాకావాలి. జగన్నాథం ఒడిలో తలపెట్టుకుని పడుకోవాలి. అతని గుండెల్లో తలదాచుకుని–

"ఇదిగో, నేను రేపు ఇంటికొచ్చేస్తాను... మీ ఇష్టం మరి" అంది.

జగన్నాథం లేచి నుంచుని "ఎనిమిది రోజులు అంతే! నేనింక బయల్దేరుతున్నాను. రేపు పొద్దున్నే వచ్చేస్తాను" అని చటుక్కున వెళ్ళిపోయాడు.

నర్సింగ్‌హోంలో ఒక నెల్లాళ్ళు వుండకతప్పలేదు. రేడియేషన్ చికిత్స జరిగాక బాగా ఆరోగ్యం పుంజుకున్నట్లున్న యశోదని ఇంటికి తీసుకొచ్చారు.

ఆరోజు అశోక్ ఉత్తరం వచ్చింది. తల్లి అనారోగ్యం గురించి అతడికేమీ తెలియదు. తను పెళ్లి చేసుకుందామని అనుకుంటున్న శుభవార్తని తెలియబరుస్తూ రాశాడు. ఆమె తల్లిదండ్రులు ఇరవై సంవత్సరాల నుంచి అక్కడే అమెరికాలోనే వున్నారు. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవడంవల్ల తనకి సులువుగా అమెరికన్ సిటిజన్‌షిప్ దొరుకుతుందనే ఆశని కూడా వ్యక్తం చేసాడు. అశోక్ ఎంత పెద్దవాడయిపోయాడు! అని విస్మయం కలి




గింది యశోదకి. తనకి కోడలొస్తుందనే సంతోషం కలిగినప్పటికీ అతను ఆ దేశంలోనే స్థిరపడాలనుకుంటున్న విషయం మటుకు ఆమెకి రుచించలేదు. జగన్నాథం ఈ వార్తని చాలా తేలిగ్గా తీసుకున్నాడు. ఉత్తరంలోని సారాంశాన్ని చెప్పినప్పుడు ఏదో పుస్తకాన్ని తిరగేస్తూ—

"ఏమిటి పెళ్ళా? మంచిది. చాలా సంతోషం. అక్కడే సెటిలవుతాడా? కాన్లే, వాడి ష్టంవాడిది"

ఇదేమిటి ఇంత నిర్లిప్తంగా మాట్లాడతారు అని ఆశ్చర్యపోయింది యశోద. అంతలో అత డామె వేపు తిరిగి "ఒకసారి వచ్చి వెళ్ళమని రాయనా?" అని అడిగాడు.

"వద్దులెండి ఓసారి వచ్చి వెళ్ళడమంటే బోలెడంత ఖర్చు"

"ఖర్చు సంగతలా వుంచి నీకేమనిపిస్తోందో చెప్పు"

"పెళ్ళయ్యాక ఇద్దర్నీ కలిసి వీలైనప్పుడు ఒకసారి రమ్మని రాయండి." అంది

—★ ★ ★

కాటేజీల పునాదులు పూర్తయి గోడలు లేచాయి. దాన్ని దాటి లోపలికొస్తూ

'వీళ్ళందర్నీ చూసి ఎన్ని రోజులయిపో యింది.' అనుకుంది యశోద

ఆస్పత్రిలో వున్నప్పుడు చూడ్డానికెవరూ రానేలేదు. ఎవరూ రాకూడదని జగన్నాథమే ఆదేశించాడు. అంతా వయసుమళ్ళినవాళ్ళు భావోద్వేగంతో ఏం మాట్లాడతారోనని జగ న్నాథం భయం.

యశోద ఆశ్రమంలో అడుగు పెట్టగానే అంతా పలుకరించడానికొచ్చేశారు.

నాగమ్మగారు "ఇంకో నాలుగురోజులు విశ్రాంతి తీసుకోకపోయావామ్మా. ఎందుకంత కంగారుగా వచ్చేశావు?" అని అన్నా యశోదని చూసి ఆనందాన్ని దాచుకోలేకపోయారు.

నాగప్పగారు వేడివేడి కాఫీ కలిపి తెచ్చిచ్చా రు. కాదంటే నొచ్చుకుంటారని కొద్దిగా చిన్నగ్లా సులోకి ఒంపుకుంది. భాగీరథమ్మ, నరసింహ య్య అంతా చుట్టూ చేరారు. అందరితో మాట్లా డుతూ కూర్చుంటే ఆమెకి వేళ తెలియలేదు.

ఒంటిగంటకి జగన్నాథం వచ్చి ఇంటికి తీసుకెళ్లాడు.

"ఇంతసేపు వుండిపోయావేమిటీ? వేళకి సరిగ్గా మందులు, టానిక్కు తీసుకోవాలని డాక్టరుగారు చెప్పలేదా?" అని మందలించాడు. యశోద నవ్వేసింది. "శుభ్రంగా రాయిలా వున్నాను నాకెందుకు మందులు? నాకేం నీరసంగా లేదిప్పుడు" అంది.

మధ్యాహ్నం ఇంట్లోనే వున్నాడు జగన్నాథం. ఏదో క్లిష్టమైన కేసు గురించి చదవాల్సివుంది. పుస్తకాలని ముందు పెట్టుకున్న అతడి కళ్ళు మసకబారాయి.'తను ఆరోగ్యంగానే వున్నాననుకుంటోంది పాపం. ఇంక రెండువారాల్లో ఆపరేషన్ చేస్తానన్నారు డాక్టరుగారు. జబ్బు ఏస్టేజీలో వుందో ఆమెకి తెలియదు. ఒకవేళ తెలిసి బయటపడకుండా వూరుకుందో', అనే ఆలోచనలో మునిగిపోయాడు జగన్నాథం.

వెనుకనుంచొని ఎంతసేపట్నుంచో గమనిస్తున్న యశోద "పుస్తకాలు ముందుపెట్టుకుని ఏమిటంత ఆలోచన?" అని అడిగింది.

జగన్నాథం"ఏదో కేసుగురించి" అన్నాడు.

"అదేమిటో నాకు తెలుసు. . చెప్పనా?" అంది.

వద్దని సైగచేశాడు జగన్నాథం. మరుక్షణం అతడి బాహుబంధంలో ఒదిగిపోయింది యశోద. ఇద్దరూ అన్నాళ్ళనుంచి అదిమి వుంచుకున్న భావనలన్నీ భళ్ళున బ్రద్దలయ్యాయి. మొదటిసారి బెదురుబెదురుగా, అనుమానంగా తన చెంతచేరిన యశోదకూ, ఈ యశోదకీ తేడా కనిపించలేదతడికి.

యశోద వెక్కుతూ "మిమ్మల్ని వదిలివెళ్ళడం నాకేమాత్రం ఇష్టంలేదు" అంది.

ఆమెని గాఢంగా హత్తుకుంటూ "వదిలిపెట్టేదెవరట" అన్నాడు.

★ ★ ★

యశోదని నిరంతరం ఏవో ఆలోచనలు చుట్టుముట్టేవి. 'తను చనిపోతానని తెలుసుకున్న మనిషి ఏంచెయ్యొచ్చు? ఆస్తిపరులయితే విల్లురాయొచ్చు. వయసుమళ్ళినవాళ్లయి, పెళ్ళికెదిగిన పిల్లలుంటే వాళ్లకి పెళ్ళిళ్ళు చేసెయొచ్చు. ఇష్టంఉంటే దానధర్మాలు, దైవకార్యాలు చేయొచ్చు. తనకయితే మనసుకేమీ తోచటంలేదు. తనకనిపించేదొకటే. తను బతకాలి. ఇంకా కొన్నేళ్ళు బతకాలి. అలాకోరుకున్నంతమాత్రాన తనకేమన్నా స్వచ్ఛందమరణం రాసిపెట్టుందా? ఈమధ్య చదివిన ఒక పుస్తకంలో సంఘటన గుర్తొచ్చింది. యాజ్ఞవల్క్యుని తల్లి ,అలంబినీదేవి ముత్తైదువగా మరణించాలనుకుంటుందిఅలాగని భర్తని లోకంలో ఒంటరిగా విడిచిపోదల్చుకోలేదు. అందుకే భర్త మరణానికి ఒక క్షణం ముందు తన మరణం సంభవించాలి అని వరంకోరుకుందట.

తనకీ ఎవరైనా అలాంటి వరమిస్తే బాగుండును. ఆకాలంలో ఇవన్నీ జరిగేవట. అదే నిజమైతే వాళ్ళెంతో అదృష్టవంతులు. తనకెవరివ్వగలరు వరాలు? ఏదేవతలూ సాయంచేయ్యరు. ఏ మొక్కులూ ఫలితాన్నివ్వవు. ఎంత డబ్బు ఖర్చుపెట్టినా తన వ్యాధింతే. నయమవదు, ఆయుష్షు పెరగదు.

చావుని ఇంతసమీపంలో వుంచుకుని దాని గురించి ఆలోచించాల్సిన పరిస్థితి ఎంతబాధాకరమైనది. మృత్యువుని తనకళ్ళారా చూసింది. మనిషికి చావు తప్పదన్న సంగతి తనకి తెలుసు. తన మామగారిలా సంపూర్ణంగా, ఆరోగ్యంగా బతికి బాధ్యతలు సవ్యంగా పూర్తిచేసి అనాయాస మరణాన్ని పొందేవారు అదృష్టవంతులు. తనకిప్పుడీ జబ్బు ఎందుకురావాలి? ఇప్పుడు తను మరణిస్తే జగన్నాథం దిక్కులేనివాడవుతాడు. అశోక్, ప్రతాప్ అంటే పెళ్ళిళ్ళు చేసుకుంటారు, పిల్లలు పుడతారు. వాళ్ళ జీవితం వాళ్ళది. జగన్నాథం పరిస్థితేమిటీ? అతడిని వదిలివెళ్ళడం తనకిష్టంలేదు. ఇంకా కొన్నేళ్ళు బతికితే బాగుండును"

జగన్నాథం ఆలోచనలు మరోవిధంగా ఉండేవి. బొంబాయిగాని, నెల్లూరుగాని తీసుకెళ్తే బాగుంటుందా? లేక నరసింహయ్యగారు చెప్పినట్టు అమెరికాకే తీసుకెళ్తే బాగుంటుందా? అక్కడయితే అటు అశోక్ ఉన్నాడు, ఇటు రామన్నగారుఉన్నారు. ఏ ఏర్పాట్లు కావాలన్నా వాళ్ళు చేస్తారు. ఇవన్నీ ఆలోచించి ఒక నిర్ణయం తీసుకొనేటంత వ్యవధి దొరకలేదు జగన్నాథానికి. ఒక రాత్రి





జగన్నాథం నిద్రపట్టక కళ్ళు మూసుకునే ఆలోచిస్తూ పడుకున్నాడు. అతన్ని తట్టి లేపింది యశోద. "నాకేదో భయంగాఉంది. కడుపులో కోస్తున్నట్టుగావుంది" అంది. తక్షణం లేచి నర్సింగ్‌హోంకి బయల్దేరారు.

ప్రతాప్‌ని లేపి తలుపువేసుకోమన్నాడు.

"నేనూ వస్తాను నాన్నా" అని తలుపుతాళం పెట్టి వాళ్ళతోటే బయల్దేరాడు ప్రతాప్.

"సీరియస్‌కేను. ఆపరేషన్‌చేసినా బతకడం అనుమానమే. అయినా ప్రయత్నిస్తాం" అని వైద్యులు ముందుగానే చెప్పేశారు. జగన్నాథం బేలమొహంచూసి, "ధైర్యంగా ఉండండి, వుయ్‌విల్ ట్రై అవర్ బెస్ట్" అని అతడి భుజం తట్టారు. తెల్లవారగానే ఆపరేషన్ అని నిర్ణయించారు.

వానప్రస్థానికి వార్త చేరింది. రాజారావుగారు వచ్చి జగన్నాథానికి తోడుగా వుండిపోయారు. మిగిలినవాళ్ళకి అక్కడకి రావాలని ఆతృత. వానప్రస్థంలో ఉన్న వాళ్లందరు ఆ రోజు యశోద కోసం ప్రార్థిస్తున్నారు. వృద్ధులైన తమనందర్నీ వదిలేసి యశోద వెంట వడ్డ మృత్యువుని శపిస్తున్నారు. "మనంతట మనం చావుని కోరుకోకూడదంటారు. కాని ఇవాళ యశోదని వుంచి నన్ను తీసుకుపోతానంటే నేను పోతాను" అని కళ్ళు తుడుచుకుంది నాగమ్మ.

"భూమికి బరువుగా నేను బతికి వున్నాను. బతికి సుఖపడాల్సిన వయసు, ముచ్చటైన సంసారం! ఎవరి పాపిష్టి కళ్ళు వడ్డాయో" అని ఏడ్చింది భాగీరథి. అందరికీ యశోదను గురించి దిగులు, దుఃఖం.

"మృత్యుంజయ జపం, నవగ్రహపూజా చేయిద్దాం" అన్నారు వెంకటరావుగారు.

నరసింహయ్య, మోహనరావుగారు మాటలు రానట్టు నిర్ఘాంతపోయి కూర్చున్నారు. వేదమ్మ రామనామం జపిస్తూ భగవంతుణ్ణి ప్రార్థిస్తోంది.

తన పరిస్థితి తనకి బాగా అర్థమైంది. యశోదకి. క్లిష్టమైన ఆపరేషన్ ఈ డాక్టర్ గట్టివాడే. తనని బతికించినా బతికించచ్చు. ఈసారి బయటపడితే ఇంకా నాలుగేళ్ళు ఫరవాలేదట. చాలు, నాలుగేళ్ళు చాలు. ఇప్పుడే పోవడం కంటే నయమేగా? కాని ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు?

పొద్దున్నే ప్రతాప్, జగన్నాథం అక్కడికి వెళ్ళేటప్పటికి కొద్దిగా తేరుకుంది యశోద. జగన్నాథం దగ్గరగా వెళ్ళి "నిద్రపట్టిందా?" అని అడిగాడు.

యశోద బాగానే నిద్రపోయింది. జగన్నాథమే రాత్రంతా మేలుకుని వున్నది. ప్రతాప్ ఒక కవరు తీసి దాన్లోంచి ఒక ఫోటోని తీసి యశోదకి చూపించి, "అశోక్ ఫ్రెండ్ ద్వారా పంపించాడు. ఇవాళ పొద్దున్నే తెచ్చిచ్చాడతను" అని చెప్పాడు.

పెద్దకారు ముందు అశోక్, అతని కాబోయే భార్య నుంచున్నారు. చిన్న ఫోటో. వివరాలు స్పష్టంగా లేవు. నవ్వుతూ పువ్వులా వున్న ఆ పిల్లని చూసి, "బాగుంది" అంది యశోద.

"ఒరేయ్ ప్రతాప్! అశోక్ చిన్నప్పుడు ఎంత అల్లరి చేసే వాడో తెలుసా నీకు? ఇప్పుడు పెళ్ళి చేసుకునేటంత పెద్దవాడయిపోయాడు. వాడికో తుంటరి వెధవ పుడితే అప్పుడు వుంటుంది తమాషా! చిన్నప్పుడు వాడు మీనాన్నగారి ఆఫీసు కాగితాలన్నీ లాగేసేవాడు. తాతగారి పూజలోంచి వెండి విగ్రహాలని తీసి దాచేసేవాడు. ఇంతా అంతా కాదు వాడి అల్లరి, రాలుగాయిలా ఏడిపించుకుతినేవాడు".

"నేను అల్లరి చెయ్యకుండా బంగారు తండ్రిలా వుండే వాడినామ్మా?"

"వాడంత అల్లరి లేదు నీకు. ఒకరోజు నువ్వు ఏంచేశావో తెలుసా? ఇంట్లో ఎక్కడా కనిపించలేదు. నీ పేరెట్టి అరిచిపిలిచాం అందరం. చుట్టుపక్కల ఇళ్ళల్లో అంతా వెదికాం. అసలే ముద్దుగా వుండేవాడివి, ఎవరన్నా ఎత్తుకుపోయారేమోనని ఇంక పోలీసు రిపోర్టిద్దామా అని అనుకుంటూ వుండగా అశోక్, "ఇక్కడ చూడమ్మా" అంటూ నన్ను పిలిచాడు. చూస్తే నువ్వు మీ నాన్నగారి టేబుల్ కింద కూర్చుని కాగితాల చెత్తంతా ఒంటిమీద పోసుకుని, ఆ బుట్టనెత్తిమీద టోపీలా పెట్టుక్కూర్చుని బయటకి రావడానికి ప్రయత్నిస్తున్నావు. చుట్టూ టేబుల్ క్లాత్ మూసుకుని వుండటంతో నువ్వు మాకు కనపడలేదు..."

ముగ్గురూ మాట్లాడుకుంటూ నవ్వుకుంటు న్నారు. అంతలో నర్స్‌వచ్చింది. వాళ్ళిద్దర్నీ బయటకి వెళ్ళమని యశోదని ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకెళ్ళడానికి కావలసిన ఏర్పాట్లుచూసింది కొంతసేపటికి స్ట్రెచర్ వచ్చింది. తల్లిని ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకెళ్తుంటే ప్రతాప్, "మేమిక్కడే వుంటామ మ్మా! బీబ్రేవ్" అన్నాడు. యశోద విహ్వాలంగా జగన్నాథం వైపు చూసింది. ఆమెకి ధైర్యం చెబుతున్నట్టుగా ఆమె చేతిని మృదువుగా నొక్కాడు.

నిమిషాలు యుగాల్లా గడుస్తున్నాయి. అప్పుడప్పుడు గడియారం వంక చూసు కుంటున్నాడు జగన్నాథం. 'యశోదని బాగా అర్థం చేసుకున్నాననీ, ఎంతో బాగా చూసు కుంటున్నాననీ అనుకున్నాడు తను. ఇప్పుడే మయింది? ఆమె అనారోగ్యం గురించి తను ముందుగా తెలుసుకోలేకపోయాడు. తనదే తప్పేమో. ఆమె తనకి అనుకూలవతియైన భార్య అని ఆనందించాడు నరే, తనామెకెంత మటుకు అనుకూలంగా నడుచుకున్నాడు. ఆమె పైకి ఆరోగ్యంగానే కనిపిస్తుంటే తను మోసపోయాడు. ఈ ఒక్కసారికిగండం గడిస్తే చాలు...' అనుకున్నాడు.

నమయం చాలామెల్లగా భారంగా నడుస్తోంది. ఒకటి... రెండుగంటలయింది. నర్సులటూ ఇటూ తిరుగుతున్నారు గాని పరిస్థితి ఏమీ అర్థంకావటంలేదు. మూడవగంటకూడా గడి చింది.

ఆపరేషన్ అయింది కాని, యశోద పరిస్థితి క్షీణదశలో వుంది. సాయంత్రం నాలుగుగంట లకి ఆమె జగన్నాథాన్ని ప్రతాప్‌ని, వానప్రస్థా న్ని దుఃఖంలో ముంచి వెళ్ళిపోయింది.

★ ★ ★

జగన్నాథం ఆశ్రమం వైపు వెళ్ళనేలేదు. అక్కడున్న ఒక్కొక్కరికీ యశోదంటే ఎంత ప్రేమో అతడికి తెలును. తనని చూడగానే వాళ్ళంతా వెక్కివెక్కి విలపిస్తారు. అది తను భరించలేడు. ఆశ్రమంలోనివారే ఒక్కొరొక్క రుగా వచ్చి జగన్నాథాన్ని పలుకరించారు. యశోదకోసం దుఃఖించారు. దేవుణ్ణి తిట్టిపోశా రు. ఆయుష్షు ఎవరిచేతిలో వుంటుంది అన్నా రు. జగన్నాథానికి ధైర్యవచనాలు చెప్పారు.

జగన్నాథం తిథి, కర్మ అంటూ ఏం చెయ్య లేదు. పన్నెండవ రోజున అనాథాశ్రమంలో పిల్లలకి విందుభోజనం ఏర్పాటుచేయించా డు.

యశోదలేని ఇల్లు బావురుమంటోంది. ఆమె ఇంట్లోలేదు. ఇకరాదు అనేనిజానికి అల వడలేకుండా వున్నాడు జగన్నాథం. నిజంగా అర్థాంగి అనేమాటకి అర్థాన్నిచ్చేటంతగా తన జీవితంలోకి చొచ్చుకుపోయింది యశోద. జీవి తాధారమైనగాలి, నీళ్ళులేకపోతే ఎలా ఉక్కిరి బిక్కిరిగా వుంటుందో అలా ఉంటోంది అతని కి. ఎలా బతికున్నానా అని ఆశ్చర్యపోయాడు. అతనితో నమానంగా దుఃఖాన్ననుభవిస్తున్న ప్రతాప్ కొంచెం ముందుగా తేరుకుని, ఓరోజు—

"భోంచేశారా నాన్నా?" అనడిగాడు.

అతడి వీపు నిమురుతూ "నువ్వుచేశా వురా?" అని తిరుగుప్రశ్న వేసాడు. ప్రతాప్ జవాబివ్వకుండా తలవంచుకున్నాడు. ఇద్దరి హృదయాల్లోనూ అంతులేని దుఃఖం, ఒకరిప ట్ల మరొకరికి సానుభూతి.

"నాన్నా నువ్వు ఆశ్రమంవేపు అసలు వెళ్ళనేలేదు. మోహనరావుగారికి ఆరోగ్యం బాగో లేదు. వెంకట్రావుగారు నువ్వెలావున్నావని రోజూ అడుగుతున్నారు. వాళ్ళే ఇక్కడికొస్తా మంటున్నారు. నేనురావద్దని చెప్పాను. నువ్వే ఓసారి వెళ్ళొస్తే బాగుంటుంది" అన్నాడు ప్రతాప్ మెల్లగా.

"అయితే నువ్వు రోజూ అక్కడికి వెళ్తు న్నావా?"

ప్రతాప్ మౌనంగా వూరుకున్నాడు.

"ఇవాళ వెళ్తాలే" అన్నాడు జగన్నాథం. అక్కడకి వెళ్ళాలంటే అతడికి గుబులు, బాధ. 'ఎలావెళ్ళడం?' అని మథనపడుతున్నాడు. అలాగని వూరుకుంటే కుదరదుగా. ఏదోఒక రోజు ఈ పరిస్థితిని ఎదుర్కొక తప్పదు.

ఆశ్రమంలో వాతావరణం, గాలి గడ్డకట్టిన ట్టుంది. ఆశ్రమ వానుల ముఖంలో దుఃఖంతో పాటు నిరాశ, భయం చోటుచేసుకున్నాయి. యశోద పోయింది, ఇక మొదటిలా తమకి భద్రతఉండదనే దిగులు వారి ముఖాల్లో కని పిస్తోంది. అది నహజమే. జగన్నాథానికి తన




పొరబాటు అర్థమయింది. మోహనరావుగారు పడుకున్నచోటికి వెళ్ళి ఆయన యోగక్షేమాలు విచారించాడు. మిగతావారితో కూడా వీలైనంత సహజంగా మాట్లాడ్డానికి ప్రయత్నించాడు. తోటలో కొత్తఇంటిపరిస్థితి, పని ఎలావుందో చూడ్డానికి వెళ్ళాడు. ఎక్కువసేపు అక్కడ వుండలేకపోయాడు. రాజారావుని, నరసింహయ్యగార్ని పిలిచి- "చూడండి ఆశ్రమం ఎప్పటిలాగే నడుస్తుంది. ఎవరూ బెంగపెట్టుకోవలసిన అవసరంలేదు. నేను వారానికి ఒకసారో, రెండుసార్లో వచ్చి చూసివెళ్తుంటాను. అందరికీ ఆమాట చెప్పండి. మీకేమన్నా ఇబ్బందులుంటే నాకు తెలియచేయండి" అని చెప్పాడు.



యశోద పోయిందికదా అని ఏపనీ ఆపటానికి వీలులేదు. ఆఘెని నమ్ముకునివున్న ఆశ్రమవాసులంతా తనమీదే ఆశపెట్టుకుని వున్నారిప్పుడు. తనకి ఇంకేమీ పెద్దబాధ్యతలు లేవు. అశోక్ జీవితంలో స్థిరపడ్డట్టే. ప్రతాప్ చదువు కూడా పూర్తయి రేపోమాపో ఉద్యోగం రాబోతోంది. అతడి పెళ్ళి ఒకటి జరగాలి...జరుగుతుంది కూడా. యశోదలేదని ఏదీ ఆగదు. అన్నీ జరగాల్సిందే.

అంచెలంచెలుగా ఇంటిపనీ పూర్తయింది. కుళాయిలూ, కరెంటు కనక్షన్స్ ఇవ్వడమయింది. గృహప్రవేశం అనే ఆర్భాటంచేయాలనే వుత్సాహం రాజారావుకి లేదు. ఆ ఇళ్ళ కోసం అర్జీలు పెట్టుకున్నవాళ్ళిద్దరికీ ఉత్తరాలు రాసి తెలియబరిచారు.

★ ★ ★

యశోదలేని జీవితం నాలుగేళ్ళు గడిచింది. ఈమధ్యలో అశోక్ ఒకసారి వచ్చివెళ్ళాడు. ప్రతాప్‌కి బొంబాయిలో మంచి వుద్యోగంవచ్చింది. పెళ్ళయి, బొంబాయిలోనే కాపురం పెట్టాడు. అశోక్ చాలాసార్లు, "ఇక్కడకొచ్చి మాదగ్గరే వుండిపో. ఈ కాలంలో ఎంతోమంది ఇక్కడే పిల్లల్తో స్థిరపడుతున్నారు" అంటూ రాస్తున్నాడు.

"విదేశాలకి వెళ్ళడమంటే ముందు, వెనుకా ఆలోచించాలి... నిజమే. కాని బొంబాయి రావడానికేం? మీరింక అక్కడ ఎవరికోసం కష్టపడాలి? వచ్చి మాతోనే వుండండి" అని ఒత్తిడిచేస్తున్నాడు ప్రతాప్.

ప్రతాప్ వెళ్ళిపోయాక ఆ పెద్ద ఇంట్లో ఒక్కడేవుండటానికి కష్టంగానే వుంది. కొద్దిరోజులు ప్రతాప్ దగ్గరవుండివద్దామని నిర్ణయించుకున్నారు. కోర్టుకి సెలవులివ్వగానే వెళ్ళడానికి నిశ్చయించుకుని కొడుక్కి వుత్తరం రాశాడు.'

తండ్రి వుత్తరంచూసి ప్రతాప్ ఆయన వస్తాడంటే నమ్మలేకపోయాడు. మళ్ళీమళ్ళీ ఆ వుత్తరాన్ని చదువుకుని భార్యని పిలిచి విషయం చెప్పాడు. ఆవిడేమీ పెద్ద ఉత్సాహం చూపించలేదు. ప్రతాప్ తండ్రిని తప్పకుండా రమ్మని ఉత్తరంరాస్తూ దాదర్ స్టేషన్‌లో దిగవలసిందిగా సూచననిచ్చాడు. రజని మామగారి కోసం ఒకగదిని సిద్ధపరిచింది.

జగన్నాథం ఆదివారం దిగాడు. భార్యాభర్తలిద్దరూ స్టేషన్‌కి వెళ్ళి జగన్నాథాన్ని దింపుకున్నారు. వాళ్ళది ఇల్లు చిన్నదయినా విశాలమయిన హాలొకటి, రెండు గదులు, వంటిల్లు, చక్కటి బాల్కనీ వున్నాయి. ఇల్లు మొదటి అంతస్థులోనే వుంది.

ఇంట్లో అడుగుపెట్టగానే చెమట తుడుచుకుంటున్న తండ్రిని చూసి "చాలా ఉక్కకదూ నాన్నా?" అని ఫాన్ స్విచ్ నొక్కాడు. జగన్నాథం ఇంటి శుభ్రత, ఒద్దిక చూసి మెచ్చుకున్నాడు. సాయంత్రం తండ్రిని కార్లో మెరీన్‌డ్రైవ్ కి తీసుకెళ్ళి చూపించుకొచ్చాడు.

మర్నాడు పొద్దున్నే భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలకి బయల్దేరారు. అప్పుడు ప్రతాప్, "నాన్నా... మేం రావడానికి ఆరుగంటలవు

తుంది. అంతవరకు గడపడానికి ఈ బీరువాలో పుస్తకాలున్నాయి చదువుకో. రేడియో విను. కాసేపు ఈ బాల్కనీలో కూర్చుంటే వీధంతా కనిపిస్తుంది చూస్తూ కూర్చోవచ్చు" అనిచెప్పిబయల్దేరాడు.

జగన్నాథం ఇదివరకు బొంబాయికి చాలా సార్లే వచ్చాడు. అక్కడ అతనికేం పెద్ద ఆకర్షణలేదు. ఇప్పుడంటే కొడుకు ఇల్లుంది. కాసేపు పుస్తకాలు చదవడానికి ప్రయత్నించాడు. మధ్యాహ్నం పడుకునే అలవాటు లేదు. బాల్కనీలోకి వెళ్తే వేడిగాడుపు. ఒక్కొక్క నిమిషం నిదానంగా గడుస్తోంది. సాయంత్రం వరకు కాలక్షేపంచేయడం చాలా కష్టమయింది.

ప్రతాప్ ఇంటికి రాగానే "బోర్‌కొట్టిందా నాన్నా? కొత్తల్లో అలాగే వుంటుంది. ఈ వీధిచివర శంకరయ్యర్ అని ఒకాయన వున్నారు. ఆయనకూడా మీలాగే మెద్రాస్‌లో లాయర్‌గా వుండి ఇప్పుడిక్కడికొచ్చారు. నీకు కొడుకిల్లు వుంటే, ఆయనకి కూతురిల్లు. అంతేతేడా" అంటూ ఏవేవో కబుర్లు చెప్పాడు.

"ఫ్రిజ్‌లో పళ్ళున్నాయి ఏమన్నా తినకపోయావా?" అంటూ తనే ఒక ఏపిల్ తీసి ముక్కలు చేసి తండ్రికి పెట్టాడు. రజని వంటింట్లో వస్లోపడింది. ఏడుగంటలకి భోజనం ఏర్పాటుచేసింది. చపాతి, కూర, పెరుగన్నం. భోంచేశాక గిన్నెలు, వంటిల్లు సర్దడం, టేబుల్ శుభ్రంచేయడం ఈ పనుల్లో ప్రతాప్ భార్యకి సాయంచేశాడు.

అవనయ్యాక బాల్కనీలో మూడు కుర్చీలు వేసి, "నాన్నా... ఇక్కడకూర్చుంటే కాస్త గాలేస్తుంది" అని పిలిచాడు.

అక్కడ కూర్చుంటే పక్కింటివాళ్ళ కిటికీ దాన్లోంచి వాళ్ళు భోజనాలు చేస్తున్న దృశ్యం కనిపిస్తోంది. కింద రోడ్డుమీద వాహనాలు, జనాలు, హడావుడిగా ఉంది.

ప్రతాప్ "రజనీ" అని పిలిచాడు. జవాబు రాలేదు. జగన్నాథమే, "పొద్దుట్నుంచీ చేసిచేసి అలిసిపోయుంటుంది. పడుకోనీరా పావం" అన్నాడు.

ప్రతాప్ ఉత్సాహంగా "వచ్చే ఏటికి క్వార్టర్స్ ఇస్తారు నాకు. సముద్రం ఎదురుగా ఇల్లు. ఆఫీసుకూడా దగ్గరవుతుంది. మీరొక్కరే అక్కడెందుకు నాన్నా! ఇక్కడే ఉండిపోండి. నలుగురితో పరిచయం అయితే అదే అలవాటవుతుంది" అని అంటుంటే జగన్నాథం చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

"ఈ ఆదివారం జుహూ బీచ్‌కి వెళ్దాం"

"నేనిదివరకు చూశాను. బాగా దూరం కూడా. ఇప్పుడెందుకు లెద్దూ"

"ఒకసారి చూస్తేనేం నాన్నా... ఇంకోసారి చూడొచ్చుగా"

కొడుకు ఉత్సాహాన్ని పాడుచెయ్యడం ఇష్టంలేక వూరుకున్నాడు జగన్నాథం.

ఆదివారం సాయంత్రం ఇంక బయల్దేరాలనుకుంటుండగా రజని "నాకెందుకో చాలా తలనొప్పిగా ఉంది. మీరు వెళ్ళిరండి" అంది.

"తలనొప్పయితే ఒక మాత్రవేసుకుని బయల్దేరితే సరి. పావుగంటలో సర్దుకుంటుంది"

ప్రతాప్ సలహాని పట్టించుకోలేదు రజని.

"పోనీలేరా ప్రతాప్! ఇంకో రోజువెళ్తేసరి" అన్నాడు జగన్నాథం.

"ఎందుకలా? మనిద్దరమే వెళ్దాం పదండి" అన్నాడు ప్రతాప్.

బీచ్‌నిండా పందలకొద్దీ జనం. గూళ్ళలోంచి బయటికొచ్చిన పక్షుల్లా హాయిగా స్వేచ్ఛగా ఉన్నారు. పిల్లలు కొంతమంది ఒంటెసవారీలు చేస్తుంటే మరికొందరు ఇసుకతో పిచ్చుకగూళ్ళు కడుతున్నారు. మొత్తంమీద ఎటుచూసినా ఉత్సాహం, కేరింతలే.

ఊర్నుంచి వచ్చిన ఈ ఎనిమిదిరోజుల్లో రజనీ ఒక్కనాడయినా తనతో సన్నిహితంగా మాట్లాడలేదు. వేళకి సరిగ్గా కాఫీ, టిఫెన్, భోజనం మాత్రం ఏర్పాటుచేసేస్తుంది. ఎందుకు? తను అక్కడే ఉండిపోతాడని బెంగేమో! ఒక్కసారయినా నవ్వుతూ మాట్లాడటం తను చూడలేదు. మొహం ఎప్పుడూ చిరచిరలాడుతున్నట్టే ఉంటుంది. ఎంతకాదనుకున్నా యశోద గుర్తురాక తప్పదు. తన తండ్రిని ఎంతబాగా చూసుకునేది యశోద! ఆయనకోసం ప్రత్యేకంగా ఆయనకి ఇష్టమయిన వంటలు, ఫలహారాలు చేసి వడ్డించేది. భోజనంచేసి చెయ్యి కడుక్కునే వేళకి చెంబులో వెచ్చటి నీళ్ళు సిద్ధంగా ఉంచేది.

ఆయన కంటిలోపార పెరిగినప్పుడు పుస్తకాలు చదివిపెట్టేది. ఒకటా రెండా? ఆమె ఆయన కోసం చేసే ప్రతీ పనిలో ఆత్మీయత, అభిమానం తొణికిసలాడేది.

పాంటు అంచులు మడుచుకుంటూ "నీళ్ళ ల్లోకి వెళ్దాం రండినాన్నా" అని బయల్దేరాడు ప్రతాప్.

ముందు ముందుకి నడుచుకుంటూ వెళ్ళారు. అలలు కాలికి తగులుతుంటే కాళ్ళు కూరుకుపోతున్న అనుభవం ఎప్పటికప్పుడు తమాషాగానే ఉంటుంది. కొద్దికొద్దిగా కిందకి దిగజారుతూ చటుక్కున మునిగి ఆకాశమంతా రంగుని వెదజల్లాడు సూర్యుడు. చాలామంది అదృశ్యాన్ని కెమేరాలో బంధించే ప్రయత్నం చేస్తున్నారు. సంధ్య అందాలని శాశ్వతంగా దాచుకుందామని ఆశ వాళ్ళకి. ఆకాశం నల్లబడుతోంది. ఆ మసకవెలుగులోనూ అదో అందం. సముద్రపు హోరు, చల్లటి గాలి. మసకవెలుగులో కదిలే బొమ్మల్లా మెల్లగా ఇళ్ళ వేపు కదలసాగారు జనాలు...

ఇంటికొచ్చేసరికి తొమ్మిది గంటలయింది. తలుపు తీసేవుంది. లోపల్నుంచి గట్టిగా నవ్వులు, కబుర్లు వినిపిస్తున్నాయి. వీళ్ళు ఇంట్లోకి రావడంచూసి రజని లేచినుంచుంది. ప్రతాప్ ఆ కొత్తవాళ్ళని పలుకరించి తండ్రికి పరిచయం చేశాడు.

"ఈయన రజనివాళ్ళ బాబాయిగారబ్బాయి. ఈవిడ ఆయన శ్రీమతి శీల"

బీచ్‌కి వెళ్దామంటే తలనొప్పి అని ఆగిపోయిన రజని ఈమేనా? అని ఆశ్చర్యపోయేటంత ఉత్సాహంగా,సంతోషంగా ఉంది ఆమె.

ఇటువంటి చిన్న చిన్న సంఘటనలవల్ల ఆమె మనసు తెలుసుకున్న జగన్నాథం తనింక ఎక్కువరోజులు ఉండకపోతేనే మంచిదనుకున్నాడు. కొడుకు మాటవిని తనిక్కడే ఉండిపోడానికి రాలేదింకానయం! వాళ్ళ దోవ నవాళ్ళు సుఖంగా వుంటే అంతేచాలు, అనుకుని, ప్రతాప్‌తో చెప్తే గొడవచేస్తాడని తనే వెళ్ళి నాలుగురోజుల తరువాతి తారీకుకి ప్లేన్ టిక్కెట్టు కొనితెచ్చుకున్నాడు.





తండ్రి ప్రయాణం నిర్ణయించుకున్నాడని తెలిశాక, జగన్నాథం వూహించినట్టుగానే చిందులేశాడు ప్రతాప్.

"ఒక్కరే కూర్చుని అక్కడేం చేస్తారు? శలవులు అయ్యేవరకూ హాయిగా వుండకూడదా? ఎందుకింత తొందర మీకు!" అంటూ గొడవచేశాడు.

"మహాచేస్తే ఇంకో మూడేళ్లో నాలుగేళ్లో ప్రాక్టీస్ చేస్తాను. ఆతరువాత నువ్వుచెప్పినట్టు ఇక్కడేవచ్చి వుంటాలే" అన్నాడు జగన్నాథం శాంతంగా.

రజనిలో కొద్దిమార్పు కనిపించింది. మర్నాడు తను ఆఫీసునుంచి వచ్చేటప్పుడు దార్లో మార్కెట్ దగ్గర ఆగి మామిడిపళ్లు తెచ్చి ముక్కలుకోసి పెట్టిందాయనకి. సాయంత్రాలు తనుకూడా వచ్చి బాల్కనీలో కూర్చోడం మొదలెట్టింది.

జగన్నాథం బయల్దేరే రోజున ఇద్దరూ శలవుపెట్టారు. రజని క్యారెట్ హల్వా, బోండాతో ఆయనకి విందుభోజనం పెట్టింది. ప్రపంచం తీరుతెన్నులు చూసిన జగన్నాథానికి ఈ ఆర్భాటం చూస్తే నవ్వొచ్చింది.

ఏర్‌పోర్ట్‌లో ప్రతాప్ మళ్ళీ చెప్పాడు-

"నాన్నా ఆశ్రమానికేదో ఒక ఏర్పాటుచేసి ఇక్కడకే వచ్చెయ్యండి. మీరక్కడ ఒక్కరే వుంటే నాకిక్కడ నిశ్చింతగా, శాంతిగా వుండదు"

"అలాగేలేరా" అన్నాడు నవ్వుతూ.

ఇంటికివచ్చిన జగన్నాథానికి ఒకరకమైన స్థిమితం, మరొకవిధమైన అశాంతి. తనఇంటికయితే వచ్చిచేరాడుగాని, ఇకమీదట తనెప్పటికీ ఏకాకే. మళ్లీ ప్రతాప్ ఇంటికి వెళ్ళే ప్రశ్నలేదు. అశోక్ ఈమధ్య ఎవరికీ సరిగ్గా ఉత్తరాలే రాయడు. తను అక్కడికి వెళ్లి వుండటం అనేది జరిగేపని కాదు. అయినా తను పిల్లల్ని పెంచినప్పుడు, వీళ్లు నన్ను పెద్దవయసులో చూసుకోవాలి అనే ఆశలేమీ పెట్టుకోలేదు. పిల్లల్ని పెంచడంలో తను, యశోదకూడా అపారమైన ఆనందాన్ననుభవించారు. తమ వార్థక్యాన్ని గురించెప్పుడూ ఆలోచనేలేదు. ప్రతాప్ చిన్నప్పుడు "అమ్మా... నువ్వుమాత్రం ఎప్పటికీ ముసల్దానివవ్వద్దమ్మా" అని పేచీ పెట్టేవాడు. ఆమాట ఎన్ని


మామా ధృతరాష్ట్రా
నీ కౌగిలిలో భస్మీపటలం
కావటానికి భీముడు కాదు
నాగార్జున సిమెంటు తో
చేసిన విగ్రహం
MAM 120

సార్లో తల్చుకుని మురిసేది యశోద. అప్రకారమే ఆమె మునలితనాన్ని చూడనేలేదు. తనుమాత్రం ఈ నాలుగేళ్లలో వదేళ్లవయను గడిచినట్టుగా తయారయ్యాడు.

ఆరాత్రి అతనికి నిద్రపట్టలేదు. కిటికీలోంచి వడుతున్న వెన్నెల వెలుగు గదంతా అలుముకుంది. అదేగది, అదేమంచం, అదేవెన్నెల- యశోదమాత్రం లేదు. ఒక్కసారి యశోదని చూడగలిగితే ఎంతబాగుండును. ఈ చావు అనేది ఎంతక్రూరమైన ముగింపుకదా! అయినా ఇప్పుడో అప్పుడో ఆమెరావచ్చేమో, వస్తుందేమో. 'నిద్రపట్టలేదా?' అంటూ తన జుట్టులో వేళ్లు అటూ ఇటూ కదుపుతూ తలనిమురుతుందేమో అనిపిస్తుంది. నిద్రపడితే బాగుండును కలలోకయినా వస్తుంది. వయనుపైబడుతుంటే నిద్రపట్టడం కూడా కష్టమే. జ్ఞాపకాలు వద్దన్నా వెంబడిస్తున్నాయి ముప్పయ్‌నలభై యేళ్లక్రితం జరిగిన నంఘటనలు కూడా నిన్నో మొన్నో జరిగినంత తాజాగా, స్పష్టంగా కళ్లముందు నిలబెట్టగలవు. మనుమలు, నంఘటనలు గుంపులుగా వచ్చిపడతాయి. ఎందుకిలా జరిగింది? అలా కాకుండా ఇలా అయ్యుండాల్సింది. అనే ఆలోచనలొస్తాయి. చివరికి ఆ ఆలోచనల తంతు ఒక కొలిక్కొచ్చాక మళ్లీ ఒంటరితనం! నాగమ్మ, భాగీరథి, మోహనరావుగారు వాళ్లంతా ఏదోవిధంగా ఇలా బాధపడ్డవాళ్లే కదా! వారి వ్యధిత హృదయాలని చల్లబరుస్తూ నేనున్నానన్న ధైర్యాన్నందించింది యశోద. ప్రీతిని అక్షయపాత్రలో నింపి పంచిపెట్టింది.

జగన్నాథం లేచి హాల్లోకొచ్చి వడుకున్నాడు.' చీకట్లో ఇల్లు ఇంకా మౌనంగా, ఇంకా విశాలంగా అనిపించింది. అవును... నాకొక్కడికే ఇంత పెద్ద ఇల్లెందుకు? నేను కూడా వెళ్ళి ఆశ్రమంలోనే వుండిపోవచ్చుకదా? నాకింకా వానప్రస్థానికి అర్హత రాలేదా? పూర్వకాలంలో బ్రహ్మచర్య, గృహస్థాశ్రమాలని శక్త్యానుసారం నిర్వహించినవారంతా అపారమైన అనుభవాన్ని వ్యవహారజ్ఞానాన్ని పొంది దానధర్మాలు, అతిథి నత్కారాలు, నంసారకర్తవ్యాలు అన్నీ తీరిన తరువాత, నంతోషంగా, స్వచ్ఛందంగా బాధ్యతలని పిల్లలకి వదిలి వానప్రస్థాశ్రమానికి అడవులకి వెళ్లేవారట. అవనరం అయినప్పుడు పిల్లలు వారిని దర్శించి నలహాలు పొందేవారట. స్వార్థాన్ని దాటిన ఒక న్యాయదృష్టి జీవితంలో నిమిత్తమాత్రులుగా వుండి, ప్రతిదాన్నీ విరక్తిభావంతో చూడగలిగే యోగ్యత వారికి లభ్యమయ్యేది. మృత్యుంజయశాస్త్రిగారు ఎన్నో వివరాలు చెప్పేవారు. ఇప్పుడు ఆయన లేరు. ఆశ్రమంలో ఆయనున్నది ఒక్క నంవత్సరమే. తరువాత నన్యాసాశ్రమం తీసుకోవడానికి ఉత్తరభారతదేశం వెళ్ళిపోయారు.

తనవరకూ తనకి బాధ్యతలు తీరిపోయాయి. బతకడం కోనం చాకిరీ చెయ్యక్కర్లేదు. ఒక వరిమితిలో వనిచేనుకుంటూ వుండచ్చు. ఆశ్రమాన్ని ప్రారంభించినప్పుడు తనకి ఇటువంటి వరిస్థితి వస్తుందని యశోద కలలో కూడా అనుకుని వుండదు. ఇది విధి ఆడే ఆట- అంతే!

పొద్దున్నే తన నిర్ణయాన్ని రాజారావుకి చెప్పాడు. ఆయనకేమీ ఆశ్చర్యం కలిగినట్టులేదు. నాలుగు కాటేజెస్‌లో ఒక కాటేజ్ ఖాళీగా వుంది. అక్కడ వుండవచ్చునని చెప్పారు.

ఒకసారి నిర్ణయం తీసుకున్నాక వెంటనే అమలుజరవడం జగన్నాథం న్వభావం. 'నువ్వు వెళ్లద్దు' అని అతన్ని ఆపేవాళ్ళెవరూ లేరు. పొద్దుట ఎప్పటిలాగే ఆఫీస్ వనులు, కోర్టు వనులూ పూర్తిచేనుకున్నాడు. సాయంత్రం ఇంటికి వచ్చాక తనకి ముఖ్యంగా అవనరమయ్యే కొన్ని వస్తువులు పెట్లో పెట్టుకున్నాడు. రాత్రి ఎనిమిది గంటల వేళప్పుడు... ఇంటికి ఒక పెద్ద తాళం పెట్టాడు. వీధిలో పెద్దజననంచారంలేదు. క్రితంరోజులాగే వెన్నెల వరచుకుంది.

విశాలమైన వీధిలో ఒంటరిగా జగన్నాథం

'వానప్రస్థం'. నల్లటి ఫలకంపై తెల్లటి అక్షరాలు దానిపైన అమర్చిన దీపపు కాంతిలో మెరుస్తున్నాయి. దానిముందొక అరక్షణం నుంచున్నాడు. తరువాత గేటు దాటి లోపలికి నడిచాడు. అతని రాకకోనం ఎదురుచూస్తూ అక్కడే నుంచున్న రాజారావు అతని చేతిలోని పెట్టెని అందుకున్నాడు.

నిదానంగా, శాంతంగా దృఢమైన అడుగుల్నివేస్తూ ముందుకి నడిచాడు జగన్నాథం.







విపుల

ఈరోజు కాలేజి
డిబేట్ లో
ఇతర ప్రాంతాల్లోని
జీవన విధానంగురించి
అంత బాగా ఎలా
మాట్లాడగలిగావ్?

నేను 'విపుల'
పాఠకురాలిని:
ప్రతినెలా దావాపు
పదిహేను భాషల కథల్ని,
ఆయా జీవన విధానాల్ని
తేటతెలుగులో చదివే
అవకాశాన్నిస్తుంది 'విపుల'

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

ఫిబ్రవరి 'చతుర' నవల : వానప్రస్థం

సమీక్షకుని పేరు:..........................................

చిరునామా:..........................................

..........................................

..........................................



# చమత్కార ప్రపంచం

## సిగరెట్ సిత్రాలు

"సరదా సరదా సిగరెట్టూ - ఇది దొరలు తాగు భలే సిగరెట్టు" అని ఓ ధూమపానప్రియుడు మురిసిపోతే, తన ప్రియుడు ధూమపాన ప్రియుడుగా మారటం సహించలేని ఓ ముదిత "కంపుకొట్టు సిగరెట్టు - దీన్ని కాల్చకోయి నాపై ఒట్టు" అని ఆ అలవాటును మాన్పించడానికి శాయశక్తులా తంటాలుపడుతుంటుంది. "పొగతాగనివాడు దున్నపోతై పుట్టునో" అంటాడు కన్యాశుల్కంలో గిరీశం. 'పొగపీల్చటం హానికరం' అని సిగరెట్టు పెట్టెలపై హెచ్చరించినా ఆ మాటల్ని పట్టించుకోరు వాడకందార్లు. గుండెలనిండా పొగ పీల్చి గాని కవిత్వం చెప్పలేని ప్రవృత్తి కొందరిదైతే ఆదేపనిగా గొలుసుగా సిగరెట్లు తగలెట్టి పొగతో మేఘాలు సృష్టించి కలల్లో తేలిపోవటం మరికొందరి హాబీ!!

ఆ సంగతులెలా ఉన్నా పొగతాగరాదనే నిషేధాలూ, నినాదాలూ ఈనాటివి కావు. ప్రాచీనులు చాలావరకు పొగపీల్చటాన్ని ఇష్టపడేవారుకాదు. కొన్ని సందర్భాల్లో పొగ పీల్చేవారిని ఏ హంతకులనో చూసినట్లు చూసేవారు.

17వ శతాబ్దంలో టర్కీరాజు 'మురటి' పొగ తాగినవారికి మరణదండన విధిస్తామని ప్రకటించాడు. అయన పాలనలో పదిహేనువేల మంది ఉరితీతకు గురయ్యారు.

ఈనాడు మద్యం సేవించటానికి క్లబ్బులూ, బార్లూ వెలిసినట్లే ఆరోజుల్లో ముఖ్యమైన వ్యక్తులకి పొగ పీల్చుకోవటానికి క్లబ్బుల్ని ఏర్పాటుచేసిన సందర్భాలూ ఉన్నాయి. ఆ స్మోకింగ్ క్లబ్బుల్లో సమయం గడపటం ఫాషనుగా మారింది. సైనికులు ఈ స్మోకింగ్‌క్లబ్బుల్లో ఎంతోకాలాన్ని వృథాగా గడపనారంభించటంతో ఈజిప్టురాజు మురాద్ ఈ క్లబ్బుల్ని నిషేధించాడు. స్మోకింగ్‌క్లబ్బుల్ని పేల్చేసేందుకు ప్రత్యేక పోలీసుదళాలను నియమించాడు.

జర్మనీలో కూడా 18వ శతాబ్దంవరకూ స్మోకింగ్‌పై సంపూర్ణనిషేధం అమల్లో వుండేది. వీధుల్లో పోలీసులు సాదాదుస్తుల్లో తిరిగి పొగతాగేవారికోసం గాలించేవారు. ఖర్మకాలి ఎవరైనా వెలిగిస్తే రెడ్‌హాండెడ్‌గా పట్టుకుని జరిమానా విధించేవారు.

ఇథోపియాలో ఒకప్పుడు పొగపీల్చేవారు కనిపిస్తే సైనికులు వెంటనే వాళ్ల ముక్కులు చెక్కేసేవారు. ఫలితంగా ఆనాటి సమాజంలో ముక్కులులేనివారే కోకొల్లలుగా కనిపించేవారు. వీరిలో స్త్రీలు కూడా వుండేవారు. ఆనాటి స్త్రీలు పొగపీల్చి ముక్కులు కోయించుకోవటంలోనైనా పురుషులతో పోటీపడి సమానత్వం సాధించామనిపించుకున్నారు.

క్రీ. శ. 1615లో పర్షియన్‌రాజు ఖుబ్రైజ్ పొగతాగేవారు. తమ ముఖాలకు ఒంటెమలం పులుముకోవాలని విచిత్రమైన శిక్షను విధించా

ఏంటలా చూస్తావ్!
వచ్చే జన్మలో దున్నపోతుగా
పుట్టడం నాకిష్టం లేదు...
అందుకే ఇలా...

డు. అది రుద్దుకొని కూడా ఇంకా పొగపీల్చటం ఆవకుంటే రాజు వారి పెదవుల్నో గొంతుకల్నో తెగ్గోయించేవాడట!

రష్యాలో 'జార్'పాలనాకాలంలో వేడివేడి పాదరసాన్ని స్మోకర్ల పెదవులకు పూసేవారు. జపాన్లో 300 ఏళ్ళక్రితం వరకు కూడా స్మోకింగ్‌ని నేరంగానే పరిగణించేవారు. ఒక జపనీయుడు మరొక జపనీయుడు పొగతాగుతున్నాడని నిరూపిస్తే అతని యావదాస్తి ఇతని పరం అయ్యేది. ఆస్తి పోతే పొయ్యింది లెమ్మని ఆయనగారు సిగరెట్లు మళ్ళీ కాల్చటం ప్రారంభిస్తే యావజ్జీవ కారాగారశిక్ష విధించి అయ్యగారిని కటకటాల వెనక్కి పంపించేవారు.

బ్రిటిష్ అధికారులు స్మోకింగ్ విషయంలో కొంచెం ఉదారంగానే ప్రవర్తించారని చెప్పొచ్చు. విందువినోదాల సమయాల్లో పొగపీల్చొద్దని రాజులు, అధికారులు వినమ్రతతో ప్రజలకి విజ్ఞప్తులు చేసేవారు. బ్రిటిష్ రాజు చార్లెస్ 'స్మోకింగ్ అడ్వయిజర్ల'ను నియమించాడు. వాళ్ళు పొగత్రాగేవాళ్ళ ఇళ్ళకి పనిగట్టుకుని వెళ్ళి పొగపీల్చటంలోని దుష్పరిణామాలని వివరించి పొగ మానెయ్యమని బతిమాలాలి. ప్రాచీనబర్మాలో పొగతాగేవారిని పొగనిండిన గదుల్లోకి తోసి తలుపులు మూసేవారట. అలా అయినా పొగవట్ల విరక్తి కలుగుతుందని అధికారులు ఆశపడేవారు.




అలా ఆ అలవాటుని మాన్పించడానికి నానాతంటాలు పడి వాడకందార్లను నానా ఇబ్బంది పెట్టి బాధలకు గురిచేసేవారు ఆనాటి ప్రభువులు.

## ఇదీ పోలీసు కథ

**పోలీసులు** రక్షకభటులుగా వృత్తి స్వీకరించినా వారు ఈ కాలంలో కేవలం భక్షకభటులుగా మారటం మనకు తెలుసు. కొందరు పోలీసుల స్వార్థం అందరు పోలీసులకూ మచ్చతెచ్చింది. కొందరు పోలీసుల్లో విపరీతంగా లంచగొండితనం, స్త్రీవ్యామోహం, అహంకారం ఎక్కువై రక్షణ కల్పించవలసిన చోట భక్షకులుగా, కలియుగ కీచకులుగా ప్రసిద్ధులయ్యారు.



1700-1775 సంవత్సరాల మధ్యకాలంలో జీవించిన ప్రముఖనవలాకారుడు హెన్రీ ఫీల్డింగ్ అసలీ పోలీసువ్యవస్థకి శ్రీకారం చుట్టాడు. 1749లో తను నివసిస్తున్న పరిసరాలకు భద్రత కల్పించుకునేందుకని ఎనిమిదిమంది రక్షకుల్ని నియమించుకున్నాడు. అంతకు ముందే రోమన్‌ప్రభువు ఆగస్టస్ తనకోసం ఒక రక్షణబలగాన్ని నియమించాడు. అదే ఆనాటి పోలీసు వ్యవస్థ. ఆ తరువాత ఇంగ్లండులో ప్రతి పదిమంది పౌరులకు ఒకరివంతున ఏర్పరచి పోలీసుల సంఖ్యను పెంచారు. అయితే

ఈ పోలీసులు పారామిలిటరీ దళాలనుండి వచ్చినవారై వుండేవారు. వీరు వాహనాలను ఉపయోగించకుండా నగరవీధుల్లో కాలినడకనే తిరుగుతూ గస్తీకాసేవారు.

ఆ తరువాత 1842లో సర్ రాబర్ట్ బిల్ పోలీస్ వ్యవస్థను పునరుద్ధరించి లండన్ మెట్రోపాలిటన్ పోలీసుదళాన్ని రూపొందించాడు. ఇది లండన్ నగరానికే పరిమితమై వుండేది. రాబర్ట్ బిల్ పోలీసుల కోసం ఏర్పాటుచేసిన ట్రెయినింగ్ కాలేజిలో ఫిజికల్ ఎడ్యుకేషన్, చట్టాల వివరాలు, క్రమశిక్షణ నేర్పేవారు. శరీర వ్యాయామం చేయించేవారు. హత్యలూ, అత్యాచారాలు పెరగటంతో క్రమంగా రాబర్ట్ బిల్ పోలీసుల సంఖ్యనీ పెంచాడు. ఆనాటి పోలీసుల్ని ముద్దుగా 'బాబీ' లని పిలిచేవారు. ఈనాటికీ ఆ ఆనవాయితీ కొనసాగుతూనే వుంది. 1893లో వీరంతా యూనిఫారం విధిగా ధరించాలని ఆదేశాలు జారీ చేశారు. 1878లోనే సాధారణ దుస్తుల్లో తిరిగే సి.ఐ.డి.లను క్లిష్టమైన హత్యకేసుల్లోని నిందితులను పట్టుకునేందుకు నియమించారు. స్కాట్లాండ్ వాసులే చాలామంది పోలీసులుగా ఎన్నికయ్యారు. ప్రస్తుతం ప్రపంచంలోకల్లా అతిపెద్ద సి.ఐ.డి. శాఖ అమెరికాలో వుంది. తరువాత స్థానం రష్యాకి దక్కుతుంది. బలంలో, బలగంలో, సామర్థ్యంలో భారతీయ పోలీసులది ప్రపంచస్థాయిలో 87వ స్థానం. గ్రీకులో ''పొలిటియ'' అనే పదంనుండి పోలీసు పదం పుట్టిందంటారు. పొలిటియా అనగా నగరానికో, రాష్ట్రానికో కల్పింపబడే రక్షణ అని అర్థం.

## గాలి ఖరీదు..?

పంచభూతాలకు లేని కులవిభేదాలు మనిషికెందుకని ''గాలికి కులమేది- నీటికి కులమేది'' అనే పాట రాశారొక కవిగారు. నిజమే! గాలికి కులంలేదుగానీ వెలకట్టగూడదనే నియమం లేదుగా! అందుకే గాలికి వెలపెట్టి అమ్ముకుంటూ సొమ్ముచేసుకుంటున్నాం అంటున్నారు ఈనాటి వ్యాపారస్థులు. ఈదర గాలులూ, సుడిగాలులూ, ప్రశాంత పవనాలే ఎరుగుదుముగానీ ప్యాకింగ్ గాలుల్ని చూడటం ఇదే ప్రథమం అంటున్నారు పాతతరంవారు. గాలివాటం ఎటుంటే అటు కదలాడే చిగురాకు మనస్తత్వంగలవారు ''కొత్తేక వింత'' గాదూ అంటూ దీర్ఘాలు తీస్తున్నారు. ఏదియేమైనా డబ్బుగల దొరబాబులు గాలి కొనుక్కొని పీలుస్తుంటే జేబులో అది తక్కువైన దరిద్రనారాయణులు ఈసురోమంటున్నారు. డబ్బుల్ని ధారాళంగా ఖర్చుపెట్టేవారిని చూసి నీళ్లలా ఖర్చు పెడతారనుకుంటూంటాంగదా. దీనికి బదులు ఇకమీదట ''డబ్బును వాళ్లు గాలిలా ఖర్చుబెడతా''రనుకోవాలన్నమాట.

జపాన్‌లోని టోకియోలోనూ, దాని పరిసరాల్లోనూ ప్రజలు అన్ని వస్తువులకి కేటాయించినట్టే ఇపుడు గాలికీ కొంతడబ్బు కేటాయించి బడ్జెట్ వేసుకుంటున్నారు. దానితో గాలి కొనుక్కొని మరీ పీల్చుకోవలసివస్తోంది. టోకియోలోని జనం చల్లగాలి పీల్చుకోటానికి ఏ సముద్రపు టొడ్డుకో వెళ్లరు. 'ఎయిర్‌బూత్'లకి వెళ్లి పరిశుభ్రమైన గాలికి మూల్యం చెల్లించి గుండెల్నిండా పీల్చుకుంటున్నారు. కాఫీ హొటళ్లలా, వైన్ బార్లలా జపాన్‌లో ఆక్సిజనైజ్డ్ ఎయిర్‌బార్లు కూడా వెలిశాయి. గత ఏడాదినుండి అక్కడ ఇలా తాజా గాలిని డబ్బిచ్చి పీల్చే అలవాటు విస్తృతంగా వ్యాపించింది. ఈ తాజా గాలి డీలర్లు మార్కెట్లో పోటీని తట్టుకునేందుకు మొదట్లో గాలిని ఉచితంగా సరఫరాచేసి అందరికీ అలవాటయ్యాక ఇప్పుడు మంచిధర వసూలుచేస్తున్నారు. వినియోగదార్లను సంతోషపెట్టేందుకు తరచు సుగంధపరిమళాల్ని కూడా ఈ గాలిలో కలుపుతారువారు.

ఇన్నాళ్లూ జపానీయులు కాఫీ హొటళ్లకూ, బీరు సీసాలకూ విరివిగా ఖర్చుపెట్టేవారు. ఇపుడు మాత్రం బీరుసీసాల స్థానే 'గాలి డబ్బా'ల్ని కొంటున్నారు. ఈ ఆక్సిజన్‌తో నింపిన డబ్బాలకు రబ్బరుతొడుగుతో చిన్నిపైపు అమర్చబడి వుంటుంది. దీనిని ముక్కుకి అమర్చుకుని ఒక బటన్ నొక్కితే తాజా ఆక్సిజన్‌తో కూడిన పరిమళవంతమైన గాలిని పీల్చుకోవచ్చు. ఈ గాలి పీల్చుకున్న తర్వాత ఎంతో తేలికగా, హాయిగా ఫీలవుతున్నారట అక్కడి ప్రజలు.




గాలిని మాత్రమే భోంచేసి బ్రతుకుతాడని చెప్పానే ..! ఇతనే...

Bhaskar

టోకియోలోని ఒక పెద్ద డిపార్ట్‌మెంటల్ స్టోర్ 'టాక్సిమాయ' వారు ''ఊహించినదాని కంటే అధిక మొత్తంలో మా అమ్మకాలు సాగుతున్నాయి. తాజా ఆక్సిజన్‌ను పీల్చుకొనడానికి మా ఆక్సిజన్ పార్లర్లలోకి జనం చెప్పుకోదగిన సంఖ్యలో వస్తున్నారు'' అని మురిసిపోతున్నారు.

ఇలా పరిశుభ్రమైన ఆక్సిజన్‌గాలిని పీల్చుకుంటున్నందున ఆఫీసుల్లో చురుగ్గా పని చేయగలుగుతున్నామనీ, పనిపై దృష్టిని కేంద్రీకరించగలుగుతున్నామనీ వినియోగదారులు చెబుతున్నారు. కొందరు ఆక్సిజన్ పీల్చుకున్న తరువాత సిగరెట్లేల అనుకుని వాటిని తాగటం మానివేస్తున్నారట.

అయిదు లీటర్ల ఆక్సిజన్‌గల డబ్బా ఖరీదు మన రూపాయలలో రు. 69 నుండి 147 వరకు ఉంటుంది. ఇంత ఆక్సిజన్‌నీ రెండు మూడు నిమిషాల్లో పీల్చుకోవచ్చును. ఈ డబ్బాల్ని జపానీయులు క్లుప్తంగా 'ఆక్సీ' అని పిలుచుకుంటారు. ఒక్క టోకియోలోనే ఏడాదికి పది లక్షల డబ్బాల 'ఆక్సీ' అవసరమవుతుందని అంచనా. టోకియోలో అధిక జనాభా వల్ల వాతావరణ కాలుష్యమేర్పడి అనారోగ్యాలు హెచ్చుటంతో ఇలా ఆరోగ్యసూత్రాల్ని పాటిస్తూ గాలిని కొనుక్కొని మరీ పీలుస్తున్నారు. రోజురోజుకీ అమ్మకాలూ పెరుగుతున్నాయి; వ్యాపారుల జేబులు నిండుతున్నాయి; వినియోగదారుల ఆరోగ్యాలు మెరుగవుతున్నాయి. ఆహా... గాలివాటం అంటే ఇదేకదా! ★





## తెలివి

పేపరులో క్విజ్‌పోటీ గురించి చదివిన లింగరాజు మెదడులో ఓ ఆలోచన తళుక్కున మెరిసింది. ఆ అయిదు ప్రశ్నలకి సమాధానం ఎలా దొరికేదీ అర్థమయింది. మొదటి ప్రశ్నకి సమాధానంకోసం నరానరి డెయిరీ కేంద్రానికి వెళ్ళాడు.

డెయిరీ అసిస్టెంట్ డైరెక్టర్ ఆఫీసురూంలో పనిలేక తీరుబడిగా కూర్చున్నాడు.

"గుడీవినింగ్ సర్"

"గుడీవినింగ్... ఎవరు కావాలి?"

"మీదగ్గర ఒక డౌట్ క్లారిఫై చేసుకోవాలి సార్" అతివినయంగా అన్నాడు.

ఆ అసిస్టెంట్‌డైరెక్టర్‌కి తన ఇమేజ్ పెరిగినట్టయింది.

"ప్లీజ్ సిడౌన్"

"థాంక్యూసార్"

"చెప్పండి... వ్యాట్ ఈజ్ యువర్ డౌట్?"

"ఏంలేదుసార్, 'పాలను పాశ్చరైజేషన్' అంటారుకదా. అంటే ఏమిటి?"

"చెప్తాగానీ, మీకు ఆ డౌట్ ఎందుకొచ్చిందీ?"

"ఏంలేదుసార్... మాకు మూడు గొడుగేదెలు వున్నాయి. మాదగ్గర ఉన్న వాటి పాలు ఒకపూటలో విరిగి చెడిపోతాయి. అదే మీదగ్గర రోజులు తరబడి వుంటాయి. ఈ రహస్యం ఏమిటాని?"

"మంచి ప్రశ్న. పాశ్చరైజ్ చెయ్యడమంటే పాలను ఒక ప్రత్యేక ఉష్ణోగ్రత దగ్గర వేడిచేసి ఆ ఉష్ణోగ్రతదగ్గర నిర్దిష్టవ్యవధిపాటు వుంచి ఆ తర్వాత వెంటనే ఆ పాలను 50-80 డిగ్రీల దాకా చల్లబర్చడాన్ని పాశ్చరైజేషన్ అంటారు"

"నిర్దిష్టసమయం అంటే?"

"65 డిగ్రీల సెంటిగ్రేడ్ దగ్గరైతే అర్థగంట, 73 డిగ్రీల వద్ద 15 సెకండ్లు, 88 డిగ్రీల వద్దయితే ఒక సెకెండు"

"థాంక్యూ సార్... థాంక్యూ వెరీమచ్" అని శరవేగంతో అక్కడినుంచి మాయమయ్యాడు లింగరాజు.

★ ★ ★

"ఎమ్.ఎస్.పాండ్యన్, ఖగోళ శాస్త్రవేత్త" అనే బోర్డుకిందనున్న కాలింగ్‌బెల్ మోగించిన రెండు నిమిషాలకి ఒక స్త్రీ వచ్చింది.

"ఏంకావాలి?" అంది.

"పాండ్యన్‌గారు కావాలండి" అన్నాడు లింగరాజు.

"ఎందుకు?"

"ఆయనతో కొంచెం పనివుంది"

"మామధ్య సీక్రెట్లు వుండవు. ఏంపనో చెప్పండి".

లింగరాజు తటపటాయించాడు.





"భూమిమీదవద్ద సౌరశక్తి సెకెనుకి ఎన్ని కేలరీలు వుంటుందో అడిగి తెలుసుకుందామని"

ఆవిడ అతన్ని తేరిపారచూసి- "ఒక నిముషం" అని లోపలికి వెళ్ళింది. లింగరాజు సస్పెన్స్‌లో వుండగా ఆవిడ బయటకి వచ్చింది.

"ఇదిగో అబ్బాయ్. సెకెన్లో భూమిపైవద్దమొత్తం సౌరశక్తి 9.03×1015 కేలరీస్ అట"

"థాంక్సండి."

"డాక్టర్‌సాబ్, మీ ఫీల్డులో ఎక్కువగా వినిపించే పదం 'యాంటీ బయోటిక్'. అసలు ఈ 'యాంటీబయోటిక్' అంటే ఏమిటిసార్?" అడిగాడు లింగరాజు పేషెంట్లులేని ఆ డాక్టర్ దగ్గర కూర్చుని.

"ఈనాడు యాంటీబయోటిక్‌కి అర్థంతెలియని మెడికల్ రిప్రజెంటేటివ్స్ ఉన్నారన్నా ఆశ్చర్యపోనక్కరలేదు. ఏదైనా సూక్ష్మజీవినుంచి తయారుచేసిన మందు, అదే సూక్ష్మజీవిని నిర్మూలించడానికి ఉపయోగించే మందుని యాంటీబయోటిక్స్ అంటారు. ఉదాహరణకి బాక్టీరియా ఆర్జిన్‌నుంచి తయారుచేసిన మందు 'పైరోట్రాసిన్' దీనిని బాక్టీరియల్ ఇన్ఫెక్షన్‌మీద వాడతారు" అన్నాడా డాక్టర్ మహామేధావిలా.

డాక్టర్‌కి కృతజ్ఞతలు చెప్పి బయటపడ్డాడు లింగరాజు.

ఇంకా రెండుప్రశ్నలు మిగిలివున్నాయి. అవి ఫిజిక్స్‌కి చెందినవని అతని సిక్స్‌సెన్స్ చెబుతోంది.

కాలేజీకి వెళ్ళి ఎంక్వయిరీ చేస్తుండగా తంతే బూరెల బుట్టలో పడ్డట్టు ఏకంగా ఫిజిక్స్ ప్రొఫెసరే దొరికాడతనికి.

"ఎక్స్‌క్యూజ్‌మీసార్" అన్నాడు లింగరాజు. ప్రొఫెసర్‌గారు తలెత్తగానే-

"యస్" అనుమతిచ్చాడు ప్రొఫెసర్.

"సార్... 'హైడ్రోస్టాటిక్ థియరీ', 'ఇంటెగ్రల్ కాలిక్యులస్'లను ప్రతిపాదించిన శాస్త్రవేత్తలు ఎవరుసార్?"

"ప్లీజ్ టాక్ ఇన్ ఇంగ్లీష్" అన్నాడు ప్రొఫెసర్ అర్థంకాక. లింగరాజు సర్దుకొని ఆంగ్లంలో అడిగాడు అదేప్రశ్న.

"ఆర్కిమెడీస్ అండ్ ఐజాక్‌న్యూటన్ వర్ ది ఫౌండర్స్ ఆఫ్ హైడ్రోస్టాటిక్ అండ్ ఇంటెగ్రల్ కాలిక్యులస్ రెస్పెక్టివ్లీ" నవ్వుతూ చెప్పాడు ప్రొఫెసర్.

"థాంక్యూ వెరీమచ్‌సార్"

"నో మెన్షన్"

లింగరాజు మొహం వెయ్యిక్యాండిల్స్



బల్బులా వెలిగిపోయింది.

లింగరాజు నేరుగా ఇంటికి వెళ్ళారు. టేబులమీది పత్రికలోంచి కూపన్ కత్తిరించి ఆ కూపన్‌లో ఇచ్చిన అయిదుప్రశ్నలకింద సమాధానాలు వరసగా రాశాడు.

కూపన్‌దిగువన అడ్రస్ కాలమ్‌లో తనపేరు, చిరునామా రాసి కవర్లోపెట్టి పోస్టుచేశాడు.

★ ★ ★

నెలరోజుల తర్వాత ఆ పత్రికలో లింగరాజు ఫొటో ప్రచురింపబడింది.

మేము నిర్వహించిన అయిదు ప్రశ్నల క్విజ్‌లో పాల్గొని అనమానమైన తెలివితేటలను ప్రదర్శించిన లింగరాజుగారు అభినందనీయులు. ఈ క్విజ్‌లో అయనొక్కరే ఆల్‌కరెక్ట్ సమాధానాలు రాశారు. కాబట్టి యేటా మా పత్రిక ఇచ్చే 'క్లైవరాఫ్ ది ఇయర్' బిరుదును బహుమతి మొత్తాన్ని శ్రీ లింగరాజుగార్కి ఇస్తున్నాం అని వుందా ఫొటోకింద.

—కొల్లి మల్ల అప్పారావు

## పందెం

ఉదయం పదకొండు గంటల సినిమాకు వెళ్ళి టిక్కెట్టు దొరకక ఇంటిదారి పట్టాను.

దారిలో ఒక షోరూమ్‌వద్ద జనం గుంపుగా వుండటంతో దగ్గరకు వెళ్ళిచూశా. ఆ షాపులో వల వరుసగా నాలుగైదు టి.వి.లు ఆన్‌చేసి వున్నాయి. వాటిలో క్రికెట్ ప్రత్యక్షప్రసారం చూపిస్తున్నారు.

ఎలాగూ సినిమా లేదుకదాని క్రికెట్ పిచ్చి వదలని నేను కూడా ఆ గుంపులో చేరిపోయాను.

అలవాటుప్రకారం ఆడుతున్న ఇండియన్ క్రికెట్ ప్లేయర్ల బౌలింగ్‌కు వెస్టిండీస్ ఆటగాళ్ళు ఎడాపెడా షాట్లుకొడుతున్నారు.

ఓ పావుగంట తర్వాత నావక్కన నుంచుని ఆట చూస్తున్నతను నన్ను కదిపాడు. "ఎంతైనా మనవాళ్ళు భలేవారండి. వెస్టిండీస్ ఆటగాళ్లను చూడండి, ఎలా బోర్లా కొట్టిస్తున్నారో" అని కామెంట్ చేశాడు.

అతనివంక ఒకసారి ఎగాదిగా చూసి వూరుకున్నా.

మళ్ళీ కాసేపయిన తర్వాత "గురుగారు చూడండి- మనోడు ఎంత బాగా బౌలింగ్ చేస్తున్నాడో" అన్నాడు విపరీతంగా ఆనందపడిపోతూ. ఆయన 'మనోడు' అనటంచూస్తే ఆ ఆడేవాడు ఆయన తమ్ముడేనేమో అన్నట్లుంది.

నేను వినుగ్గా ముఖంపెట్టి- "వీళ్ళెంత చక్కగా బౌలింగ్ చేసినా వెస్టిండీస్ ధాటికి తట్టుకోరులెండి" అన్నా అతని మాటల్ని తీసిపారేస్తూ.

దానికతడు సీరియస్‌గా నావైపు చూస్తూ- "అలాగంటారేంటి, మనవాళ్ళు ఎలాగైనా వెస్టిండీస్‌పైన గెలుస్తారండి. మనవాళ్ళు ఈసారి చాలా పట్టుదలగా వున్నారు" అన్నాడు మనవాళ్ల పట్టుదల గురించి బాగా తెల్సినట్టు.

నాకు వళ్ళు మండిపోయింది. "ఎంతైనా ఇండియా ప్లేయర్స్ ఇండియా ప్లేయర్సేనండి. మనవాళ్ళకు గెలుపుకాదు రాజకీయాలు ముఖ్యం" అన్నాను కసెక్కిపోతూ.

అతనేమనుకున్నాడో ఏంటో ఉన్నట్టుండి, "ఇండియా గెలుస్తుంది- పందెం" అన్నాడు నన్ను రెచ్చగొడుతూ రోషంగా

ఈ మాటలు వింటున్న అందరూ నావైపు చూడసాగారు. నేను నిజంగానే రెచ్చిపోయాను. "కాయండి... పందెం ఎంత?" అన్నా- జేబులోంచి పర్సుతీస్తూ.

"మీరే చెప్పండి" అన్నాడతను.

"వంద!"

"సరే... వంద"

ఇద్దరం చెరోవంద బయటకు తీశాం. మిగిలిన ప్రేక్షకులు మావైపు కుతూహలంగా చూడసాగారు.

మాతోపాటే టి.వి. చూస్తున్న ఒక వ్యక్తిని మధ్యవర్తిగా వుండమని చెరోవంద ఆయన చేతిలోపెట్టాం.

మా ఇద్దరిలో ఎవరు పందెం గెలిస్తే ఆ రెండొందలు వాళ్ళకు వెళ్తాయని చెప్పాం.

టి.వి.లో క్రికెట్ సాగుతోంది.

మేమిద్దరం ఒకరినొకరం ప్రత్యర్థుల్లా చూ







నుకుంటున్నాం. అతను నావైపు చూసినపుడు హేళనగా నేను అతనివైపు చూస్తుంటే, నేనత నివైపు చూసినపుడు పరిహాసంగా అతను నావైపు చూస్తున్నాడు.

మధ్యాహ్నం రెండుగంటలకు వెస్టిండీస్ ఆటగాళ్ళు యాభై ఓవర్లలో కొన్ని పరుగులు తీసారు. మళ్ళీ మూడుంపావుకు తిరిగి ప్రసార మని టి.వి. ఎనౌన్సర్ చెప్పడంతో ఆ షోరూమ్‌వ ద్ద మూగిన జనం నెమ్మదిగా పలచబడ్డారు.

"చూడండి మనవాళ్ళు. చాలా తక్కువ పరుగులు ఇచ్చారు" అన్నాడు అతను నావైపు చూస్తూ.

"అవుడే ఏమయింది? మధ్యాహ్నం చూ డండి- వెస్టిండీస్ ఆటగాళ్ళు ఎలా ఆడతా రో!" అని మధ్యవర్తికేసి చూశాన్నేను.

ఏడీ.... అతనేడీ?

అప్పటికే షోరూమ్‌వద్ద వున్న జనం అంద రూ వెళ్ళిపోయారు.

"మనం డబ్బులిచ్చిన అతడేడండీ?" ఏడుపుముఖంతో అడిగానతన్ని.

"ఏడీ?" ఇంచుమించు నాలాగే ఏడుపు ముఖంపెట్టుకుని నన్నే అడిగాడతను.

మేము క్రికెట్ గొడవలో వుంటే ఎవుడు జారుకున్నాడోగానీ పందెం డబ్బులు రెండొంద లూ పట్టుకుపోయారా మధ్యవర్తిగారు.

—బురాడ భార్గవి

## స్టోరీ

"మీరు కథలు రాసిన సినిమాలన్నీ హిట్ట య్యాయి. అందుకే వెతుక్కుంటూ మీదగ్గరకొ చ్చాం" అన్నాడు ప్రొడ్యూసర్.

"నిజమే కానీ ఈమధ్య నాకు ఒంట్లోబా గుండక ఏమీరాయటంలేదు. మీ తరువాతి పిక్చర్‌కి చూద్దాంలెండి" అంది రచయిత్రి.

"పోనీ! ఇదివరలో రాసినవి వుంటే ఇవ్వండి"

"అందుకుకూడా క్షమించాలి. నాదగ్గర ప్ర స్తుతం ఏమీలేవు" అందా రచయిత్రి.

"అమ్మమ్మ... అంతమాటనకండి! మాసిని మాకి మీరు కథ రాయకతప్పదు" పట్టుదలగా



అన్నాడు ప్రొడ్యూసర్.

"మీరంతగా పట్టుబడుతుంటే కాదనలేను. నరే... ఓ కథకి ప్లాటుంది. చెబుతాను. మీకు అది నచ్చితే సినిమాకి రాస్తాను" అంది రచయిత్రి నవ్వుతూ.

"అలాగే" అన్నారు ప్రొడ్యూసరూ, ఆయన వెంట వచ్చినవారూ ఏకగ్రీవంగా.

రచయిత్రి కథ చెప్పింది.

బావుందంటే బావుందన్నారు ప్రొడ్యూసరూ, అనుచరులూ.

"కథ సినిమాకి ప్రాణం. కనుక కథకి ఓ ఏభైవేలివ్వాలనుకున్నాం. ఈ వెయ్యి అడ్వాన్సుగా పుచ్చుకోండి. పదిరోజులయ్యాక మిగతా దిచ్చి కథ పట్టుకెళ్తాం" అంటూ బయటికినడిచాడు ప్రొడ్యూసర్— శిష్యులు అతన్ననుసరించారు.

"అదేమిటిసార్... కథకి యాభైవేలు ఖర్చు పెట్టడం దండగకాదా?" అన్నాడు ఓ శిష్యుడు బయటికివచ్చి కారెక్కాక.

"మళ్ళీ ఇటు రానూ రాము. ఆమెకి డబ్బులూ ఇవ్వం. ఇచ్చిన ఈ వెయ్యేచాలు. ఆవిడ రాసేదేంటి ఆ ప్లాటుతో మనం కథ డెవలప్చేస్తాం. దానికి మాఆవిడ పేరెడతాం" అంతే అన్నాడు ప్రొడ్యూసరు.

"ఆఁ" ఆశ్చర్యపోయారు శిష్యులు. కారు కదిలింది.

వాళ్ళలా వెళ్ళగానే రచయిత్రిగారి భర్త ఆవిడమీద ఎగిరిపడ్డారు.

"అదేమిటే! వెయ్యిరూపాయలకే కథ ఎందుకుచెప్పావ్. నీప్లానుతో కథ రానుకుంటారు ఆవెధవలు. మళ్ళీ వచ్చి మిగతా 49 వేలిస్తారనే అనుకొంటున్నావా? ఎంతనష్టపోయాం" వాపోయారు రచయిత్రిగారి భర్తగారు.

"వాళ్ళు కథ కావాలని చంపేస్తుంటే ఏంచేసేదండీ! సడన్‌గా ఎప్పుడో, ఎక్కడో చదివిన కథ గుర్తుకొచ్చింది. అదే వినిపించా. వాళ్ళు మళ్ళీ రాకపోయినా మనకేం నష్టంలేదు. అనలురాకపోవటమే మంచిది. వెయ్యిరూపాయలు చాలు- నేచెప్పినకాపీ కథకు" అంది రచయిత్రి చిద్విలాసంగా.

భార్యతెలివికి నోరెళ్ళబెట్టారు భర్తగారు.

—కాశీభట్ట భానుమూర్తి

# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు వుంటుంది "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరినిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివ
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజ
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావించా
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

## చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500483

# మమతలు

స్వార్థమెరుగనిది అమ్మ ప్రేమరాకన్నా!
స్వర్గసౌఖ్యాలకన్నా అదియెంతో మిన్నా!!

హమ్మయ్య! తప్పించుకువచ్చాం!
వేటగాడి 'కళ్ళల్లో దుమ్ము భలేగా కొట్టాం!!

ఆలోచనాలోచనాల్లో వైరాగ్యతరంగాలెన్నో!
స్రవించేక్షీరధారల్లో రంగరించిన సుధలెన్నో!!

కాళ్ళు పొడవు గజం మెడల పొడవు గజం!
చారెడు గింజలు తిని తిరిగేం జగం జగం!!

ముద్దులొలికేను నా కోతిపిల్ల!
మూడుకోట్లిచ్చినా అమ్మటంకల్ల!!

పిల్లకోతి ముద్దులో పులకింతల అనుభూతి!
ఆరమూసిన తల్లి కన్నుల్లో తళుకొతెను వింతకాంతి!!

122

ఆకారం భీకరమైనా!
మకరాలకూ మమతలుండునన్నా!!




"చూడు ఆనందం! నేనొక మాట చెబుతాను జాగ్రత్తగా విను - మనిషికి తోడుకావాలి. శారీరకంగాగానీ మానసికంగాగానీ అలసిపోయిన మనిషి సేదతీర్చుకోవడానికి ఒక తోడు లేకుండా బ్రతకటం కష్టం. నా భార్య దగ్గర నేను పొందలేకపోయిన సాంత్వన, నీ భర్త దగ్గర నువ్వు పొందలేకపోయిన మనశ్శాంతినీ మనం పూడ్చుకుందాం. మానసికంగా ఒంటరితనంతో బాధపడే నాకు ఆర్తిగా పెనవేసుకోవటానికి మనిషి కావాలి. తాళికట్టమని మాత్రం అడుగకు. తాళికట్టిన భార్యలాగే చూసుకుంటాను. నువ్వూ అలాగే వుండు. నువ్వు ఒప్పుకుంటే నీకు నేను... నాకు...నువ్వూ" అంటున్న అతనికి ఏంసమాధానం చెప్పాలో తోచక ఆలోచనల్లో వుండిపోయిందామె.

ఒక రోజంతా ఎంతగానో ఆలోచించి ఆమె తీసుకున్న నిర్ణయం ఏమిటి? సయోధ్య లోపించిన సంసారాలు ఏ మార్గంలో పయనిస్తున్నాయి?

**చదవండి! సరికొత్త తరహాలో 'సంచారి' కలం నుండి జాలువారిన తాజా నవల నాలుగోముడి**

---

## మార్చినెల చతురలో

---

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M139 |
| పుస్తకం పేరు | చతుర |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 131 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Jayalakshmi |
| పేజీలు విడదీసినది | Jayalakshmi |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |